"అసంభవమని తెలిసినా, ఎంతటి స్థిరచిత్తుడూ కలలు కనకుండా ఉండలేడు. మనిషి వాస్తవ ప్రపంచంలో కంటె రెట్టింపు అందమైన, మధురమైన సంసారం ఊహా జగత్తులో చేస్తాడు. ఊహా ప్రపంచంలోని సంతోషం, సౌందర్యం వాస్తవ ప్రపంచంలో ఉండకపోవడమే అందుకు కారణమేమో!"

**శ్రీమతి పోల్కంపల్లి (—నాగూరి) శాంతాదేవి:** జననం - 1942, వనపర్తి (మహబూబ్ నగర్ జిల్లా) లో. మెట్రిక్యులేషన్ పరీక్ష పాసయ్యారు. 1959 నుంచీ రచనలు చేస్తున్నారు. 'పాణిగ్రహణం', 'బాటసారి', 'రక్త తిలకం', 'స్వీకృతి', 'జీవన సంగీతం', 'సుమలత', 'పూజాసుమం', 'దేవదాసి' మొదలైన నవలలు వెలువరించారు. 'సమర్పణ', 'ప్రతీక్ష' అనే రెండు కథా సంపుటాలు ప్రచురించారు. వీరి 'జీవన సంగీతం' సినిమా కథల పోటీలో బహుమతి పొందింది. పుస్తక పఠనం, రచనా వ్యాసంగం- సరదాలు.

By

POLKAMPALLI SANTHA DEVI

Publishers :
M. SESHACHALAM & CO.

First Edition :
FEBRUARY, 1971

Cover Design :
BAPU

Printers :
KRANTI PRESS, Madras-1.

Distributors :

ANDHRA PRADESH BOOK DISTRIBUTORS,

RASHTRAPATHI ROAD, SECUNDERABAD.

Price Rs. 2/50



# 1

"నీ ఆలోచన ఏమిటి? ఇంకా చదువా, పెళ్ళా?" నవ్వుతూ అడిగింది రేవతి, భామని. అరోజే పి. యు. సి. పరీక్ష ఫలితాలు తెలి శాయి. రేవతి, సత్యభామ, మోహిని, ఉమ నలుగురూ సెకండ్ క్లాసులో పాసయ్యారు. పాసయిన సంబరంలో సినిమా ప్రోగ్రాం వేసుకొని బయల్దేరారు. దారి పొడుగునా భవిష్యత్తులో ఏమిటన్న చర్చ సాగింది.

మోహినికీ, ఉమకూ పెళ్ళిళ్ళు నిశ్చయ మయ్యాయి. చదువాలన్న కోరిక వున్నా- చదవడం, చదవకపోవడం కాబోయే భర్తలమీద ఆధార పడివుంది. రేవతి బాగా సంపన్నుల అమ్మాయి. ఆమె కిప్పుడే వివాహం చేసుకోవాలన్న ఇచ్ఛలేదు. ఆమె కోరినంత వరకు చదివేందుకు ఆమె తల్లిదండ్రులు అనుకూలురు.

సత్యభామ- చదువుకోవాలన్నా పెళ్ళి [illegible] కొంచెం ఆలోచించ వలసిన మధ్య తరగతి కుటుంబం లోనిది. ఒక విధంగా, ఇన్నాళ్ళూ తగిన సంబంధాలు దొరకకే నత్తేరుమీద బండిలా సాగుతూ వచ్చింది చదువు. మరి ఇప్పుడూ అదే సమస్య ముందున్నది. సత్యభామకు చదువుకోవాలని ఉంది. అయితే, పెళ్ళి అంటే విముఖత కూడా లేదు. అదే సంగతి చెప్పింది. "చదువుకోవాలనే ఉంది. కాని, అమ్మా వాళ్ళు సంబంధాలు చూస్తున్నారు. ఇప్పుడే వద్దని పట్టుబడదామంటే- మూర్ఖమనిపించు కొంటుందేమో! మా కుటుంబ పరిస్థితులు అలాంటివి."

"నీ సంగతి చెప్పవోయ్, మొదట. చూడబోతే పెళ్ళికి తొందర పడిపోతున్నట్లున్నావు!" మోహిని మోచేత్తో పొడిచింది.

"బజాయిలు కొట్టడం నా తత్త్వంకాదు. నేనేం పురుష ద్వేషి జేని కాను. ఇప్పుడేవేవో ఆశలతో, ఆశయాలతో కాదనుకున్నా ఆడ దాని జీవితంలో తప్పని ఘట్టమది. అనుకూలమైన సంబంధమైతే అమ్మా వాళ్ళ మాటకు కట్టుబడి పోవాలనే నా కోరిక."

సంబంధాలు అనుకూలించక పోతే చదువు కొనసాగిస్తావా?"

"అప్పుడు మరో సమస్య మెడకు చుట్టుకొంటుంది తెలుసా? స్కూల్ ఫైనల్‌తో ఆగిపోవలసిన చదువు ఊరికే ఇంట్లో కూచోడ మెందుకని బి. ఏ. వరకు వచ్చింది. ఈ బి. ఏ. కు పెట్టిన ఖర్చుకాక ఈ డిగ్రీకి అర్హమైన వరుడికోసం మరికొన్ని వేలు అదనంగా ఖర్చు పెట్టవలసి వస్తుంది మావాళ్ళకు. మరి ఎమ్. ఏ. నో ఇంకేదో అయితే ఏ డాక్టరునో, ఇంజనీర్‌నో తేలేరు. అప్పుడింక పెళ్ళి పెటాకులు లేక నా డిగ్రీని పూజిస్తూ ముసలిదాన్ని అయిపోతాను, అలాంటి నిస్సార మైన జీవితం నేను కోరడంలేదు. ఇప్పుడే కళ్యాణం కలిసి రాక పోయినా చదువు మాత్రం కొనసాగించను."

* * *

"ఇంకా లేవ వేమమ్మా, భామా? పెళ్ళికొడుకు పెళ్ళి చూపులకు వచ్చేవేళకూడా మొద్దు నిద్రేనా? లే, లే. వాళ్ళు పదిగంటలకల్లా వచ్చే స్తారట!"

వదినగారి మేలుకొలుపులకు బద్ధకంగా ఒళ్ళు విరుచుకొంటూ లేచింది సత్యభామ, సిగ్గుగా, చిన్నగా నవ్వుతూ. ముఖం కడుక్కొని ఏకంగా స్నానంకూడా చేసేసి వచ్చింది.

"తొందరగా కానియ్యి. మీ అన్నయ్య వెళ్ళాడు వాళ్ళను తీసుకు రావడానికి, బస్సు దగ్గరికి," పెళ్ళి చూపులకు భామ కట్టుకోవలసిన చీరతో నిలబడి పెదవదిన తొందర పెట్టింది.

చీర చేతికి తీసుకొంది భామ. అది పెద్ద వదినకు వాళ్ళ పుట్టింటి వాళ్ళు వడి బియ్యం పెట్టిన చీర. చాలా విలువైన జరీ చీర. భామ పెట్టె లోనూ కావలసినన్ని చీరలు ఉన్నాయి. వాటిలో ఆమెకెంతో ఇష్టమైన లేతనీలం ఫుల్‌వాయిల్ చీర ఉంది. ఇప్పుడు అదే కట్టుకోవాలనుకుంది. కాని పెద్ద వదిన ఇచ్చిన చీర తీసుకోకుండా ఉండలేక పోయింది. ప్రతి

వ్యక్తికీ కొన్ని ప్రత్యేకమైన ఆశయాలు, అభిరుచులు ఉండడం విశేషమైన సంగతే. కాని, ఆత్మీయులైన వ్యక్తులకోసం కొన్ని సందర్భాలలో వాటిలో సడలింపు విజ్ఞత.

అందులోనూ ఈ పెళ్ళి సంబంధం పెద్ద వదిన ద్వారానుంచి వచ్చింది. వరుడు ఆమె పెదనాన్న కొడుకు. వరకట్నం విషయంలోనూ, పిల్ల గుణగణాల గురించి నచ్చచెప్పడంలోనూ ఆమె సిఫార్సు గట్టిగా ఉంటుంది. ఈ పరిస్థితిలో పెద్ద వదిన మాటకు ఎదురు చెప్పడం మూర్ఖమౌతుందేమో. ఈ అదను చూసుకొనే పెద్ద కోడలి హంగామా, పెత్తనం ఎక్కువయ్యాయి ఇంట్లో.

"సరోజినీ! ఇలారా, ఒకమాట....." హడావిడిగా కేకవేసింది భామ తల్లి. ఈ సంబంధం చెడగొట్టినా, కుదిర్చినా పెద్ద కోడలిచేతిలో ఉంటుంది కాబట్టి ఎన్నడూలేని గౌరవ భావంతో చూస్తోంది ఆమె, కోడలిని. ఎన్నడూ లేనిది ప్రతి దానికీ పెద్ద కోడలి సలహా తీసుకుంటోంది.

మామూలుగానే అలంకరించుకుంది భామ, తనకు అలవాటు ఉన్న పద్ధతిలోనే. కట్టుబొట్టు రోజుకో విధంగా మార్చుకొనే అలవాటు ఆమెకులేదు. అలంకరణలో కొత్త కొత్త పద్ధతులు అలవరచుకోవాలంటే ఏమిటో ఎబ్బెట్టుగా ఉంటుంది. సంకోచంగా సిగ్గుగా ఉంటుంది. ఏదో ఎరువు సొమ్ముకు ఒంటిమీద చోటిచ్చినట్టుగా ఉంటుంది.

అంతపొడుగూ పొట్టీ కాకుండా, పుష్టిగా ఎదిగిన అంగ సౌష్ఠవంతో కొంచెం లావుగానే కనిపిస్తుంది భామ. బాగా ముఖం దిద్దీ, స్నో, పౌడరు పట్టిస్తే తెల్లని వర్ఛస్సేనని భ్రమపడొచ్చుగాని చామన చాయలోకే వస్తుంది ఆమె ఒంటి రంగు. కాని, కోమలమైన అందం ప్రస్ఫుట మౌతుంది ఆమె కనుముక్కు తీరులో.

'ఎలా ఉంటాడో అతడు?....అతడికి తను నచ్చుతుందో లేదో?'

ఇదివరకు పెళ్ళిచూపులు జరిగికూడా రెండు సంబంధాలు తప్పిపోయాయి. గట్టిగా కావాలనుకుంటే వాళ్ళడిగిన కట్నం కానుకలకు ఒప్పుకొని సంబంధం స్థిరపరుచుకొనే వాళ్ళేమోగాని, అప్పుడంతగా

ఆ సంబంధాలు తప్పిపోవడం భామకు కూడా కించగా తోచలేదు. చదువులో లగ్నమైన మనసుకు పెళ్ళి కావాలన్న ఉబలాటం లేదప్పుడు. ఇప్పు డలాకాదు. పెద్దలకూ, భామకూ కూడా ఈ సంబంధం స్థిరపడి వీలైనంత త్వరలో పెళ్ళి జరిగి పోవాలన్న పట్టుదల ఉంది.

అనుకొన్న సమయానికి కొంచెం అటు ఇటుగా హాల్లో సందడి వినవచ్చి గతుక్కుమంది భామ. మరికొన్ని నిమిషాల్లో వరుడి సమక్షంలో నిలబడ బోతుందను కొనేప్పటికి ఏదో బిడియం, పులకింత. వీటిని ఒక ఊపు ఊపేస్తూ ఈ పెళ్ళి చూపుల పరీక్ష ఎలా తేలుతుందో నన్న భీతి భామను ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయి.

లాంఛన ప్రాయమైన మాటలు, మర్యాదలు ముగిశాయేమో—

"పద" అంటూ వచ్చింది పెద్ద వదిన. జారిన పయిట భుజంమీదికి సర్ది జబ్బపట్టి నడిపించబోయింది.

"అబ్బా! ఏమిటిది, వదినా?" సున్నితంగానే విడిపించుకొంది భామ; "బొమ్మ అనుకొని అపోహ పడేరు!" నవ్వింది.

"నే చెబుతాలే - సత్యభామ అని."

వదిన హాస్యానికి భామ పెదవులమీద నర్తించిన నవ్వు చెదరి పోకుండానే హాల్లో ప్రవేశించి పెళ్ళి చూపులకు తివాసీమీద ఆశీన అయింది.

పక్కనే కూచున్న సరోజ చెప్పింది చెవిలో- "ఆమె వరుడి పెద్ద వదిన. ఆయనే మా పెదనాన్న," అంటూ.

"పేరేమిటన్నారు?" అంటూ మొదలుపెట్టింది సస్నేహంగా నవ్వుతూ వరుడి వదినగారు.

"సత్యభామ," కొంచెం నవ్వుతూ చెప్పింది సరోజ. "అసలు పేరు సత్యవతి. కాని, సత్యభామలా కొంచెం మొండిపట్టు, పెంకెదనం ఎక్కువ కాబట్టి చిన్నప్పుడు వాళ్ళ మేనమామ సత్యభామ అని పిలిచేవారట. అందరినోటా అదే పడిపోయింది."

"పిల్ల నిస్తామంటూ చాల సంబంధాలు వచ్చాయి. హైదరాబాదు వాళ్ళు పదివేల కట్నం, పిల్లకు ఇల్లు ఇచ్చి పెళ్ళి ఘనంగా జరిపిస్తా

మంటూ కబురు చేశారు. పిల్లకూడా బాగుంటుందట. కాని చదువు తక్కువ. చదువుకున్న అమ్మాయి కావాలని మా మరిది సరదా పడుతు న్నాడు. అందుకని ఆ సంబంధం కాదని చెప్పేశాము."

'ఓహో! అభ్యుదయ భావాలుగల యువకుడేమో!' ఓరగా చూచింది వరుడివైపు, భామ. సగర్వమైన హాసరేఖ ముఖంలో మెరుస్తూంటే పక్క చూపులు చూస్తున్నాడు అతడు.

తను కూచున్నది పెళ్ళిచూపులకు అన్న విషయమే మరచిపోయి నట్లు చటుక్కున అనేసింది భామ: "సమాజంలో చదువుకొన్న భార్య అని చెప్పుకొని గర్వపడే ఆధునిక పురుషుడే- సంసారంలో ఆమె చదువుకొన్న సంస్కారాన్నీ, తెలివితేటల్నీ భరించలేక రెండు జీవితాల్నీ నరకం చేస్తున్నాడు. అంత రాంతరాలలో పురుషాధిక్యాన్ని తొలగించుకో లేనినాడు- అదొక భ్రాంతి మాత్రమే."

"అని మీలాంటి అభ్యుదయ యువతుల అపోహ!" చాలా నెమ్మదిగా అన్నా వెటకారం స్ఫురించక పోలేదతడి మాటల్లో. "అప్ప టికీ, ఇప్పటికీ స్త్రీ జీవితం బాగా మెరుగుపడింది. ఆమెకు పురుషుడి వల్ల సంసారంలోనూ, సమాజంలోనూ జరిగే చాలా అన్యాయాలు వారింప బడ్డాయి. కాని, పురుషుడిమీద అధికార మిచ్చినా, పురుషుడిని మించిన ఆధిక్య మిచ్చినా తరతరాలుగా ఆమెలో జీర్ణించుకొన్న బానిసత్వపు లక్షణమేమో ఇంకా మాకు న్యాయం జరుగలేదని గోల పెడుతూ ఉంటుంది!"

అతడు చేసిన అవమాన పూరితమైన మందహాసానికి ఒళ్ళు మండింది భామకు "పురుషుడు స్త్రీని తలమీద పెట్టుకొంటానన్నా అతడి పాద ధూళిలోనే ఆశ్రయంకోరే స్త్రీ ఆమె ఔన్నత్యానికి బదులు, బానిసత్వపు లక్షణాలు కనిపిస్తున్నాయంటే అదెంత మూర్ఖమో అదెంత అహంకారమో చూడండి. ప్రకృతి పురుషుల మధ్య ఉండ తగిన సుమధురమైన సంబంధాన్నే మీరు సక్రమంగా అర్థం చేసుకో లేక హీన పరుస్తున్నారు!" అనేసి మౌనం వహించింది భామ. యువతీ యువకులమధ్య ఇలాంటి వాగ్వివాదాలు నేటి కాలంలో సహజమే అయిపోయినా ఇప్పుడదసందర్భం! వివాహానికి ముందు వధూవరులు

పరస్పరం మాట్లాడుకొని, అభిప్రాయిలు తెలుసుకొని దాంపత్యాన్ని అంగీకరించడం కథల్లో, ఊహల్లో సాధారణ విషయ మేమోగాని, నిజ జీవితాలలో చాలా అసందర్భం, అనుచితం.

విసురుగా చెవి గిల్లింది కూడా సరోజ. గుమ్మంలో నిలబడి అమ్మా వదిన కోపంగా చూస్తున్నట్టు గమనించింది భామ.

సరోజను మందలింపుగా చూసి, చిరునవ్వు నవ్వుతూ అంది వరుడి వదిన: "ఫర్వాలేదు. మాట్లాడండి. చదువుకొన్న వాళ్ళిద్దరూ- బొత్తిగా మా కాలపు పెళ్ళి చూపులే అయితే అందంలేదు."

భామ తల్లి కల్పించుకుంటూ, "దాని మొహం. ఏం మాట్లాడు తుందిలే! దేవుడు వ్రాసి కళ్యాణం జరిగితే అప్పు డిద్దరూ బలాబలాలు తేల్చుకొంటారు గాని," అంది. ఈ కాలం ఫాషన్‌లే అని సరదాపడి వాళ్ళనలా వదిలేస్తే, కళ్యాణం కలసిరాక ఈ సంబంధం తప్పిపోతే- పిల్లమీద లేనిపోని కల్పనలు ఎన్నయినా ప్రచారమై పిల్లకు మరో సంబంధం కుదరడమే కష్టం కావచ్చు. ఇప్పటికే బరితెగిన పిల్లని వాళ్ళేమను కొంటున్నారో! పై కలా అన్నా- "దీనికేం పుట్టిందో, చదువుకొన్న తెలివి అంతా ఇప్పుడే ఒలకబోసుకోవాలి?"- అనుకుంది తనలో.

సత్యభామ మౌనం, పెద్దవాళ్ళ అనుష్టతా గమనించిన వరుడు కూడా ఆమెను కవ్వించలేదు.

వరుడి వదినగారు వేసిన రెండు మూడు ప్రశ్నలకు తగువిధంగా సమాధానం యిచ్చి నెమ్మదిగా లేచి వచ్చేసింది భామ.

వస్తూనే బుగ్గ పొడిచినంతపని చేసింది తల్లి. "వాళ్ళడిగిన దానికి నెమ్మదిగా సమాధాన మిస్తే సరిపోయేది. అలా మాట్లాడొచ్చా?"

"అది చర్చావేదిక అనుకొన్నావా? పెళ్ళిచూపు లనుకొన్నావా?"

తల్లి ఛీత్కారానికీ, చిన్న వదిన వెటకారానికీ సమాధానం యివ్వకుండా మౌనంగా తన గదిలోకి వెళ్ళి దుస్తులు మార్చుకో సాగింది భామ.

ముఖం ముడుచుకొని వచ్చింది సరోజ. "పోకిరీపిల్ల అని అనుకొనేట్టు చేశావు, భామా! పెళ్ళిచూపులకని వచ్చిన అబ్బాయిని

నచ్చలేదు నీ ఆవేశం."

"అలా మాట్లాడడం అసందర్భమౌతే కావచ్చుగాని, అనుచిత మేముంది?" సమర్థించుకొంది భామ.

భామ విజ్ఞానం ఒలక బోసు కోవడంవల్ల ఈ సంబంధం తప్పి పోవడం ఖాయమనే దృఢపరుచు కొన్నారంతా. కాని వారం తిరగకుండానే అబ్బాయి తండ్రి నుండి ఉత్తరం వచ్చింది. మా వాడికి పిల్ల నచ్చింది. తరువాత విషయాలు మాట్లాడుకోడానికి ఫలానా రోజు ... మీరు రావలసిం," దంటూ.

* * *

"శ్రీ జగన్మోహనరావుగారికి,

నమస్కారాలు. నేను మీకు నచ్చడం, నాతో వివాహా నికి అంగీకరించడం నాకంత ఆశ్చర్యంగా తోచలేదుగాని మా వాళ్ళకు ఆశ్చర్యంగానే ఉంది. చదువుకొన్న భార్య కావాలని కోరుకొన్నవారు ఆ మాత్రం నా ఆవేశం అర్థం చేసుకోక పోరన్న ధైర్యం నాకుంది. నా అభిప్రాయాలు మీవి కాక పోయినా మీ సాహచర్యం నా కంగీకారమే. నాకు కొన్ని ఆద ర్శాలు ఉన్నప్పటికీ ఆత్మాభిమానం కించపడ నంత వరకు రాజీ మార్గం అంగీకరించడం నా తత్వం.

"అయితే, మిమ్మల్ని ఒకటి అర్థిస్తున్నాను. ఇది చిన్న కోరికో, పెద్ద కోరికో మీ సహృదయత మీద ఆధారపడి ఉంది. కట్నం కానుకల విషయం మాట్లాడుకోడానికి మావాళ్ళు వస్తు న్నారు, మీ నాన్నగారు వ్రాసిన ఉత్తరం చూసుకుని. శక్త్యాను సారంగా మావాళ్ళు లాంఛనాలు సమర్పించుకోడానికి సిద్ధంగా ఉన్నారు. అందినంత వరకూ కట్నం పుచ్చుకోడానికి మీవాళ్ళకూ అభ్యంతరం ఉండదను కొంటాను.

"ఈ కట్నం కానుక లంటే నాకు గౌరవం లేదు. ఒక విధంగా కన్నెపిల్ల కుటుంబాన్ని పీడించి పీల్చి పిప్పిచేసే ఒక దురాచారం. ఇలాంటి దురాచారం మన వివాహంవల్ల జరుగ

కూడదని నా కోరిక. కట్నం ఆశించని సహృదయుడిని భర్తగా పొందాలను కోవడం నేటి సాంఘిక పరిస్థితులనుబట్టి పేరాశే. అయినా, నాలాంటి చదువుకొన్న యువతి అలా కోరడంలో అసందర్భం లేదనుకొంటాను. నా కోరిక మన్నించే సహృదయత మీకుంటే కట్నం లేకుండా మన వివాహం జరుగనివ్వండి.

"కాకపోయినా సరే. కట్నం తీసుకున్నా, తీసుకోక పోయినా పెళ్ళి అక్కర్లేదనే ధైర్యం నాకు లేదు. సామాజిక మర్యాదలను విస్మరించే స్వప్నాలకు ఎక్కువగా స్థాన మివ్వను మనస్సులో.

"నా కోరికనూ, ఈ ఉత్తరాన్ని వ్రాస్తున్న సాహసాన్నీ అవహేళన చేయరని ఆశిస్తూ—

—సత్యభామ."

పోస్టు చేయడానికి ముందు బాగా ఆలోచించింది భామ, అందు వల్ల అనర్థం సంభవించదు కదాని. 'సహృదయుడైతే ఈ లేఖ ఒక విజ్ఞప్తిగా భావిస్తాడు. కాకపోతే, అలాంటి కుసంస్కారితో తన వివాహం జరుగకపోవడమే మంచిది!' అని నిశ్చయించు కొన్నాక ఉత్తరం పోస్టు చేసింది.

అతడి నుండి ఏదో ఒక సమాధానం రాగలదని ఆశించింది భామ. కాని, భామ తండ్రి ప్రయాణమై వెళ్ళేరోజు వరకూ ఎలాంటి ఉత్తరమూ రాలేదు.

'బహుశః, ఈ సంబంధం కుదరకపోవచ్చు. నాన్నకు ఆ ఉత్తరం చూపించి, "మీ అమ్మాయి యిలాంటిది. నా కక్కర్లేదు," అంటాడేమో. తను అలా వ్రాయకపోయినా బాగుండేదేమో!' మథన పడింది.

భామ గతుక్కుమంది, వీథిలో రిక్షా దిగుతున్న తండ్రిని చూసి. చిరుచెమటలు ఉబికాయి. 'తను చేసింది అంత అనుచితమైన పని కాదు. కాని, ఆకుసంస్కారి ఎంత అసభ్యంగా నిరూపించాడో?' జరుగ

బోయే రాద్ధాంతానికి తట్టుకొనే మనస్థైర్యం కూడగట్టు కుంటూంది భామ.

వస్తూనే ఎదురుపడే ధైర్యం లేక వరండాలోంచి లేచి వచ్చేసింది తన గదిలోకి.

"అదృష్టవంతురాలివే, భామా!" అంటూ తండ్రే వచ్చాడు అక్కడికి. అక్కడి పురోహితుడు వ్రాసిన లగ్న పత్రిక కూతురికి అందించాడు. "చి॥ సౌ॥ సత్యవతిని, చి॥ జగన్మోహనరావు ఎల్. సి. ఇ. కి ఇచ్చి...." తృప్తిగా నవ్వుకుంది భామ.

"ఎంతలో కుదుర్చుకు వచ్చారు?"ఆత్రంగా వచ్చింది భామ తల్లి.

"అయిదు. లాంఛనాలు మరొకటి, మన అమ్మాయి అదృష్ట వంతురాలు. అత్త, మామ చాలా మర్యాదస్థులు. పిల్లవాడు ఉత్తముడు. చవగ్గానే పడిందీ సంబంధం," పూర్తి తృప్తితో వెలిగిపోతూంది ఆయన ముఖం.

కాళ్ళు చేతులు కడుక్కొని టీ తీసుకొంటూ అక్కడి సంగతు లన్నీ తండ్రి వివరిస్తూంటే విస్మయంతో మునకలు వేస్తూంది భామ మనస్సు. 'మధ్యలోనే గల్లంతు అయిందేమో తన ఉత్తరం. అందితే మాత్రం నాన్న పయనం ఇలా ముగిసేది కాదు!'

కాని, ఆమె ఊహనూ, అపోహనూ తలక్రిందులు చేస్తూ ఆ మరునాడే అతడి నుండి ఉత్తరం వచ్చింది భామకు.

ప్రియమైన భామకు,

ఇలా చనువుగా, ప్రేమగా సంబోధించే హక్కు సంపాదించాకే వ్రాద్దామని నీ లేఖకు జవాబు ఆలస్యం చేశాను.మరోలా భావించకు. నీ కోరిక సమంజసమే. అవహేళన చేయవలసిందేముంది అందులో? చదువుకొన్న యువతివి. నీకు కొన్ని ఆదర్శాలు, అభిప్రాయాలు ఏర్పడి ఉండడంలో తప్పు లేదు. అవి చిత్త శుద్ధిగా కలిగి ఉన్నప్పుడు ఆపాటి సాహస ప్రయోగమూ అవసరమే.

కన్నెపిల్ల దృక్పథంలో వరకట్నం దురాచారమే కాదు, దుష్ట రాక్షసి కూడా. కాని, నేను మగవాడిని. ధనలాభం ఉన్న

చోట అలాంటి భావాలు ఉత్పత్తికావడం చాలా అరుదైన సంగతి. ఇదివర కెప్పుడూ వరకట్నానికి విరుద్ధంగా మాట్లాడని వాడిని, ఇప్పుడు నిన్ను చూశాక, 'కట్నం లేకుండా ఆ పిల్లను చేసుకొంటా'నంటే—నవ్వుల పాలవుతుంది కదూ నా పరిస్థితి?

మంచి పనులు కొన్ని నిజ జీవితంలో ఆచరణలో పెట్టాలంటే వికృత పరిణామాలకు దారితీస్తాయి.

అర్థం చేసుకొంటా వనుకొంటాను.

అసలు ఈ సంబంధం స్థిరపడిందంటే, నా ప్రోద్బలమే ఎక్కువగా కారణం. చదువుకొన్నపిల్ల. నలుగురున్న మధ్య తరగతి కుటుంబంలో అతుకుతుందో లేదోనన్న సందేహం మావాళ్ళకుంది. పైగా, ఆవేశ నీ మాటలు విని బెదిరిపోయారు మా నాన్న. నేను మాత్రం సరదాగానే తీసుకొన్నాను.

పెళ్ళికి ముందున్న ఆదర్శాల ఆవేశం పెళ్ళయ్యాక ఉండదు. సంసారంలో పడిపోయాక అదీ ఉండదు. పిల్లలు పుట్టాక అసలే ఉండదు. ఆదర్శాలకు అర్థమే తెలియని దశ వస్తుంది వైవాహిక జీవితంలో నాలుగడుగులు వేస్తే. నువ్వూ మామూలు మనిషివి కాగలవన్న విశ్వాసం నాకుంది.

అందుకే పెద్దవాళ్ళ ఉద్దేశ్యం కాదని నిన్ను చేపట్టగలుగు తున్నాను.

వరకట్నం లేకుండా నీ పెళ్ళి జరుగాలన్న నీ కలలు నిజ మవడానికి సహకరించ లేక పోతున్నందుకు క్షంతవ్యుణ్ణి. అన్యథా భావించకు. ఉంటానిక—

—రావు.

అతడిని సహృదయుడిగా ఊహించాలో, సంకుచితుడిగా భావించాలో పాలుపోలేదు భామకు. తన కోరికను సమర్థిస్తూ కూడా తీర్చలేక పోతున్నాడంటే అతడొక ఆత్మస్థైర్యంలేని పిరికివాడు అనుకోవాలి. అది లౌక్యమే కావచ్చు. ఆత్మ ప్రబోధానికి వ్యతిరేకంగా వ్యవహరించేవాడు ఆత్మ ద్రోహి, నిష్ప్రయోజకుడూ.

'అలాంటి దుర్బలుడితో తన జీవితం జతపడబోతూంది!' వేడిగా నిట్టూర్పు విడిచింది భామ.

తొలి యవ్వనంలో అడుగిడుతూనే తను కన్న మొదటికల ప్రేమ పెళ్ళి. మలి అడుగులోనే తెలిసిపోయింది, మధ్య తరగతిలోని కన్నెపిల్ల ప్రేమజోలికి పోవడం ఎంత ప్రమాదమో. తరువాత ఉన్నత విద్యని గురించి కలలు గన్నది. అదీ అసంభవమేనని నిరాశ చేసుకుంది. వరకట్నంలేని ఆదర్శ వివాహం కావాలని ఆశించింది. అదీ ఇలా అడియాసే అయిపోయింది.

అసంభవమని తెలిసినా ఎంతటి స్థిరచిత్తుడూ కలలు కనకుండా ఉండలేడు. మనిషి వాస్తవ ప్రపంచంలో చేసే సంసారం కంటే రెట్టింపు- అందమైన, మధురమైన సంసారం ఊహా జగత్తులో చేస్తాడు. ఊహా ప్రపంచంలోని సంతోషం, సౌఖ్యం వాస్తవ ప్రపంచంలో ఉండక పోవడమే అందుకు కారణమేమో!

# 2

"విద్యార్హతలు ఇద్దరివీ సమానమే, ఇంచు మించు. విజ్ఞానంలో కూడా ఇంటిపట్టున ఉండి పుస్తకాలుమేసే అవకాశం ఉన్నదానివి గనుక నువ్వేముందుంటావు. కాని గృహస్థ ధర్మంలో నీ చేయిక్రిందా, నా చేయి మీదా ఉంటేనే అందం. ఏమంటావు?"

తొలిరాత్రి తనను మరిచి భర్త కౌగిలిలో ఒదిగిపోయిన భామ, ఒక్కసారిగా ఉలిక్కి పడింది. దెబ్బతిన్న ఊసరవెల్లిలా చటుక్కున రంగులు మారిపోయాయి ఆమె వదనంలో. తోడు నీడగా సాగవలసిన దాంపత్య జీవితంలో హెచ్చు తగ్గులకు స్థానంలేదు. భర్తను గౌరవించడంలో భార్య ధర్మం ఎంతగా ఉందో, ఆమె వ్యక్తిత్వాన్ని మన్నించడంలో భర్త బాధ్యత అంతగానూ ఉండాలి.

భర్త ఆధిక్యాన్ని గుర్తించడంలో స్త్రీ సౌశీల్యం వ్యక్తమౌతుంది నిజమేగాని- అది ఆజ్ఞా బద్ధమౌతే అదే ఆమెకు నరకమౌతుంది కాదూ?

ఆ నరకమే తనకు భవిష్యత్తు కాబోతూందా? అనురాగాభిమానాలతో నిండిన సుఖ సంసారాన్ని గురించి తను కన్న మధురమైనకల అహంకార పూరితమైన అతడి పాదాల క్రిందపడి నిర్దయగా నలిగి పోతుందా?

*     *     *

"బాగా తెల్లవారనీ. కొత్త కోడలివి. నిన్నంతగా పట్టించుకొనేవా ళ్ళెవరు ఇక్కడ?"

పయిట సర్దుకొని పోబోతున్న భార్యను గబుక్కున ఎదమీదికి లాక్కుని గాఢంగా అదుముకొన్నాడు జగన్మోహన్.

"నలుగురున్న ఇంటిలో నా నడక ఎలా ఉండాలో ఒకరు పట్టి చూపక్కర్లేదు. అయినా, ఇంకా కొత్త కోడలినా? ఇది రెండోసారి రాక. కొత్తేముంది? చొరవ చేసుకొని పనిలో చొరబడిపోతే అన్నీ తెలిసిపోతాయి."

"అబ్బా, చలి! ఈ ఎముకలు కొరికే రాకాసి చలికి నన్నొంటిగా అప్పగించి పోతావా?"

"ఫర్వాలేదు. ఈ రగ్గు తోడు చేసుకోండి," పక్కకు తొలగిన రగ్గు తీసి కప్పింది చిలిపిగా, భామ.

"నీకు చలిగా లేదూ?"

"ఉంటే?"

"మరి, కాస్సేపు పడుకొని పోదువుగాని లెద్దూ. అప్పుడే అవతల కొంపలంటుకు పోవడం లేదు."

"ఈ రోజంటే ఏమో గాని, ఇలాంటి బద్ధకానికి లొంగిపోతే, రేపు కాకపోయినా ఎల్లుండి కొంపలంటుకుపోవడం తథ్యం!" లేచి, భుజాలనిండా కొంగు కప్పుకొని తలుపులు తీసుకొని ఇవతలికి వచ్చింది భామ.

ఇంట్లో ఎవరూ లేవలేదింకా. మధ్య వసారాలో అత్తమామలు

వోమ తెరల్లో శయనిస్తున్నారు. ఇద్దరు తోడికోడళ్ళ గది తలుపులూ మూసే ఉన్నాయి.

పుష్యమాసపు చలి చంకలెత్తనీయడం లేదు.

ఇంత చలిలో లేవవలసిన అవసరం భామ కెప్పుడూ కలగ లేదు. అత్తింటికీ, పుట్టింటికీ భేదమెంతో ఉంది. వీళ్ళు మాట అన్నా, అనకపోయినా గుమ్మడికాయ దొంగలా భుజాలు తడుముకోక తప్పదు.

బొగ్గుల కుంపటిమీద టీకి నీళ్ళు ఎక్కించి ముఖం కడుక్కొ వచ్చేప్పటికి చలి వదిలిపోయింది. కణకణలాడే నిప్పుల సెగకు చేతులు కాచుకొందామన్నా బుద్ధి పుట్టనంత వేడి వచ్చేసింది ఒంట్లోకి.

తలనిండా కొంగువేసుకొని వచ్చింది. పెద్ద తోడికోడలు సావిత్రి.

"అప్పుడే లేచి వచ్చావేం, మరిదిని ఇంత చలిలో ఒంటిగా వదిలేసి?" పరాచికమాడింది. "నీ పుణ్యమాని ముఖం కడుగుతూనే ఉడుకు నీళ్ళు గొంతులో పోసుకొనే అవకాశం కలిగింది!" అంటూ ముఖం కడుక్కోడానికి వెళ్ళిపోయిందామె.

దుప్పటి చుట్టుకొనే వచ్చింది అత్తగారు. కుంపటి దగ్గర చతికిలబడి చేతులు కాచుకొంటూ, ఎంతైనా చదువుకొన్న పిల్లల తీరే వేరు. నిన్ను చూసి అయినా నీ చిన్న తోడికోడలు సిగ్గు తెచ్చు కొంటే బాగుండేది." అంది కొత్త కోడలిని మెచ్చుకోలుగా చూస్తూ.

"అప్పుడే మురిసిపోకండి, అత్తయ్యా! నేనూ చేశాను. కొత్తలో," అప్పుడే వస్తూ విన్న రెండో తోడికోడలు ఇందిర తిప్పు కొంటూ వెళ్ళింది.

భయపడింది భామ. కలతలకూ, కలహకాండకూ అప్పుడే అంకురార్పణ జరుగుతూందా? అకారణ ద్వేషాలు ఇలా రగులనీయ కూడదు. అందుకు ఒకటే మార్గం. తన బుద్ధికి తోచిన పని చేయడం. ఎవరేమన్నా తటస్థంగా ఉండడం. తను జాగ్రత్తగా తెలివిగా వ్యవహరించాలి.

భామ అత్తగారిది పూర్తిగా పల్లెటూరు. ఒక మాదిరి వ్యవసాయం ఉంది వాళ్ళకు. మామగారు ఆ ఊరి కరణీకం కూడా చేస్తున్నారు. ఉన్న నలుగురు కొడుకుల్లో ముగ్గురు ఉద్యోగాల్లో ఉన్నారు. ఆఖరి

వాడు చదువుతున్నాడింకా. పెద్ద కొడుకు ఎప్పుడూ టూర్లలో తిరుగుతుంటాడు గనుక భార్యా బిడ్డల్ని ఇక్కడే ఉంచాడు. రెండో కొడుకు ప్రస్తుతం ఏదో ట్రెయినింగ్‌లో ఉన్నాడు. ట్రెయినింగ్ అవుతూనే భార్యా పిల్లల్ని తీసుకుపోతాడు. మూడో కొడుకు భార్య భామ. అతడూ ఇల్లూ అదీ చూసుకుని భార్యను కాపురానికి తీసుకు పోతాడు.

ఎవరి కాపురాలు వారివైనా ఏ పండుగకో, పబ్బానికో అందరూ ఇక్కడ తటస్థ పడక తప్పదు. కలసి ఉన్న ఆ నాలుగు రోజులైనా కక్షలూ, కలతలూ లేకుండా సౌజన్యంతో, ఆత్మీయతతో కలసి ఉండాలని భామకోరిక. 'వారిలో వారికి ఉండే బేధాభిప్రాయాలు, ద్వేషాలు తను తొలగించలేక పోవచ్చుగాని తను మాత్రం ఎవరి కంటిలోనూ నలుసుకారాదు!' అనుకుంది.

"ఎక్కడికి పయనం?"

"అలా పొలంవైపు వెళ్ళొస్తాను."

"ఒక్క అయిదు నిమిషాలు. నేనూ వస్తాను, ఉండండి," ఉత్సాహంగా వెళ్ళబోయింది భామ.

"అక్కడ నువ్వు చూడడానికి ఏముంది?" అనిష్టత వ్యక్తపరిచాడు జగన్మోహన్.

అతడి వాలకం పట్టించు కోకుండా చలాకీగా అంది: "ఏం కావాలి? పచ్చని పొలాలు. సాయంత్రపు నీరెండలో చెట్ల గుంపుల్లో చేరి కిచకిచలాడే పక్షులు. అందమైన సంధ్యారాగం. గిలిగింతలు పెట్టే పైరగాలి. ఏముంది చూడడానికి అంటారేమిటి? ఎలాగా నాకు ఇంట్లో తోచడంలేదు. పుస్తకాలతో ఎంతని కాలక్షేపం చేయనూ?" .

"అంత చూడాలనుకొంటే అమ్మ నడిగి- వెళ్ళమంటే, మీ చిన్నక్కయ్యను తోడు తీసుకొనిరా. నే వెడుతున్నాను," జోళ్ళలో కాళ్ళు దూర్చాడు.

మనసు చివుక్కుమంది. పేలవంగా నవ్వుతూ, "మీతో వస్తే ఏం? రాకూడదా?" అంది.

''అహాఁ. నువ్వు అపార్థం చేసుకోకు. ఇది బొత్తిగా పల్లెటూరు. విడ్డూరం చూసినట్టుగా ఎగబడి చూస్తారు. పట్నవాసమైతే చెట్టాపట్టాలు వేసుకొని వెళ్ళినా పట్టించుకొనే వాళ్ళుండరు.''

''పల్లెటూళ్ళు పల్లెటూళ్ళుగానే ఉన్నాయేమిటి, పట్నవాసపు షోకలేవీ సోకకుండా? ఆ ఎదురింట్లోకి బర్మాముడి ఎలా వచ్చిందంటారు?''

భార్య నవ్వుచూసి ఖంగారు పడ్డాడు జగన్మోహన్. ఎదురింట్లో కాపు యువతి బర్మాముడి వేస్తుంది. పెద్ద అందగత్తె కాదుగాని, వయసు తెచ్చిన పొంకంతో ఆకర్షణీయంగానే ఉంటుంది. పట్నవాసపు షోకులతో మెరుగులు దిద్దుకొంటుంది. 'తను కిటికీ దగ్గర నిలబడి ఎదురింటికేసి చూడడం భామ కనిపెట్టలేదు కదా? అయినా, అంత భయపడవలసింది ఏముంది? తనేం ఆ బర్మాముడినిచూసి కన్నుకొట్టలేదు కదా? కంటి తృష్ణకు తప్పేముంది?'' సమర్థించుకున్నాడు.

''సరదాగా ఇద్దరం కలసి వెళ్ళిచూసి వద్దాం అనుకొన్నానుగాని మీ వదినగారిని తోడు తీసుకొని వెళ్ళిచూసి రావలసినంత విశేషాలేవీ ఉండవు. పోనీ డాబామీద కూచుని కబుర్లు చెప్పుకొందాం హాయిగా.''

ఇబ్బందిగా చూశాడు. 'పెళ్ళాం కొంగు వదలడని నవ్వుకొంటారేమో ఇంట్లో?' పైకి అనలేదు. ''విసుగ్గా ఉంది ఇంట్లో. కాస్సేపు అలా బయట తిరిగి వస్తాను.'' అనేసి, భార్య జవాబుకు ఎదురు చూడకుండా గబగబా వెళ్ళిపోయాడు జగన్మోహన్.

''పాత కట్టడులను అతిక్రమించలేని పిరికి చాందసపు మొగుడు. భగవంతుడా! ఇలాంటి చాందసాలను ఎన్ని జీర్ణించుకొన్నారో?'' కలతగా నిట్టూర్పు విడిచి, మనసు కుదురు చేసుకోడానికి పెరట్లో ఎండి పగుళ్లు విచ్చిన చెట్లపాదులకు నూతిలోంచి నీళ్లు తోడిపోయ సాగింది, భామ.

''అబ్బాయి ఎక్కడి కెళ్ళాడు?''

''పొలం వైపు వెళ్ళొస్తా నన్నారు, అత్తయ్యా!''

''ఆ పాదులకు నీళ్ళుపోస్తూ ఉండిపోక పోతే ఇద్దరూ కలిసి వెళ్ళలేకపోయారా? పట్నవాసంలో పెరిగిన పిల్లవు. నీకు ఇంట్లో ఏం

తోస్తుంది? కాస్సేపు అలా బయట తిరిగివస్తే మనసుకు విశ్రాంతిగా ఉండేదేమో?"

భామకు దగ్గరలోనే ఉన్న ఇందిర చిన్నగా నవ్వింది. "అత్త సంగతి ఇప్పుడు తెలియదులే. కొత్త కోడలివి కదా?"

"అబ్బాయితో చెబుతాను, రేపు తీసికెళ్ళి మామిడితోటా, బస వని బావీ చూపించుకు రమ్మని....మరిచిపోయాను, అబ్బాయి రేపు ఊరికి వెళ్ళి పోతాడేమో గాదూ? మీ చిన్నక్కయ్యా, నువ్వూ కలిసి వెడుదురుగాని లే!"

* * *

"ఛొఛ్ఛొచ్ఛో! ఏమిటక్కయ్యా, అలా బాదేస్తున్నారు వాణ్ణి?" పరిగెత్తి విడిపించింది ఇందిర బారినుండి పిల్లాడిని, భామ. "అంత చేయరాని తప్పేం చేశాడు?" పిల్లవాడి కళ్ళు తుడిచి దగ్గరకు తీసుకో బోయింది. అబ్బే! వాడు విదిలించుకుపోయి తల్లి చీర కుచ్చిళ్ళలో దాగడంచూసి వెలవెలబోయింది భామ.

వెటకారంగా నవ్వింది ఇందిర. "ఒక క్షణం మరిచి, పుస్తకం క్రిందపెట్టి వెళ్ళానో లేదో చించి పోగులు పెట్టాడు వెధవ!"

"ఏం పుస్తకం?" చేతికి తీసుకొని చూసింది భామ. హెచ్. ఎస్. సి. తెలుగు గైడు. ఆశ్చర్యంగా కన్నులు అల్లార్చింది. "హెచ్. ఎస్. సి. పరీక్షకు కూచుంటున్నావా, అక్కయ్యా!"

"అవు నమ్మా. పెద్దవాడు పుట్టక ముందునుండీ మీ బావగారి పోరు సాగుతూంది, మెట్రిక్ పరీక్ష ఇమ్మని. ఏదీ? ఆరునెల్లు చూలింత- ఆరునెల్లు బాలింత అన్నట్టయి పోయింది నా పని. మూడేళ్ళలో ముగ్గురు పుట్టుకొచ్చారు. ఇహ ఇప్పటికి ఫుల్‌స్టాప్ అనుకొన్నాం. ఫీజూ అదీ కట్టేసి, పుస్తకాలు తెచ్చి నామీదపడేశారు ఆయన. కాని, ఏం చదువుతాను నా మొహం? సరిగ్గా పరీక్షలు మూడునెల్లయినాలేవు. ఈ పిల్లలు చదువు సాగనివ్వరు. నైన్తు క్లాస్ వరకు చదివిన చదువు ఈ మూడేళ్లలో మరిచిపోయాను. మరి చదివితే ఈ పుస్తకాలు ఏం బుర్రకెక్కుతాయి? 'నువ్వు పరీక్ష రాయి. పాసు చేయించే భారంనాది,' అంటారు ఆయన."

"అర్థం కానిది నేను చెబుతా నక్కయ్యా!" అందామనుకొంది భామ. ఆమె అభిమాన పడుతుందేమోనని ఊరుకొంది. అలా అయితే, తనకీ కాలక్షేపమయ్యేది. ఒక మనిషిని పరీక్షకు తయారు చేస్తున్నా నన్న తృప్తి ఉండేది. కాని, ఇందిరకు తను మరిది భార్య. తనతో చెప్పించుకోవడం ఆమెకు నామోషీ. ఆమె బావగారి భార్య అయినా, ముగ్గురు పిల్లల తల్లి అయినా, ఇంచుమించు తన వయసే. ఇద్దరూ స్నేహంగా మెలుగొచ్చు. కలుపుగోలుగా పనిచేసుకు పోవచ్చు. కాని, ఇందిరది అదొక రకమైన మనస్తత్వం. మూడునాలుగేళ్ళు భర్తతో వేరింటి కాపురం చేసివచ్చిందేమో, అత్తా తోడికోడళ్ళలో కలసి మెలసి ఉండలేకపోతూంది. తన బిడ్డలూ, తన భర్త ధ్యాసే ఎప్పుడూ, ఆపరిధి దాటి ఏది చేయాలన్నా, ఏది వినాలన్నా చిరాకు, చిర్రుబుర్రు. భర్త ట్రెయినింగ్ ఆవిడకు ప్రాణసంకటంలా వచ్చి పడింది.

"నాచేత ఉద్యోగం చేయించాలని సరదా పడుతున్నారు మీ బావగారు."

తోడి కోడలి కళ్ళలో మెరిసిన గర్వం, తృప్తీ చూసి జాలిగా నవ్వుకుంది భామ. ఏ స్వార్థమూ లేకుండా ఆడదాని అభ్యుదయం కోరే మగాడు అరుదు. చదువుకొన్న భార్య కావాలని ఉబలాటపడి పెళ్ళి చేసుకొని, బయటికి ఆవిడతో షికారు పోవడానికి సిగ్గుపడే తమ్ముడికి అన్నకదూ?

"ఏటా కాన్పులవల్ల బలహీనపడిపోయానా? ఎక్కువగా పని చేయనివ్వరు మీ బావగారు. ఇంటి పని ఎలాగూ చేతకాదనే ఉద్యోగంలో ప్రవేశపెట్టాలని ఆయన ఆలోచన."

'సరి. అతడి స్వార్థం ఇంత బట్టబయలుగా అగుపడుతూంటే ఈవిడ ఎలా సహించగలుగుతూందో? ఇంటి చాకిరీ చేతకాదని బయటి చాకిరీకి పంపుతున్నాడు. అది ఈవిడకు విశాల హృదయంగా అగు పడుతూన్నట్టుంది!' భామకు కొన్ని స్పష్టమైన ఆదర్శాలు, అభిప్రా యాలూ ఉన్నాయి. వాటి ప్రకారం ఆడది ఉద్యోగం చేయడంలో ఎంత మాత్రం తప్పులేదు. అదీ, ఆమె కోరుకున్నదయితేనే. ఆమెకు

ఇష్టమైనంతవరకే! అది మగాడు డబ్బు మిగుల్చుకోడానికీ కాదు. ఉద్యోగస్థురాలైన ఆడదానికి మగణ్ణని గర్వ పడడానికీ కాదు.

"ఇదిగో, నిన్నే." రెండోసారి గట్టిగా పిలిచాడు గుమ్మం అవతల జగన్మోహన్.

ఆలోచన నుండి ఉలికిపడి చూసింది భామ.

"సబ్బుపెట్టి ఉతికియ్యి. త్వరగా ఆరాలి. బస్సు టైంకు అందివ్వాలి" టెరిలీన్ పాంటూ, టెరిలీన్ షర్టూ తగిలించడానికీ హేంగర్లూ యిచ్చాడు భామకు.

హుందాగా వెను దిరిగి వెళ్ళిపోతున్న భర్తకేసి అసహనంగా చూసింది భామ. నిన్న షికారుకు తీసికెళ్ళలేదనే మంటగా ఉంది ఓ పక్క. ప్రేమగా అర్థింపుగా చెబితే బాగుండే దేమోగాని ఓ నౌకరుకి పురమాయించినట్టుగా....గుడ్డలు మీద పడేసిపోతే ఏమనాలి? 'నన్ను కట్టుకోకముందు ఈయనగారి గుడ్డలు ఎవరు ఉతికేవారో? ఆడదాన్ని మెళ్ళో తాళికట్టడం—చాకలివాడు గాడిదను కొన్నట్టేమో ఈ మగాళ్ళకు!"

ఆలోచనల మధ్యనుండి వెను దిరిగి చూసింది మరొక ఊహ. తన ఆలోచనలు విపరీతంగా సాగడం లేదు కదా? సౌమనస్యంతో సాగవలసిన సంసారం కావాలని కలుషితం చేయడం లేదుకదా తన ఊహలు? ఉహుఁ. కావాలని చేస్తున్నది ఏం లేదు. అతడిలో తను కోరిన మార్దవం లేదు. అనురాగమా? శారీరక అనుబంధం కలిగిన భార్యాభర్తల మధ్య ఉండేది అనురాగమో, శరీర తృష్ణో సరిగ్గా అంచనా వేయడం కష్టం!

మగడెంతో సుకుమారంగా చూసుకొనే తోడికోడలి ముందు తన భర్త అలా ప్రవర్తించడం అవమానంగా తోచింది భామకు. 'మగడి పని చేసిపెట్టడంలో తప్పులేదు. కాని, ఆ చెప్పడంలో ఉండవలసిన మార్దవ మేదీ?' ఇదీ భామ బెంగ!

జగన్మోహన్‌కు బస్సు తప్పిపోయింది, భామ కావాలనే గుడ్డలు ఉతకకుండా చేసిన ఆలస్యంతో. చాకలిది వచ్చాక దానిచేత ఉతికించి

అర వేయించింది భామ. భార్య దర్జాను ఎలా అర్థం చేసుకున్నాడోగాని ఏమనలేదు అతడు.

మరునాడు అదే టైంకు బస్సుకు వెడుతూ- భార్యతో కావాలని కల్పించుకొన్న ఏకాంతంలో—

"ఫస్టుకు జీతం తీసుకొంటూనే ఇల్లు చూసి పెట్టి వస్తాను. వెళ్ళామంటే ఇప్పట్లో మళ్ళీ రావడం పడదనుకొంటాను. ఈ నాలు గైదు రోజుల్లోనే మీ పుట్టింటికి వెళ్ళి ఓ వారం రోజులపాటు ఉండి వచ్చేయి. నేను వచ్చేప్పటికి తయారుగా ఉండాలి. నాకు టైం ఉండదు. సెలవు చాలా తక్కువగా ఉంది," అని చెప్పాడు జగన్మోహన్.

"నేను మళ్ళీ యిక్కడికి రావడ మెందుకు? మీరు అక్కడికే రావచ్చుగా?"

"ఉహూఁ, రాను."

"ఏం?" ఆశ్చర్యంగా అడిగింది భామ.

"మీ వాళ్ళకు మర్యాదలు బాగా తెలుసని రావాలి మాటి మాటికీ."

వింతగా చూసింది భామ. "అమర్యాద ఏం జరిగింది మీ కక్కడ?"

"చెప్పాలేం?" ఉక్రోషంగా అన్నాడు.

"చెప్పకపోతే ఎలా తెలుస్తుంది?"

"అక్కర్లేదు. నే రావడం మానేస్తే అదే తెలుస్తుంది మీ వాళ్ళకు." ఫలానా అని ఎత్తి చూపలేడు. మానసికంగా ఫీలయ్యే రకం అతడిది. అతడికి అమర్యాద అనిపించింది- ఎత్తి చూపితే అవతల వాళ్ళకు అది అమర్యాద అనిపించకపోవచ్చు. పెళ్ళి కాగానే చాలా మంది అల్లుళ్ళకు వచ్చే జబ్బే యిది!

"పండగ యిరవై రోజులు కూడా లేదు. పండగ ముందు ఎలా బయల్దేరడం? అసలు మా వాళ్ళు రానివ్వరు. పండగ అయ్యాక పెట్టుకొంటే బాగుంటుంది ప్రయాణం."

"పిచ్చి పిచ్చి మమకారాలు పెట్టుకోకు. ఉద్యోగస్థులం. ఎక్కడ వుంటే అక్కడే పండగ."

"అది సరే. పెళ్ళి అయిన ఏడు. పండగ యింత దగ్గర పెట్టుకొని పదమంటే నలుగురు ఒప్పేమాట కాదు.

"మరి ఏం చెయ్యమంటావు? తరువాత నాకు సెలవు దొరకదు."

'సెలవు దొరకదని కాదు. అదొక మూర్ఖం' మరి వాదించలేదు భామ.

# 3

భామ పుట్టింటికి వెళ్ళలేదు. పండగముందు వాళ్ళ అభ్యంతరాలు తోసేసి ప్రయాణం కావడం కష్టం కాబట్టి—అక్కడికి జాబు వ్రాసి అక్కడ వదిలేసి వచ్చిన తన సామాను తెప్పించుకుంది తమ్ముడితో.

భార్యను తీసుకుపోడానికి వచ్చిన జగన్మోహన్, తను అనుమతి యిచ్చినా కూడా పుట్టింటికి వెళ్ళలేదని తెలిసి—'ఇదేదో నన్ను సాధించడానికి కాబోలు. ఉద్దాలకుడి సహచరి చండిక అంశ అంతో యింతో ప్రతి ఆడదానిలోనూ ఉండేట్టుంది!' అనుకొన్నాడు నిరసనగా.

"మనతో వచ్చి కొత్తకాపురం సరిదిద్ది రావాలని ఉబలాటపడుతున్నట్టున్నారు మీ అమ్మగారు. ఒక్కమాట పిలవండి మీరు, వస్తారు. ఆమె నెందుకు చిన్నబుచ్చడం? పిలవండి."

"మళ్ళీ ఆమెను పంపించడానికి నేను రావాలి. ఛార్జీలు ఖర్చులు ఊరికే రావు. నాదేమంత ఆఫీసరు ఉద్యోగం కాదు. ముందు చూసి అడుగు వేయాలి."

"ఏమైనా అనుకొంటారేమో ఆమె?"

"అనుకోడానికి ఏముంది? నువ్వేమైనా చిన్నపిల్లవా? ఎవరో

వచ్చి నీ కాపురం సరిదిద్దడ మేమిటి? అదంతా వెనకటి తరహా. నీ కెందుకు? నువ్వు ఊరుకో."

మరి ధైర్యం చాల్లేదు భామకు, అత్తయ్యకోసం సిఫార్సు చేయడానికి. ఎబ్బెట్టుగా కూడా ఉంటుంది. 'కడుపున పుట్టిన కొడుక్కే-లేకపోయిన బాధ నా కెందుకు?" అనుకొంది గాని, 'మొగుడూ పెళ్ళాల మధ్య నన్నెందుకు అనుకొన్నావేమో. ఏమైనా సత్యభామవే' అన్న భావం వ్యక్తపరిచింది ఆమె మాటల్లో. అత్తగారి చూపులు దుర్భరమనిపించాయి భామకు.

'కోడళ్ళు వచ్చి కొడుకులను దూరం చేస్తారని చాలామంది తల్లుల అపోహ, కాని, కోడళ్ళ ప్రమేయం లేకుండా ఆర్థికమైనచిక్కులు, అవసరాలు కన్నవారికి దూరం చేస్తుంటాయి. అదిగ్రహిస్తే బాగుండును!' నిస్పృహగా అనుకొంది భామ.

* *

"ఆపు, ఇక్కడే."

రిక్షా రోడ్డు మీదే ఆగింది. జగన్మోహన్ దిగి వెళ్ళి తలుపు తాళం తీస్తుంటే భామ కుతూహలంగా తొంగిచూసింది. కాంపౌండ్, వరండా అలాంటి వేమీ లేవు. సైడ్ కాలువకు అంచునే ఉంది వీధి గుమ్మం! ఇల్లు సున్నం కొట్టి, కొత్తది లాగే కనబడుతూంది.

"ఇంకా చూస్తూ కూచున్నావేం? దిగిరా." కొత్త పెళ్ళాంతో నూతనంగా గృహప్రవేశం చేస్తున్నప్పటి ఉత్సాహం, దరహాసం చిందు లేస్తున్న ముఖంతో, ఆహ్వానించాడు జగన్మోహన్.

కొత్తగా కాపురానికి వచ్చిన భామ హృదయ స్పందన కూడా విచిత్రంగా ఉంది.

సామాను తెచ్చిపెట్టి కూలీ ఇప్పించుకు వెళ్ళిపోయాడు రిక్షావాలా.

"ఇల్లు చూడూ!"

మూడే మూడు గదులు. వెనుక వంటకు, మధ్యది పడుకోడానికి. ముందు గది డ్రాయింగ్ రూంలా వాడుకోడానికి. ఈ ఇంటి పెరడు లేదు. పక్కనే ఉంటారు ఇంటివాళ్లు. కొళాయి, బాత్ రూం

కైట్రీన్ ఉమ్మడిగా ఉంటాయి. ఆ పక్క మరో వాటా వాళ్ళుకూడా ఉంటారట.

అంతా చూసి, "అద్దెంత?" అని అడిగింది భామ, అసంతృప్తిగా.

"నలభై. ఎక్కువే అనుకో. కాని, ఇళ్ళు దొరకడం చాలా కష్టం ఇక్కడ. ఉండేది ఇద్దరమే కదా? ఈ మాత్రపు ఇల్లు చాలు. ఇల్లు నీటుగా ఉండడం నీ నేర్పుమీద ఆధారపడి ఉంది."

నేర్పు సంగతి దేవుడెరుగు. పచ్చగా కళ్ళాపి జల్లి ముంగిట ముగ్గువేసుకోడానికి లేదు. తనలాంటి దానికి కాలక్షేపానికి, డబ్బు పొదుపుకు కూడా నాలుగు కూరపాదులూ, నాలుగు పూలమొక్కలూ పెట్టుకోడానికి గజంచోటు లేదు. అటు పుట్టింట్లోనూ, ఇటు అత్తింట్లోనూ విశాలమైన భవంతుల్లో ఉండి వచ్చిందేమో, ఈ మూడుగదుల కాపురమంటే ముక్కు పట్టినట్టుగా తోచింది భామకు.

ముందుగా సూట్‌కేస్ తెరిచి టవలూ, సోపూ తీసుకు వెళ్ళి, పక్కింటి వాళ్ళను నీళ్ళు అడిగి ముఖం కడుక్కువచ్చింది భామ. ఉదయం పదిగంటలప్పుడు ఆదరా బాదరగా నాలుగు మెతుకులు నోట్లో వేసుకొని బస్సెక్కారు. ఇక్కడికి చేరేప్పటికి సంధ్యపడింది. దారిలో కాస్త టీ, ఫలహారం తీసుకొన్నా, అదేమిటో ప్రయాణంలో అలసటా, ఆకలీ ఎక్కువే.

జగన్‌మోహన్ సామాను విప్పతీయబోతుంటె వారించింది భామ. "వాటి జోలికి పోకండి ఇప్పుడు, మీకు సాయం రావడానికి కూడా నాకు ఓపిక లేదు. ఒళ్ళంతా నలగ దంచి నట్టయిపోయింది బస్సు కుదుపుల్లో. పొద్దున్నే ఎక్కడి సామాను అక్కడ సద్ది పెట్టుకో వచ్చు."

"అరే! వంటంటే ఇప్పుడు కాదులే. కాస్త టిఫిన్ ప్రయత్నమైనా చేయవూ?"

"బాబోయ్! చీపురుపుల్ల ఎత్తే ఓపిక కూడా లేదు నాకు. దగ్గర్లో హోటల్ లేదైనా ఉందేమో చూడండి. ఇద్దరం వెళ్ళి తినేసి వద్దాం. లేక

పోతే మీరు తిని నా కేదైనా పట్టుకు రండి. ఆత్మారాముడు అవురావురు మంటున్నాడు.''

ఉండే వూళ్ళో భార్యతో హోటల్‌కు వెళ్ళి తినగలంత నాగరిక సంస్కారంతో పెరగలేదతడు. తను తిని ఆమెకు భోజనం పట్టుకు రావడానికి టిఫిన్ కారియర్ లేదు. ఏదో ఫలహారం పొట్లంలో కట్టించు కొద్దామన్నా, టీ తీసుకు రావడానికి ఫ్లాస్కు కూడా లేదు. ఇల్లాలు వచ్చింది కదా, ఇప్పటినుండీ ఒక్కొక్కటీ సమకూర్చుకోవాలి ఇంట్లో. ఏదైనా తీసుకు వచ్చినా తాగడానికి మంచినీళ్ళు లేవు ఇంట్లో.

ఇక తప్పదు ''పద'' అన్నాడు.

* * *

పూర్తిగా తెల్లవారకుండానే లేచింది భామ, నవోత్సాహంతో కొత్త కాపురం తీర్చిదిద్దుకోడానికి. కాలేజీ చదువు చదివిన యువతీ అయినా నలుగురున్న మధ్య తరగతి కుటుంబంలో పెరిగి వచ్చింది గనుక తీరైన సాంసారిక పద్ధతులు అలవడ్డాయి ఆమెకు.

వీధి గుమ్మం మెట్లు కడిగి పసుపు ముగ్గు, పిండిముగ్గు వేసి లోపలికి వచ్చి, సామాను విప్పి తీసి నీటుగా గూళ్ళలో, చెక్కలమీదా సర్దింది, పని ముగించుకొని టీ, తాగి ఎనిమిది గంటల పొద్దయినా ఇంకా సుఖశయ్య వీడని భర్తకు మేలుకొలుపులు పాడను వెళ్ళింది భామ.

మగడి ఛాతీమీద కితకితలు పెట్టి కొంటెగా నవ్వింది.

ఉలికిపడి లేచాడతడు. ''అబ్బా: ఎంత పొద్దయిందీ?'' అంటూ. పొద్దెక్కేదాకా పడుకొన్నాడేమో కళ్ళు బాగా ఎర్రబడి, కన్నురెప్పలు, కళ్ళ క్రిందా పొంగాయి.

ముఖం కడుక్కువచ్చి భామ అందించిన టీ చప్పరిస్తూ, ప్రసంసగా, ''గుడ్! చాలా బాగా సర్దేశావు. ఈ మాత్రపు దానికి ఓ పెద్ద మనిషి వెనక రాకపోతే ఏమైంది? అందులోనూ మీ అత్తా కోడళ్ళ మధ్య పొత్తు బెణికితే నిష్ఠూరమై పోయేవాణ్ణి నేనే కదా'' అన్నాడు జగన్మోహన్.

రేకు డబ్బాలో మట్టి పోసి, ఇంటివాళ్ళ దగ్గరనుండి తులసి

మొక్క ఇప్పించుకు నాటి సూర్యకిరణాలు పడుతూంటే కిటికీలో ఉంచుతూన్న భామ అతగాడు "బాగా సర్దేశావు" అని మెచ్చుకోవడం కంటే- "ఒక్క దానివే కష్టపడాలా? నేనూ వచ్చేవాడినిగా తోడుగా?" అని కాస్త నొచ్చుకొని ఉంటే, ఎక్కువగా సంతోషించేది.

భార్యాభర్తల సహజీవనంలో పురుషుడు భోగికావడం, స్త్రీ సేవిక కావడం- సనాతన ధర్మాలకూ పాతివ్రత్యానికీ నిర్వచనమే మారిపోయిన ఈ నవీన నాగరక యుగంలోని యువతి హర్షించదు. అభిలషించదు. ఒకరికి ఒకరు తోడుగా నీడగా పరస్పరం సహకరించు కొంటూ అన్యోన్యంగా ఆనందంగా- అంటే పప్పులో భార్య కారం వేస్తే, మగడు ఉప్పు వేయాలా అంటూ జగన్మోహన్‌లాంటి వాళ్ళు విరసంగా వెటకారం చేస్తే సమాధానం చెప్పలేదు.

"ఆవిడ ఎల్లకాలం మనదగ్గరే ఉండిపోయేదా, మరో దిక్కు లేని దానిలా? కొత్త కాపురం, పెద్ద మనిషి తరహాగా కోడలికాపురం దిద్దిపోదామని సరదా పడింది. నాలుగు రోజులు ఉంచుకొని పంపిస్తే మాట ఉండేది కాదు మనమీద. ఇహ ఆవిడతో పోట్లాటేసుకు కూచో డానికి నేనంత తెలివి తక్కువ దాన్ని కాదు."

*　　　*　　　*

సాయంత్రం నాలుగు గంటలకుగాని ఆఫీసునుండి ఇంటికి రావడం పడలేదు జగన్మోహన్‌కు. అలసటగానూ, ఆకలిగానూ ప్రాణం ముగ్గుపెట్టిన మెట్లు ఎక్కుతూంటే సగం సేద దీరింది. కిటికీలో పసుపు కుంకుమ పెట్టుకొని గాలికి చిన్నగా కదులుతూంది తులసి మొక్క. 'ఇల్లాలు ఉన్న ఇంటి కళవేరు!' ఇదివరకు తన బ్రహ్మచారి జీవితం గుర్తు వచ్చింది. ఇప్పుడు, తనకోసం తలుపుతీసి ఆప్యాయంగా ఆహ్వానించే భార్యను తలుచుకొంటే ఎక్కడలేని మమకారంతో హృదయం ఉరక లెత్తుతూంది.

"సత్యా!" తలుపు తట్టాడు.

"గడియలేదు. నెట్టండి." నీరసంగా వినిపించింది భామకంఠం.

దిండులో ముఖం దాచుకొని బొక్కబోర్లా నేలను కరుచుకు పడుకొంది భామ.

"ఏమిటి?" ఆత్రంగా సమీపించాడు.

"కడుపులో నొప్పి. బాధ భరించలేకుండా ఉన్నానండీ." బాధతో కంపించింది కంఠం.

పక్కనే కూలబడిపోయి వీపు తడుతూ, ఆర్ద్రంగా అడిగాడు: 'ఎప్పటినుండి నొప్పి? ఇదివరకు వచ్చేదా?"

"అబ్బే. ఈరోజే. పొద్దున పెట్టెలవీ తీసిపెడుతూంటే మొదలయింది సన్నగా. ఏమోలే అనుకొన్నాను, గంటనుండీ మరి కదలనివ్వడంలేదు. కడుపులో నరాలన్నీ చుట్టబెట్టి నట్టవుతూందండీ!"

"అన్నం తిన్నావా?"

"ఉహుఁ. మీరు వస్తారు కదాని."

"డాక్టర్ని తీసుకురానా?"

"బాధ భరించలేకుండా ఉన్నానండీ."

"ప్చ్! ఇలా ఉన్నప్పుడు నీ దగ్గర ఎవరూ లేకపోతే ఎలా! ఒంటరిగా వదిలి వెళ్ళాలంటే కాళ్ళాడడంలేదు." దిక్కుతోచని వాడిలా అన్నాడు.

'ఇంట్లో పెద్ద దిక్కు అవసరం. ఇప్పుడు కాని కనిపించలేదు జగన్మోహన్‌కు.

"పక్కింటావిడను పిలుస్తారా? ఆవిడేమైనా చెబుతుందో ఏమో!"

"...ఇల్లు చూడడానికి వచ్చినప్పుడు తప్ప ఇంటావిడతో మరి మాట్లాడలేదు. ఇప్పుడు వెళ్ళి ఏమని పిలవాలో మొహమాటంగా ఉందతడికి. 'అమ్మను తీసుకవస్తే ఎంత బాగుండేది? ఆవిడ సరదా తీరేది. ఇలాంటి సమయంలో- పెద్ద దిక్కు ఉంటే- ఎంతో ధైర్యంగా ఉండేది.'

అలసిసొలసి, ఆకలితో వచ్చాడేమో, భార్య పరిస్థితి చూస్తుంటే అతడి హృదయం మరింత విహ్వలమై పోయింది. పెరటి తలుపు తీసి చూశాడు; ఆవిడ కొళాయి దగ్గరికి వచ్చిందేమోనని, ఎవరూ కనిపించలేదు. ఇహ పక్కింటికి వెళ్ళక తప్పలేదు, జగన్మోహన్‌కి.

"ఏం, నాయనా?" అందామె అతడి రాకకు ఆశ్చర్యపోతూ.

"మా ఆవిడకు నొప్పో ఏమిటో. చాలా బాధపడిపోతున్నదండీ. డాక్టరు దగ్గరికి వెడుతున్నాను. మీరు కాస్త ఆవిడ దగ్గర ఉంటారేమో నని...."

"అలాగా?" వెంటనే లేచి వచ్చింది. భామమీదికి ఒంగి "ఏమి టమ్మా?" అని అడిగింది. "ఎప్పటినుండి?" భామ మూలుగుతూ ముక్కుతూ చెప్పింది విని, "కాస్త వేడివేడి చాయ్ తీసుకొని చూస్తావా? కొంచెం తగ్గుతుందేమో?" అంది ఇంటావిడ. "చేసి తీసుకురానా?"

"మీరు ఇంటికివెళ్ళి చేసుకురావాలా? వంటింట్లో అరుగుమీద స్టౌ, టీకి కావలసినవన్నీ ఉన్నాయి. శ్రమ అనుకోకపోతే..."

"శ్రమ ఏముందమ్మా? ఒంటికాపురం వాళ్ళ అవస్థ యిది," అంటూ లోపలికి వెళ్ళి టీ చేసుకువచ్చింది.

"నే వెళ్ళనా అండీ, డాక్టరు దగ్గరికి?" ఈ సమయంలో ఆవిడే ఆపద్బాంధవి!

"కాస్త ఆగు, బాబూ! ఈ చాయ్ తీసుకోనీ. చూద్దాం."

అరనిమిషంకూడా గొంతులో నిలువలేదు. బాత్‌రూంకు వెళ్ళ డానికి కూడా వ్యవధి లేకపోయింది. అక్కడే బొళబొళ కక్కేసి ఒళ్లంతా చెమటలు కక్కుతూంటే నీరసంగా పడుకుంది భామ.

ఇంటావిడ చిరునవ్వు నవ్వుతూ, "కడుపా? ఎన్నో నెల?" అంది.

"అబ్బే! ఏం లేదు." అంతబాధలోనూ సిగ్గుపడింది భామ.

"కాకపోవడమేం? ఎన్నో నెల?"

"పోయిన నెల ఇరవయ్యికే. నెల కాలేదు."

"చూస్తావేం, బాబూ! డాక్టర్ని తీసుకురా. కడుపుతో ఉన్న మనిషి. నొప్పి రావడం మంచిది కాదు. నువ్వులే అమ్మాయ్, పక్క యినా లేకుండా బండలమీద చల్లగా...బోర్లాపడుకోకు."

"అయిన వాళ్ళకే కాదు. పరాయి వాళ్ళకుకూడా ఎంత అపు రూపం నీళ్ళు పోసుకొన్న స్త్రీ మీద? మాతృత్వం స్త్రీకి అన్ని సంప దలకు మించిన వరం కదూ?" హాయిగా నవ్వుకుంది భామ. 'కాని ఈ నొప్పి ఏం చేసుందో?' కలవర పడిపోయింది. భర్త ముఖంలోకి

చూడాలంటే సిగ్గేసింది. 'ఏ కాంతంలో చూడాలి. తండ్రి కాబో
నని తెలిసిన ఆయన ముఖంలోని భావాలు!'

లేడీ డాక్టరును తీసుకొని వచ్చాడు జగన్మోహన్. అన్ని సంగ
తులు ఇంటావిడే చెప్పేసింది లొడలొడా; "కడుపుతో ఉన్న
పొద్దుటినుండి ఇల్లు సర్దుకోవడంలో, బరువు లెత్తడంలోను ఏదో జరిగి
నొప్పి తెచ్చుకొంది

డాక్టరు పరీక్ష చేసింది. మందులు వ్రాసింది. ... ...
తనతో తెచ్చిన ఇంజక్షన్ యిచ్చింది ఎక్కువగా తిరుగొద్దనీ రె...
తీసుకోమనీ చెప్పింది. పక్కా వ్యాపారిలా అప్పటికప్పుడు ఫీజు
వసూలు చేసుకొని వెళ్ళిపోయింది. అవసరమైతే మళ్ళీ పిలువమని
చెప్పి—

పక్కింటావిడను కూతురు వచ్చి పిలిచింది—"అమ్మా, నాన్నా
వచ్చాడు. పిలుస్తున్నాడు" అంటూ.

"నే వెడుతున్నా నమ్మా....మీ పెద్దవాళ్ళను ఎవరినైనా పిలుచు
కోండి. ఇలాంటి సమయంలో ఎవరో ఒకరు ఉండకపోతే కష్టంకదా?
ఎవరో ఒకరు వచ్చేదాక నాకు తెలిసిన వంట మనిషి ఒకావిడ ఉంది,
చెప్పి, పంపమంటే పంపుతాను."

భర్తకేసి చూసింది భామ.

అటు ఇటు కాకుండా చెప్పాడతడు "చూద్దాం."

"మళ్ళీ వస్తాను" ఇంటావిడ వెళ్ళిపోయాక గదిలో రాజ్యం
చేస్తున్న నిశ్శబ్దంలో భామ ఊహలు హాయిగా సాగాయి కొద్దిక్షణాలు.
రెండో అక్క స్మృతికి వచ్చింది. పెళ్ళయిన రెండో ఏట నెల
తప్పింది. పెళ్ళామంటే ఏడు మల్లెల ఎత్తు బావగారికి. తండ్రిని చేయ
బోతున్నదని తెలిసి అతగాడి అపురూపానికి అవధులు లేకుండా
పోయాయి.

"అయిదో నెలనే తీసుకుపోవడం, కాన్పుచేసి తిరిగి అయిదో
నెల పంపడం మా ఆనవాయితీ. అమ్మాయిని పంపించు," అంటూ
కూతుర్ని తీసుకురావడానికి వెళ్ళాడు తండ్రి.

''అన్నాళ్ళు భార్యా వియోగం సహించలేనండి!'' అంటూ సర దాగా నవ్వేశాడు అల్లుడు.

''తప్పదు బాబూ! తొలి చూలు. కన్నవారికీ అపురూపం. ఒంటికాపురం చేసుకోవాలి, తినాలి.... అక్కడ...'' మరి చెప్పనివ్వలేదు మామగారిని. ''మీ అమ్మాయిని నేనేం కష్టపెట్టను. నాకూ అపురూపమే. వంట మనిషిని పెడతాను. అక్కడికి పంపేదాక అరికాలు మాయ నివ్వను సరేనా?''

అన్నట్టుగానే జరిపాడు, తనది మామూలు బడిపంతులు ఉద్యోగ మైనా.

పండంటి పాపాయిని ఎత్తుకొని తన సంసారానికి నిండుదనం తీసుక వస్తుందని కలలుకంటూ పురిటికి పంపాడు పుట్టింటికి. కాని, తన ప్రతిరూపంగా పాపను నేలమీద విడిచి మాయమైపోయింది భామ అక్క.

ఎందుకో గుండె జల్లుమంది భామకు.

ఏవో భావాలను కప్పిపుచ్చుకోడానికి సాకుగా పేపరు తిరిగే స్తున్న జగన్మోహన్ మామూలుగా అడిగాడు: ''నొప్పి తగ్గినట్టు అనిపిస్తూందా?''

''ఉఁ. కొద్దిగా...'' తను కలగన్న అపురూపత, అనురాగం మగని కన్నుల్లోగాని, కంఠంలోగాని కనిపించక నిరుత్సాహంగా నిట్టూ ర్చింది భామ. ''కాళ్ళు కడుక్కువస్తారా? వడ్డించనా?'' మళ్ళీ లేచి తిరిగితే నొప్పి బాగా వస్తుందేమోనని భయంగా ఉన్నా, అతడి మౌన వైఖరి మరీ యిబ్బందిగా ఉంది.

''చేతనవుతుందా? నేను పెట్టుకొంటానులే. మరి నువ్వు తినవా?''

''అబ్బే! నేనేమీ తినేట్టు లేదు ఇప్పుడు. మీకు పెడతా పదండి''

అన్నం తింటూ అడిగాడు జగన్మోహన్ ''అమ్మను రమ్మని రాయనా, పరిస్థితి ఇలా ఉందని?''

''బాగుండదు,'' ఖచ్చితంగా అంది భామ. ''ఆమె మనతో నాలుగు రోజులపాటు వచ్చి ఉండాలని సరదాపడితే మనం మౌనం వహించాం. ఇప్పుడు అవసరమై వ్రాస్తే మాట మీరలేక వస్తుందేమో

గాని మంచ మెక్కి కూర్చోని చేయించుకోవడం యిబ్బందిగా వుంటుంది.

"మరి ఎలా?" కాస్త ఆరోగ్యం కుదుట పడేవరకు మీ పుట్టింట్లో ఉండి వస్తావా?" అన్నాడుగాని తన మాట తనకే సమ్మతంగా లేదు. ఇదివరకు మాటేమోగాని, భామను పంపేసి బోసిపోయిన యింట్లో ఉండడం దుర్భరం!

భామకు అసలే ఇష్టంలేదు, పుట్టింటికి వెళ్ళటం. కొత్త కాపురం గురించి ఎన్నో కలలతో వచ్చింది. ఒక్కటీ రూపు దాల్చకుండానే వెళ్లడమంటే దిగులేసింది.

"అదేం మాట? సుస్తీలూ, అనారోగ్యాలూ వచ్చినప్పుడల్లా పుట్టింటికి పరిగెత్తడమేనా? ఈ నాలుగు రోజులూ ఎలాగో గడిపేస్తే, ఈ కడుపు నొప్పి తగ్గితే నెమ్మదిగా నేనే చేసుకోగలను, ఓ పని మనిషిని సాయంగా పెట్టుకొన్నానంటే. పక్కింటావిడ చెప్పిన ఆ వంట మనిషి ఎవరో ఈ నాలుగు రోజులకూ కుదుర్చుకొంటే...!"

అంతకంటే మరో గత్యంతర మేదీ కనిపించలేదు జగన్మోహన్‌కు కూడా; "నువ్వే చెప్పు, పక్కింటావిడకు." భోజనం ముగించి వక్కపొడి వేసుకొని డాక్టరు వ్రాసిన మందులకోసం బజారుకువెడుతూ, "బొత్తిగా ఏమీ తీసుకోకపోతే ఎలా, సత్యా? వస్తూ హోటల్ నుండి ఏమైనా తీసుకురానా?" అడిగాడు.

"ఏమీ వద్దండీ. తినాలనిపిస్తే ఓ గంటయ్యాక అన్నమే తినేస్తాను." భర్త వెళ్ళిపోయాక పక్కమీద వాలింది భామ, నెల తప్పిన సంగతి తెలిశాక మారిపోయిన అతడి వైఖరికి ఆశ్చర్యపోతూ. భర్త బొత్తిగా విరసుడూ కాదు. భార్య అంటే ప్రేమ లేదనీ కాదు. కాని, చిన్నక్క దాంపత్యం స్ఫురణకు వస్తే మాత్రం సూర్యుడి ముందు దివిటీలా వెలవెలపోతుంది తన దాంపత్యం. అప్పటికి భామది చిన్న వయసే నేమో అక్కా బావలకు దాపరికం ఉండేది కాదు ఆమె ఎదుట.

"అలా తిరిగొద్దాం రా బావా" అంటూ బావమరదులు పిలిచినా, "బయటేముందోయ్, ఇంట్లో..." అంటూ నవ్వేసేవాడు. సినిమాకైనా షికారుకైనా భార్య లేకుండా వెళ్ళడమంటే చాలా కష్టపడిపోయేవాడు

పాపం. భార్య అంటే అతడి కన్నుల్లో కదిలాడే అనురాగ దీప్తి ఇప్పటికీ భామకు గుర్తే.

'అంత గాఢంగా ఆరాధించే హృదయం అందరికీ వుండదు. అలాంటి పురుషుణ్ణి పొందడం ఎంతటి అదృష్టవతికో!' తపనగా అనుకొంది భామ. స్త్రీని ఆరాధించడం తమ పురుషాధిక్యానికి లోకువగా భావించే మగవాడి పాలిటి పడడం దురదృష్టం కాదూ ఆడదానికి?

* * *

తనలో నిండిపోయిన ఊహల బరువూ, ఉద్వేగం కొద్దిగా తొణికితేగాని నిద్రపట్టని భామ భర్త ఎదమీద సున్నితంగా తడుతూ, గోముగా అడిగింది: "మీకు బాబు కావాలా? పాప కావాలా?"

"ఎవరో ఒకరు. మనం కావాలనుకొన్నట్టుగా అవుతుందా?" కొద్దిగా నవ్వాడు జగన్మోహన్. "కాని, ఇంత తొందరగా యిలా అవుతుందని అనుకోలేదు, సత్యా! మనపెళ్ళయి రెణ్ణెల్లయినా నిండలేదు. అప్పుడే....ఉహుఁ....నువ్వేమైనా అనుకో. నాకు సంతోషంగా లేదు. తీర్చుకోవలసిన సరదా లెన్నో ఉన్నాయి. అప్పుడే బంధాలా? అందుకే....నిన్ను తీసికెళ్ళి హెల్త్ విజిటర్‌తో కలుద్దా మనుకొన్నాను. కనీసం రెండేళ్ళపాటయినా మనం హాయిగా ఉండాలని....అపుడే చేజారిపోయింది."

"బంధం అనుకుంటే జీవితానికి వివాహం కూడా బంధమే. ఇందువల్ల తీరని సరదా లేమిటో నాకు బోధపడడం లేదు."

"పిల్లల కోసం తపించి పోతున్న ట్టున్నావే?"

"దేవుడిస్తున్నాడని సంతోషంగా అందుకొంటున్నానే గాని తపించి పోడానికి ఇప్పుడే వయసు దాటిపోతూందనా? అయినా అభ్యంతర మేముంది? చదువు పాడవుతుందనా? ఉద్యోగానికి ఇబ్బంది అనా? నాలాంటి గృహిణికి పిల్లలతో మంచి కాలక్షేపం కాదూ?"

"అది సరేగాని, ఇహ హాయిగా ఊపిరి తీసుకోవడం కుదరదు. ఏటా కుటుంబం పెరిగిపోతుంటే ఖర్చులు, అవసరాలు ఎప్పటి కప్పుడు సృష్టి అవుతూంటే,- మహా సాగర మధ్యంలోపడి ఒడ్డుకు ఈదినంత పని అవుతుంది. మరీ మధ్య తరగతి జీతగాడి జీవితం అధ్వాన్నం."

"మీదంతా చోద్యం. విపరీతంగా ఊహించుకొని, అనవసరంగా కష్టపెట్టుకొంటున్నారు మనసును. పిల్లల్ని కనడం వల్ల అంత బాధ ఉంటే ప్రతి మనిషీ సంతానంకోసం అలా
తేలికగా తీసివేసిన భామ, మగడి వింత మనస్తత్వానికి బాధతో నిట్టూర్చింది.

# 4

"నమస్కారమండీ!"

"నమస్కారం." తడబాటుగా తలెత్తింది భామ, పత్రికలోంచి. కర్టెన్ తొలగించుకొని, పట్టుచీరలో నిండుగా అలంకరించుకొన్న పాతికేళ్ల యువతి లోనికి వచ్చింది నిస్సంకోచంగా.

కర్టెన్ అవతల మెట్లమీద నిలబడ్డ ఆఫీసు ప్యూన్ "మన ఇంజనీరుగారి భార్య, అమ్మా," అన్నాడు.

"రండి. కూర్చోండి!" కుర్చీ జరిపింది భామ.

ఆమె కూర్చుంటూ మొన్నే వచ్చారనుకొంటాను, అంది.

"అవును. వారం రోజులవుతూంది."

"ఎక్కువసేపు కూర్చోడానికి లేదు. ఇంకా చాలా ఇళ్ళు పిలవాలి. మా పాపకు భోగిపళ్ళు, బొమ్మలు కొలువు ఉన్నాయి. పసుపు కుంకుమకు రండి. మరి నే వస్తాను. తప్పకుండా రండి," లేవబోయింది.

"ఉండండి, కాస్త టీ పుచ్చుకొని వెడుదురుగాని. ఎక్కువ ఆలస్యం కానివ్వను," వారించి, వంటమనిషిని పిలిచి, టీ పురమాయించింది భామ.

"అప్పుడప్పుడు రావుగారు మా ఇంటికి వస్తూంటారు. మా ఆయనా, ఈయనా చిన్నప్పటి క్లాసుమేట్స్‌ట. మొన్న వచ్చినప్పుడు

చెప్పారు రావుగారు శ్రీమతిని తీసుకు వచ్చానని....మీరు గ్రాడ్యుయేట్ అనుకొంటాను...."

"బి. ఏ." చిరునవ్వుతో అంది భామ. "నా ఊహ పొరపాటు కాకపోతే మీరుకూడా...."

సగర్వమైన హాసం పెదవులమీద నర్తిస్తుంటే చెప్పింది. "ఎమ్. ఎస్. సి. రీసెర్చి చేస్తున్నాను ప్రస్తుతం." టీ తీసుకొన్నాక నుదుట కుంకుమ పెట్టి, తాంబూలం యిస్తూ, "మీ పేరు చెప్పారు కారు," అంది భామ.

"శ్యామసుందరి. మీకు మా ఇల్లు తెలియదు కదా? ఫ్యాన్‌ను పంపిస్తాను. రండి. తప్పకుండా రావాలి."

శ్యామసుందరి వెళ్ళిపోయింది.

'పెద్ద ఆఫీసరు భార్య. పాపకు తల్లి. ఎమ్. ఎస్. సి. చేసి రీసెర్చి చేస్తూంది ఇప్పుడు!'

అణగిపోయిన విద్యాతృష్ణలో అలలు రేగాయి. చదువుకోడానికి గాని, ఉద్యోగం చేయడానికి గాని భర్త అనుమతి కోరలేదు. అసలు అలాంటి అవకాశం ఇచ్చేది కాదు అతడి తత్వం. అయినా, బాబో, పాపో పుట్టి తను తిరుగాడేదాక, అలాంటి అవకాశమే లేదుగా?' నిస్పృహగా నిట్టూర్చింది భామ.

జగన్మోహన్ టూరు వెళ్లాడు. నిన్న రాత్రి రావలసిన మాట. ఈ ఉదయంకూడా రాలేదు. పేరంటానికి వెళ్ళాలంటే ఇల్లు వంటవాడి మీద వదలాలి. అతడు ఎలాంటివాడో?

కొత్త ఊరు. నలుగురితో పరిచయం చేసుకోవాలంటే ఇది మంచి అవకాశం. అయినా, వెళ్ళాకపోతే ఏమనుకొంటారు వాళ్ళు?

'పనివాళ్ళను నమ్మకపోతే గడిచేకాలం కాదిది,' వంటవాడికి ఇల్లు అప్పగించి వెళ్ళడానికే నిశ్చయించుకొంది భామ. 'వచ్చాక వారి అభ్యంతర మేమైనా ఉంటుందా?' సందేహించింది. పేరంటం పిలిచారు. వెడుతూంది. షికారుకో, సినిమాకో కాదుకదా? సమాధాన పరచుకుంది.

పెళ్ళినాటి పట్టుచీరలో నిండుగా తయారైంది భామ.

ఇందాకా శ్యామసుందరితో వచ్చిన ప్యూన్ వచ్చాడు. "వస్తారా, అమ్మా?"

"ఆఁ." వంటవాడికి చెప్పి బయల్దేరింది భామ.

ముగ్గులు పెట్టి గొబ్బెమ్మలతో అలంకరించిన ప్రాంగణం ముద్దుగా స్వాగతం చెబుతూంది ముత్తయిదులకు. గుమ్మంలోకి ఎదురొచ్చిన శ్యామసుందరి. "రండి!" అంటూ ఆహ్వానించింది.

అప్పటికే చాలామంది పేరంటాళ్ళు వచ్చారు. వస్తున్నారింకా.

రకరకాల అలంకరణలలో అందాన్ని వెదజల్లుతూన్న ఎంతో మంది ముత్తయిదులు! చదువుకొన్న వారు. అంతగా చదువుకోనివారు.

నగల గురించి, చీరల గురించి ఏవో సాంసారికమైన ఇబ్బందుల్ని గురించి కబుర్లు సాగిపోతున్నాయి. ఎంత చదువుకొన్న యువతిఅయినా ఇలాంటి కబుర్లలోనే నిజమైన తృప్తి పొందుతుందేమో.

అలాంటి కబుర్లంటే అంతగా అనిష్టత లేకపోయినా అక్కడ పరిచయమున్నవారు ఎవరూ లేరు భామకు, శ్యామసుందరి తప్ప.

ఒకరిద్దరు భామకేసి కుతూహలంగా చూడడం గమనించిన శ్యామసుందరి, "జగన్మోహన్ రావుగారి భార్య. సత్యభామా బి. ఏ." అంటూ పరిచయం చేసింది.

గ్రాడ్యుయేటు ఆడంబరమేదీ లేని భామ బి. ఏ. అని వినగానే అట్టహాసం ఒలకబోస్తూన్న కొందరు యువతులు సర్దుకు కూచున్నారు. అంతగా అందరినీ పట్టించుకోకపోయినా ఒకరిద్దరితో పరిచయం పెరిగింది భామకు. ఒకరిళ్ళకు ఒకరిని ఆహ్వానించుకొన్నారు.

మానవజాతి సంఘజీవనంలో ఎవరికి వారే గిరి గీచుకుని ఉండడంలో ప్రయోజనం లేదు సరికదా, నష్టం మాత్రం ఉంటుంది. అందుకే నలుగురిలో కలసి తిరగడమంటే సరదా పడుతుంది భామ.

పసుపు కుంకుమ తీసుకుని అందరూ వెళ్ళిపోయాక కూడా భామను కాస్సేపు కూచోబెట్టుకొంది శ్యామసుందరి, "కాసేపు కూచోండి. ఏం, ఇంట్లో పిల్లలేడుస్తారని బెంగా? భర్తగారు దండిస్తారనిభయమా?" అంటూ.

కాన్సేపు జరిగిన ఇష్టాగోష్టి సంభాషణలో- "మీరు చదువు సాగిస్తే మంచిది," అన్న అభిప్రాయం వ్యక్తపరిచింది శ్యామసుందరి.

"ఆయన ఒప్పుకోరనుకొంటాను," అంది భామ. "అయినా. నా కిప్పుడు రెండోనెల. ఇప్పట్లో ఆ మాట తలపెట్టే అవకాశం లేదు."

"మీలో విద్యాతృష్ణ ఉన్నప్పుడు ఒకరి అభ్యంతరాలు లెక్క పెట్ట నవసరంలేదు. ఎన్ని కష్టాలు పడి అయినా తీర్చుకోవాలి. పోతే మీ కోరికలో అసంగతం లేనప్పుడు ఆయన అభ్యంతరంలో అర్థం లేదు. పోతే, గృహిణిగా మీ విధులు విస్మరించడం మాత్రం కూడదు. అన్నివిధాలా ఆయన అవసరాలు చూస్తూ మన విజ్ఞానం వృద్ధిచేసు కొంటూ ఉంటే కూడా ఆయనకి అభ్యంతరం ఉన్నదంటే—ఇంకా ఆడదాన్ని అధోగతిలో ఉంచాలన్న తాపత్రయం వ్యక్తమౌతుంది. కాని, మీ ఆయన అలాంటివారు కారనుకొంటాను. కోరి కోరి చదువు కొన్న భార్యను చేసుకొన్నారాయె!"

"నిజమే. బయట గర్వంగా చెప్పుకోడానికే గాని, సంసారంలో నా తెలివి తేటలు భరించే సహృదయత మాత్రం లేదు," నవ్వేసింది భామ.

అభ్యుదయపథంలో స్త్రీ పయనించినట్టుగా పురుషుడు పయనించడం లేదు. ఇంకా చాందసపు భావాలకు స్వస్తి చెప్పలేకపోతున్నాడు. బండికి కట్టిన జోడెద్దులు సమంగా పయనిస్తే పేచీలేదు గాని ఒకటి ఎగలాగడం ఒకటి దిగలాగడం సాగితే ఎంతకష్టం తెలుసా?"

నవ్వుతూ ప్రశ్నించింది భామ: "అలాంటప్పుడు పరిష్కారం చెప్పండి."

"వెనక్కి లాగే జోడును వదిలి ఒంటరిగా నడవడమైనా మేలు. కాకపోతే తనకు సరి అయిన జోడీని ఎన్నుకొని సాగడం మేలు," చాలా నిర్లక్ష్యంగా, తేలిగ్గా చెప్పింది శ్యామసుందరి.

"అయితే విడాకులు మీరు సర్వసాధారణమైన విషయంగా సమర్థిస్తారన్న మాట. కాని మన హైందవ...."

"ఛస్! మన హిందూ ధర్మం హిందూ ధర్మంలాగే ఉందా? ఎన్ని మార్పులు చేర్పులు రాలేదు? భార్యాభర్తలలో ఒకరి అభివృద్ధిని

ఒకరు నిరోధిస్తునప్పుడు, ఒకరి సుఖాన్ని ఒకరు నిరసిస్తున్నప్పుడు హిందూ ధర్మం పేరుతో కలసి ఉండి జీవితాలను నరకం చేసుకొనడం కంటే విడిపోయి ఎవరి బాటలో వాళ్ళు నడవడం సుఖం కాదూ?"

"సంసారం కోసం కొన్ని కోరికలనూ, సుఖాలనూ వదులుకో వచ్చు. కాని ఆత్మాభిమానాన్ని న్యూనతపరిచే పురుషాధిక్యాన్ని నేను కూడా సమర్థించను. పోతే, మీరు చెప్పినంత సులభం, సుఖం కాదు విడాకులు. కొన్నాళ్ళు కలసి వున్న అనుబంధం, అందువల్ల కలిగిన పిల్లలు వున్నప్పుడు—పురుషుడి మాటేమోగాని స్త్రీ ఎక్కువగా కష్ట పడుతుంది. విడిపోయి బ్రతకడంలో...దానికేం గాని మీ యిల్లు చూద్దాం రండి," భామ లేచింది.

వెనుకా ముందు అంతా చూసి, "చిన్నదైనా పొందికగా వుంది. చక్కగా మొక్కలు వేసుకోవచ్చు. అక్కడ మాకు బాగా ఇరకాటం అయిపోయిందండీ యిల్లు. నాలుగు పూల మొక్కల పెట్టుకొందామంటే స్థలం లేదు" అంది భామ.

"అద్దె ఎంతిస్తున్నారు?"

చెప్పింది భామ.

"ఈ పక్కనే ఒక యిల్లు కాళీగా వుంది. అయిదు రూపాయలు ఎక్కువే అయినా మీకు నచ్చుతుందనుకొంటాను. చూస్తారా? వాళ్ళకు ట్రాన్సఫరై వెళ్ళిపోతూ తాళం చెవి యిచ్చిపోయారు మాకు, ఎవరి కైనా అద్దెకు యిమ్మని. ఇంటి ముందూ, వెనుకా కావలసినన్ని చెట్లు పెట్టుకోవచ్చు."

"చూద్దాం."

డ్రాయరు సొరగులోంచి తాళం చెవి తీసుకొని "పదండి" అంది శ్యామసుందరి.

ఇల్లు చూసింది భామ. గదులు ఎక్కువగా లేవు గాని వసతిగా వుంది. కొళాయికీ, బాత్ రూముకూ, లెట్రిన్‌కూ ఎవరి పొత్తూ లేదు.

కరెంటు ఛార్జీ, కొళాయి ఛార్జీ అన్నీ కలుపుకొని అద్దె ఏభై అయిదు అవుతుంది.

'అయినా ఫర్వాలేదు. నాలుగు కూర పాదులు పెట్టుకొన్నా

మంచే అద్దెకు కలిసి వస్తుంది.' సంతృప్తి పడింది భామ. ఇదివరకే ఇంటివాళ్ళకు ఒక నెల అడ్వాన్సు ముట్టింది. అది వదులుకుని కూడా ఈ నాలుగైదు రోజుల్లో ఇల్లు మారుస్తామని గట్టిగా చెప్పింది భామ.

* * *

"ఎంతసేపైంది వచ్చి?"

భామ పేరంటం నుండి తిరిగి వచ్చేప్పటికే జగన్మోహన్ వచ్చాడు. పేపరు చూసుకుంటున్నాడు.

"అరగంట అవుతూంది."

భర్తముఖంలో వ్యక్తమౌతున్న నిరసన భావాన్ని గుర్తించిన భామ మౌనంగా లోపలికి వెళ్ళిపోయింది.

ఆరిపివేసిన పొయి ముందు కూచుని మౌన జపం చేస్తున్నాడు వంటవాడు.

"ఆయన ఏమైనా తీసుకొన్నారా, భూషణం?"

"లేదు. టీ తీసుకొంటారా — అన్నాను. అక్కర్లేదన్నారు. మీరు ఇంజనీరు గారింటికి వెళ్ళారని చెప్పాను" చెప్పాడు భూషణం.

గుడ్డలు మార్చుకుని, టీ తీసుకుపోయి యిచ్చింది భామ.

మౌనంగా అందుకొన్నాడు జగన్మోహన్.

తనూ ఓ పత్రిక తీసుకొని చూస్తూ కూచుందేగాని అతడి మౌనం దుర్భరంగా తోచింది భామకు.

"నిన్నే వస్తా నన్నారు. రాలే దెందుకని? పండగపూట ఊళ్ళో లేకుండా..."

"ఆ" కారణాలు చెప్పాడు. ముఖమంతా చిట్లించుకొని అన్నాడు "డాక్టరు ఎక్కువగా తిరగొద్దని చెబితే నువ్వు చేసిందేమిటి? వెళ్ళి పోతే ఏమయ్యేది? ఆరోగ్యం బాగుండలేదని చెబితే సరిపోయేది కాదూ?"

"నాలుగడుగులు వేస్తే వచ్చే యింటికి పేరంటం పిలిస్తే— వెళ్ళలేనంత అనారోగ్యంతో ఉన్నానా!" చిరాకుగా అంది భామ.

"నీకే తెలుసు. కడుపులో నొప్పని అర్భాటం చేస్తే హడలి చస్తూ డాక్టరుకోసం పరుగెత్తే వెధవను నేనున్నాను. అయినా వంట మనిషి మీద ఇల్లొదిలేసి వెడితే ఏమన్నట్టు?"

అమ్మగారిని చీవాట్లు వేస్తుంటే వింటూనే ఉన్నాడు నాగభూషణం. "పనివాడు దొంగయితే వాడికి బతుకు తెరువు ఉండదు, బాబూ!" అన్నాడు నొచ్చుకుంటూ. "మీ యింట్లో దొరికింది చిక్కించుకొని పారిపోతానే అనుకోండి. పట్టుబడితే తద్దినం కావడం అటుంచి మరో చోట పని దొరుకుతుందా? రెక్కల్ని నమ్ముకొని బతుకుతున్నవాణ్ణి. దొంగ సొమ్ము వద్దు, బాబూ."

"నీ సంగతి కాదోయ్. ప్రపంచం అలా వుంది. ఎవరినీ నమ్మే కాలం, కాదిది" ఎగిరిపడ్డాడు జగన్మోహన్. "ఈ నెలలో నీ మందులకూ, డాక్టరు ఫీజుకూ ఎంత ఖర్చయిపోయిందో తెలుసా? పైగా ఈ వంటమనిషి ఖర్చు కూడా ఒకటి. డబ్బు నీళ్ళలా ఖర్చుపెట్టేస్తుంటే నువ్వు ఆరోగ్యాన్ని నిర్లక్ష్యంచేసి తిరిగివస్తానంటే ఏమన్న మాట?"

మనవానికీ నోరు రాలేదు భామకు. సున్నితమైన మందలింపు కాదు. కటువుగా వుంది వ్యవహారం. తన ఆరోగ్య విషయంలో ఆందోళన కంటే తను లేని సమయంలో వంటవాడి మీద యిల్లు వదిలేసి వెళ్ళావన్న ఆక్షేపణే ఎక్కువగా ఉందతడి కోపంలో. మరొకటి కూడా ఉందేమో, తను ఊరి నుండి వచ్చేసరికి తయారుగా తనకోసం ఎదురు చూస్తూ కూచోలేదన్న బాధ!

సంసార మన్నాక అన్నీ అనుకొన్న ఖర్చులే వుండవు. అనుకోని అవసరా లెన్నోన్నో వస్తుంటాయి. సహనంతో సర్దుకు పోవాలిగాని, ఇలా తన్నుకోవడంలో అర్థం లేదు. అయినా ఈ నెలలో వచ్చిన ఖర్చు అతడి జీతానికి బరువైంది కాదు. డబ్బుకు యింతగా గింజుకుంటున్నాడని తెలిస్తే అతడు యిప్పించే ట్రీట్‌మెంటుకు తను వస్తే ఒప్పుకొనేది కాదు!

భామ అభిమానం దెబ్బ తిన్నది.

'పైగా వంటమనిషి ఖర్చు అంటూ ఎగురుతున్నాడు. ఇలా వంట మనిషిని కుదిర్చింది నువ్వు తీరికగా షికార్లు కొట్టడానికా—అన్న వెటకారం కూడా ఉందేమో ఆయనగారి ఆగ్రహంలో. పొద్దున్నే అతడికి జీతం యిప్పించి పంపివేయాలి,' రోషంగా అనుకుంది. 'వారమైన

నిండలేదు, కొత్త కాపురం మొదలుపెట్టి. అప్పుడే కలతలా? పెరిగి పెరిగి రెండు జీవితాలు రెండు బాటలు పట్టవు కదా?"

భామ భయపడినా—తన ఆలోచనలో విపరీతం లేదు కదాని సమీక్షించు కొంటూనే వుంది. భర్త ప్రవర్తనపట్ల తన దృక్పథం మూర్ఖంగా, అహంకార పూరితంగా లేదుకదా అని తర్కించుకొంటూనే వుంది.

కాని, ఉదయం వంటవాడిని భామ పంపించాల్సిన అవసరం లేకపోయింది.

జీతం లెక్కగట్టి యిచ్చేసి భూషణాన్ని పంపివేశాడు జగన్మోహన్.

ఆపని తనవల్ల జరిగితే తృప్తిగా ఉండేది భామకు. భర్త చేయడంవల్ల అవమానకరంగా తోచింది ఆమెకు. పండగ పుట్టింట్లో గడపకపోయినా, ఉన్నచోటయినా చేతనైనంత మట్టుకు చేసుకొందా మనుకొంటే మనసు పాడైపోయింది.

"తూచి తూచి పెట్టాలి ఖర్చు. ఈ సంవత్సరంలో ఇద్దరికి ముగ్గురం అవుతున్నాం, డబ్బు కాస్త వెనక వేయకపోతే లాభంలేదు. నువ్వూ నాతో సహకరించాలి, మరోలా అనుకోకు. ఏం?" అతడి సమర్థింపుకు ఒళ్ళుమండింది భామకు.

రాత్రి భర్త ప్రవర్తన అంత నిష్ఠురంగా లేకపోతే వంటవాడు లేకపోయినా ఫర్వాలేదు. అతడికి తలంటిపోసి, పండగ గొప్పగా జరుపుకునేది. ఇప్పుడు చేయాలంటే ఒంట్లో ఏమిటో నిస్సత్తువ ఆవరించింది.

స్నానంచేసి మామూలుగా వంటకు పెట్టింది భామ.

ఏమీ జరుగనట్టు, నవ్వుతూ వంట గదిలోకి వచ్చాడు జగన్మోహన్, "పండగ స్పెషల్ ఏమిటి? నేను సాయం రానా?"

మంద్రస్వరాన అంది భామ; "అక్కర్లేదు. నాకు చాతైనంత మట్టుకు చేసిపెట్టగలను."

"ఇదిగో. కోపం వచ్చినట్టుంది, వంటవాణ్ణి పంపివేసినందుకు," సరసంగా భామ భుజంమీద చెయ్యేసి, అను నయింపుగా అన్నాడు:

"నాతో సహకరించమన్నది నేనొక్కడిని సుఖపడి పోవడానికి కాదు కదా? మన భవిష్యత్తునూ, మన పిల్లల భవిష్యత్తునూ దృష్టిలో ఉంచు కొని అనవసరమైన ఖర్చులు తగ్గించేద్దామన్నాను. నువ్వు అపార్థం చేసుకుంటే ఎలా?"

"అపార్థం చేసుకోలేదు. సక్రమంగానే అర్థం చేసుకొన్నాను. అందుకే మామూలు పప్పన్నంతో రోజు గడిపేస్తే సరిపోదా? పండగ స్పెషల్ అనేప్పటికి అదో ఖర్చు మళ్ళీ."

"నువ్విలా వెటకరిస్తే బాగుండదు," విసుగ్గా లేచిపోయాడు.

పండగ రోజు చిన్న బుచ్చుకోవాలంటే భామకే మనస్కరించడం లేదు. భర్తమీది కోపంతో మానేస్తే మనసుకు కొరతగా ఉండి పోతుంది. సాధ్యమైనంత మట్టుకు సర్దుకు పోవడమే సాంసారిక లక్షణం.

తృప్తిగా భోజనం ముగించి తాంబూల చర్వణంచేస్తూ పేపరు తిరగేస్తూ ముందు గదిలో కూచున్నాడు జగన్మోహన్. వంట గిన్నెలూ అవీ సర్దేసి వచ్చింది భామ- "రాత్రి ఓ చక్కని ఇల్లు చూసి వచ్చాను," అంటూ.

"ఎక్కడ?"

చెప్పింది. "అద్దె అయిదారు రూపాయలు ఎక్కువే అయినా ఫర్వాలేదు. నాలుగు కూరపాదులు వేసుకొన్నామంటే- నాకు కాలక్షేపం. ఇంటికి అందం. కూరగాయల ఖర్చు తగ్గుతుంది," మంచి ఇల్లుచూసి తనో ఘనకార్యం చేసినట్టు చెప్పింది, గర్వంగా.

"ఇప్పుడు దీనికేమైంది? మళ్ళీ ఇక్కడికీ, అక్కడికి సామాను మోత. అనవసరమైన ప్రయాస." అనిష్టత వ్యక్తపరిచాడు జగన్మోహన్.

"బొత్తిగా ఇరకాటం. వచ్చేది వేసవి. చల్లగాలిలేక ఉక్కిరి బిక్కిరి కావాలిసిందే."

"ఏదో నాలుగు రోజుల కాలక్షేపానికి పన్నెండిళ్ళు మారడం దేనికి? ఎప్పుడు ట్రాన్స్ఫరై వెళ్ళిపోయేది తెలియదు."

విసుగు పడింది భామ. "మనం ఎప్పుడు చచ్చేదికూడా తెలియదు. అలాగని ఏం వద్దను కొంటున్నాం?"

"సరే. ఒకనెల అడ్వాన్సు ముట్టిపోయింది కదా వీళ్ళకు? ఈనెలంతా ఉండి వచ్చేనెలలో చూద్దాం."

"ఈ నాలుగైదు రోజుల్లో వచ్చేస్తామని చెప్పాను వాళ్ళకు. మన కోసం ఒకనెల ఖాళీగా ఉంచుతారా?"

"నాతో ఆలోచించకుండానే మాటిచ్చేశావా? మా వాళ్ళనడిగి చెబుతానంటే- అప్పుడే ఇల్లు ఎగిరిపోయేదా?"

"ఎగిరి పోతుందని కాదు. మరీ నాదింత అస్వతంత్రమైన బ్రతుకని తెలియక," ఉక్రోషంగా ముఖం తిప్పుకొంది భామ.

గంభీరంగా అన్నాడు జగన్మోహన్: "నీ మాట కాదంటే నువ్వెంత బాధపడతావో, నువ్వొక్క మాట నన్నడగకుండా ఆ ఇంట్లోకి వస్తామని చెప్పావంటే నాకూ అంత బాధగా ఉండదూ?"

సామాను ప్యాక్ చేస్తున్నప్పుడు భామ వాడుతూన్న మందులు చూసి షాక్ తిన్నట్టు అయ్యాడు జగన్మోహన్. "మందులు వేసుకోవడం లేదూ?"

"........" ముఖం తిప్పుకుంది భామ.

"ఏం?"

"రోషానికి తక్కువలేదు." మండిపడ్డాడు. ఎన్ని రూపాయలు ఖర్చయిపోయాయి ఈ మందులకు? కడుపు నొప్పంటే ఓ మందు. కాళ్లలాగుతాయంటే ఓ మందు. కళ్ళు తిప్పుతాయంటే ఓ మందు. చేతిలో కలానికి అడ్డులేకుండా డాక్టరమ్మ వ్రాసిస్తే తనో తిక్కవెధవై తెచ్చిపోశాడు. వ్రాసినవన్నీ. అంతంత ఖరీదులుపెట్టి తెచ్చిన మందులు పాడైపోతున్నాయన్న దుగ్ధ వాటిని పాడుపెట్టిన భామపంతం చూస్తే మంట అలుము కుందతడి హృదయంలో. కాని, ప్రతీకార మేదీ తోచలేద తడికి. అసలు ఆడది. అందులోనూ చదువుకొన్న ఆడది. పౌరుషం వచ్చిందంటే దాన్ని నిలబెట్టు కోడానికి ఎంతటి సాహసానికైనా తయారు కాగలదు.

భామ సంగతి తనకు తెలుసు. కాని, ఎక్కడికక్కడ హద్దు లేర్పరుస్తూనే ఉండాలి. కాకపోతే పెత్తనమంతా తనది చేసుకొని పిలక

చేతిలోకి తీసుకోగలదు. ఆడదాని చేతిలో తోలుబొమ్మ కావడం మగ వాడి కెంత అసహ్యంగా ఉంటుంది?"

# 5

"కటస్ర్పోను, ఇదీ నా జీతం. సంసారమంతా నీ ఇష్టం. నెలా ఖరున బ్యాంకులో ఎంతవేసేదీ నీ ఇష్టం. టి.ఎ. బిర్సు వస్తే నా ఖర్చు లకు ఉంచుకొంటాను," సర్వాధికారాలు ఇచ్చివేసిన దాతలా ముఖం పెట్టాడు జగన్మోహన్.

'ఇంత సద్బుద్ధి ఈయనకెలా కలిగిందా," అని ఆశ్చర్య పోయిన భామ వెనుకనే సర్దుకొంది. "చతురుడు కాదూ? దొంగకు తాళం చెవులు ఇవ్వడంలోగల చాకచక్యమిది!"

బాధ్యత తనదైనప్పుడు హద్దులు వాటంతటవే ఏర్పడిపోతుం టాయి. అనవసరమైన ఖర్చులంటే అసలే చెయ్యి రాదు. ఇంటిలో పెత్తనం తనది అయినా, డబ్బు ఖర్చు మగవాడి చేతినుండి జరిగితేనే ఆడదానికి సుఖం. "అయినా ఇదీ కొన్నాళ్లు చూద్దాం," అనుకొని డబ్బు తీసుకుంది భామ. "సంసార నౌకకు డబ్బు చుక్కాని లాంటిది. చుక్కాని పట్టడంలో తన నేర్పంతా చూపాలి.". తన సంసార నౌకా గమనం మీద అప్పుడే ఉజ్వలమైన కలలు కనడంలో మునిగిపోయింది భామ.

* * *

"అత్తా, అమ్మ వస్తూంది." శ్యామసుందరి పాప పరిగెత్తుకు వచ్చింది. పాపకు తల్లితో తిరగడమంటే చాలా సరదా. కాని, అదే అపురూపం. శ్యామసుందరికి తీరుబడి తక్కువ. తీరిక చిక్కినప్పుడు మాత్రం ఎక్కువగా పాపతో గడుపుతూంటుంది.

వెనుకనే వచ్చింది శ్యామసుందరి. "ఓ! మిమ్మల్ని అలాగే ఫొటో తీసెయాలి."

కుచ్చిళ్ళు పైకి దోపి పమిట నడుముకు చుట్టి పెరట్లో టొమేటో నారు పెడుతూంది భామ. రేగిన ముంగురులతో, చెదిరిన కుంకుమతో సినిమాలో పల్లె యువతిలా ఉంది.

నవ్వేసింది భామ. "ఇంట్లోకి పదండి. వస్తాను చేతులు కడుక్కొని."

"అహఁ. మొక్కలు నాటండి. నారు పీకిపెట్టారు, వాడి పోగలదు," వారించింది శ్యామసుందరి. "కావలిస్తే నేనూ రాగలను మీకు సాయం. సోమరిగా కూలబడి ఉత్త కబుర్లు చెప్పుకోవడం కంటే తోట పని మంచి కాలక్షేపం."

"అదేమిటండీ? ఇస్త్రీ చీర పాడై పోగలదు."

"మరేం ఫర్వాలేదు."

భామ వారించినా వినలేదు శ్యామసుందరి. మొక్కలు నాటడంలో సాయం వచ్చింది. "మీ కిదివరకే తోటపని బాగా అలవాటు వున్నట్టుందే?"

"ఆఁ. మా పుట్టింట్లో కావలసినంత చోటు. మా నాన్నగారికి తోటపని ఇష్టం. మా పిల్లలందర్నీ పిలిచి తలా ఓ పని చెప్పేవారు. ఇంటికి కావలసిన కూరగాయలు కొనకపోవడం అట్లా ఉంచి పరిచయస్తులకూ, స్నేహితులకూ పంపే వాళ్ళం."

పాప ఓ చెంబు తీసుకొని కొళాయి దగ్గర నీళ్ళుపట్టి తెచ్చి నాటిన మొక్కలకు నీళ్ళుపోస్తూంది. "వద్దు, పాపా. గుడ్డలు తడుస్తాయి." వారించింది భామ.

"తేనీండి, పిల్లలు ఎక్కువగా చెడ్డపనులే చేస్తున్నా, అంతగా హద్దు లేర్పరచ కూడదండీ. స్వేచ్ఛలేకపోతే వారి మనసులు వికసించే దెలాగ?"

మొక్కలు నాటడం పూర్తయి చేతులు కడుక్కున్నారు.

ఇంట్లోంచి స్టూల్ తెచ్చివేసింది శ్యామసుందరికి.

"నాలుగు రోజులుపోతే చక్కనితోట ఆకృతి రూపొందుతుంది. ప్రశాంతంగా మీ తోటలో కూచుని చదువు కోడానికి వస్తాను." సరదాగా అంది శ్యామసుందరి. "మా ఇంట్లోనూ కావలసినంత ఖాళీ స్థలముంది

కాని, తోటపెట్టగలంత తీరిక నాకెక్కడిది? పూర్తిగా [illegible]
అయ్యేపనికాదు. తొట్లలో నాలుగు క్రోటన్ మొక్కలున్నాయంటే
వాటికి నీళ్ళు పోయటానికి ఏడుస్తాడు వాడు."

"భామా!"

అవతలినుండి జగన్మోహన్ కేక వినిపించింది. లోనికి వస్తున్న
అతడు శ్యామసుందరిని చూసి వెనుదిరిగి పోయాడు.

"కూచోండి, వస్తాను," శ్యామసుందరిని కూచోపెట్టి అతడి
వెనుకే వచ్చింది భామ. "తొందరగా వచ్చేశారేం?" రోజూ ఆరింటికి
గాని రానివారు.

"పిక్చర్‌కు వెడదామని. తొందరగా తయారవ్వు."

"అబ్బే. ఈ రోజు కాదు. నేనింకా రాత్రికి వంట పెట్టలేదు.
అందులోనూ శ్యామసుందరిగారు వచ్చారు."

"ఆవిణ్ణి తొందరగా పంపేసి, తయారుకా. ఈ రోజు వెళ్ళి
[illegible]"

"బాగుంది మీ వరుస. మేం సినిమా కెళ్ళాలి మీరు దయచేయండి
అని చెప్పనా?"

"శ్రీవారు సినిమా ప్రోగ్రాం వేశారని చెప్పు. ఆవిడే వెళ్ళి
పోతుంది."

"ఉహుఁ. ఈ వేళకాదు. రేపు వెడదాం."

"అయితే నీ ప్రారబ్ధం. నే నొక్కణ్ణే వెడతాను. తరువాత
ఏడిస్తే బాగుండదు చూడు...." కొంచెం నిష్ఠూరాన్ని, కొంచెం
కోపాన్నీ మేళవిస్తూ అన్నాడు.

చివుక్కుమంది భామ మనసు. కళ్ళు చిట్లించి అంది కోపంగా:
"సినిమాలంటే అంతగా పడిచచ్చే దాన్ని కాదు లెండి, ఏడ్వడానికి.
ఇంకా వంట కాలేదు. రేపు వెడదామన్నాను. మీ కంత ఉబలాటంగా
ఉంటే మీరు వెళ్ళండి. ఆ మాత్రానికి ఖర్మ లెంపడం దేనికి?"

బంధువు లెవరో వచ్చారు రమ్మంటూ శ్యామసుందరికి పిలుపు
వచ్చింది. 'వస్తా' నంటూ వెళ్ళిపోయిందామె.

"మరిక త్వరగా కానీ. వండేం వంట? అన్నం వండితే సరిపోదూ?"

"పొద్దుటి కాజేజీ అయిపోయింది. ఏదైనా చేయాలి."

"ఊరగాయలతో పని దాటిద్దాం లెద్దూ. గబగబా అన్నం ఒకటి ఉంపెయ్."

"నేనేం రాదలుచుకోలేదు. మీరు వెళ్ళండి."

"అబ్బా! చీటికి మాటికిలా కోపం తెచ్చుకొంటే ఎలా, భామా! మొగుడూ పెళ్ళాలం కదా? దురుసుగా ఒకమాట అన్నానే అనుకో. మరీ అంత పట్టింపుగా తీసుకోవాలా?" లాలనగా భుజంమీద చెయి వేశాడు.

దూకుడుగా అంది భామ: "ఏం? ఎందుకు దురుసుగా మాట్లాడాలి మొగుడైతే మాత్రం? వ్యక్తిత్వం, ఆత్మాభిమానం ఉండవా ఏమిటి పెళ్ళామైతే? అనవసరంగా అంటే ఎందుకు పడతాను?"

"ఊఁ. దెబ్బలాటకు బాగా తయారు." విసుక్కొన్నాడు. "ముందు అన్నానికైతే పెట్టు. సినిమాకు వీలైతే పోదాం. లేకుంటే ఇద్దరం మానేద్దాం. మరోసారి వెళ్ళొచ్చులే."

'అలా రావాలి దారికి', అనుకొన్నదేగాని అంతగా తృప్తి కలుగలేదు భామకు. 'ముందు సినిమాకైతే పద. తిండి తిప్పలు తరువాత చూద్దాం. బజారునుండి పళ్ళోగిళ్ళో తెచ్చుకొందాంగాని!' అంటే మరింత బాగుండేది. అందుకు తను ఎలాగూ ఒప్పుకోక పోయినా.

అనుకొన్న టైముకు అయిదు నిమిషాలు ముందుగానే తయారైంది భామ

కర్చీఫ్ మడత పెట్టుకొంటూ జోళ్ళలో కాళ్ళు దూరుస్తూన్న భామతో— "మరి హేండ్ బాగ్ తీసుకోవూ?" అన్నాడు జగన్మోహన్.

"అదెందుకు? వెధవ ఫాషన్‌లు నాకంతగా అలవాటు లేవు."

"కాదు. డబ్బు తీసుకోవూ?"

సంగతి అర్థమైపోయి పెంకెగా నవ్వింది భామ. "భలే! మీరు సినిమాకు తీసుకుపోతూ నన్ను డబ్బు అడుగుతున్నారా? మీ పప్పు [illegible] జేబు ఖర్చుకని ఉంచుకొన్నారే. ఆ డబ్బెటి

తీసికెళ్ళండి నన్ను. సినిమా ప్రోగ్రాం నేను వేసినప్పుడు నాడబ్బు ఖర్చు పెడతాను."

"గట్టి దానివే! సరే, పద." తాళం కప్ప చేతికి తీసుకొంటూ, హాయిగా నవ్వేసాడు జగన్మోహన్. జీతం తెచ్చి భార్యచేతిలో పెట్టి తను పొంపాటు పనేమీ చేయలేదని తెలిసి వస్తూందతడికి.

* * *

"అమ్మా, పుస్తకాల పార్సెల్ వచ్చింది." పిలిచాడు పోస్టుమాన్.

చీటీమీద సంతకంచేసి ఎమెస్కో పుస్తకాల పార్సెల్ అందుకుంది భామ.

"ఏమిటది?" ఆశ్చర్యంగా అడిగాడు జగన్మోహన్.

"ఎమెస్కో పోకెట్ బుక్స్‌కు చందా కట్టాను."

"మరి నాకు చెప్పలేదే?"

"మరిచానేమో!" కవరులోంచి పుస్తకాలు తీసిచూస్తూ పరధ్యానంగా జవాబిచ్చింది.

"మరీ నీకు పుస్తకాల పిచ్చి ఎక్కువవుతూంది, భామా! అనవసరంగా డబ్బు తగలెయ్యడం కాక మరేముంది? ఒకసారి చదివి అవతలపారేసే పుస్తకాలకు. నువ్వు కావాలంటే మా ఫ్రెండు ఎమెస్కో నుండి పుస్తకాలు తెప్పిస్తుంటాడు. అడిగి తెచ్చిచ్చేవాడిని కదా!" చిన్నగా మందలించాడు.

"ఇంట్లో చిన్న గ్రంథాలయం ఏర్పాటు చేసుకోవాలని నాకు చిన్నప్పటి నుండి సరదా అండీ. మా పుట్టింట్లో సాగలేదది. అంతా చిన్న చిన్న పిల్లలు. జాగ్రత్త తెలియని పెద్దలు, నాకు తెలియకుండానే పుస్తకాలు పట్టుకెళ్ళి ఎవరికో యిచ్చేవాళ్ళు. వాళ్ళ వెనకబడి తెప్పించుకొనేప్పటికి అటు యిటు పది పన్నెండు పేజీల దాకా చిరిగిపోయి, మధ్య కాగితాలతో చేతికి వచ్చేది. అందువల్ల అక్కడ నా అభిలాష తీరలేదు. ఇక్కడ నా ఇల్లు, నా స్వతంత్రం.

"అయినా, చదువుకోడానికి ఒకరి పుస్తకాలు అడిగి తెచ్చుకోవా

లంటే అసహ్యంగా ఉంటుందండీ, అన్ని పుస్తకాలు, పత్రికలు కొన లేకపోయినా మనకు అందుబాటులో ఉన్నంత వరకు కొనిపెడదాం."

రెండు మూడు వార, మాస పత్రికలకూ, ఒక దిన పత్రికకూ కూడా చందా కట్టింది భామ. అప్పుడూ ఇలాగే అభ్యంతరం తెలిపాడు జగన్మోహన్. వార్తలకూ, కాలక్షేపానికీ రేడియో ఉంది కదా, అంతగా కావాలంటే పక్కింట్లో తెప్పిస్తారు కదా- తెప్పించుకోరాదా అని.

చదవాలన్న జిజ్ఞాస మీకు లేదు. నాకుంది. నా అభిరుచి మీకు పనికిమాలినదిగా కనబడితే కనబడవచ్చు గాని ఈ ఖర్చుకు మాత్రం అభ్యంతరం చెప్పకండి దయచేసి," అంది భామ.

అయినా అనకుండా ఊరుకోలేదు జగన్మోహన్. అనవసరమైన ఖర్చంటూ గొణుగుతూనే ఉంటాడు.

"దొడ్లో కాసిన వంకాయలు మారుతిరావు ఇంటికి పంపావా? పచ్చిమిరపకాయలు కొంటున్నాం కదా, చేతినుండి పైసలు తగలకుండా వంకాయలు వెయ్యలేక పోయవా కూరల వాళ్ళకు?"

"ఈ ముసలి పనిమనిషికి పదిరూపాయలిచ్చి కుదుర్చుకొన్నావా? ఆ ముసలి పీనుగకు పనేం చేతనవుతుంది? దాన్ని చూస్తేనే అసహ్యంగా ఉంది. పక్కింటివాళ్ళ పనిమనిషి కుదురుతుందేమో అడగలేక పోయావా?"

అతడి మాటలు కొన్ని జుగుప్సాకరంగా ఉన్నా సరదాగానే తీసుకొంటూంది భామ. "ఎర్రగా, పడుచుదనం పరవళ్లు తొక్కుతూ- కంటికి నిండుగా ఉంటుంది కదూ అది?" కొంటెగా నవ్వేస్తుంది. "సరసులే. నాకు తెలియదు."

ఖంగారు పడిపోతాడు. "అబ్బే! అలాంటి ఉద్దేశం కాదు. ఇంటికి ఎవరైనా వచ్చినా చూడడానికి ఏం బాగుంటుంది ఆ ముసలి మొగం? అయినా....పనిమనిషి దేనికి చెప్పు? అన్నమో గిన్నెమో మిగిలితే చేతిలో వేశావంటే ప్యాన్ చేసిపోతాడు కదా చెప్పినపని?"

"ఆ స్టీల్ గిన్నె పొయిమీద పెడతావేం? పాడైపోదూ?"

"రోజూ తినే తిండేకదా? అన్నం మిగులు తుందెందుకు? మిగల

కుండా పోయరాదా బియ్యం? మార్కెట్‌లో బియ్యం ధర ఎంతుందో తెలుసుకదా?"

ఇలా ప్రతి పని మీద పర్యవేక్షణ జరుపుతూ పోరాడుతూంటే ఎంత కష్టంగా, అసహ్యంగా ఉంటుంది ఆడదానికి? భర్త జీతం తెచ్చి చేతిలో పెట్టినా సుఖం లేకుండా ఉంది భామకు. ప్రతి ఖర్చుకీ వివరం కావాలి అతడికి.

* * *

మరునాడు ఫస్ట్, జీతం చేతికి వస్తుందనగా కొంత డబ్బు భర్త చేతికి ఇచ్చింది భామ. "రేపు బ్యాంక్‌లో వేసిరండి."

నోట్లు లెక్కపెట్టి, అప్రసన్నంగా అన్నాడు జగన్మోహన్. "తక్కువే."

"తక్కువే, మరి. కొత్త సంసారం కదా? ఎన్నో సామానులు కొనాలి. టిఫెన్‌బాక్సు కొనాలి. ఫ్లాస్క్ కొనాలి. సోఫాసెట్ కొనాలి. కెమేరా కొనాలి. ఇంకా చాలా కొనాలి. వాటి కోసం కొంత డబ్బు తీసి మిగతాది మీకిచ్చాను." తన సంసారం గురించి సుందర స్వప్నాలెన్నో ఉన్నాయి భామకు. వాటిని నిజం చేసుకోడానికి ఎంత పొదుపుగానైనా ఉంటూంది భామ.

* * *

"జగన్మోహన్ రావుగారూ!"

వంటగదిలో ఉన్న భామ చెవులు రిక్కించి వింది ఆ కంఠాన్ని పరిచితమైన కంఠంలాగే ఉంది. వెంటనే మనిషి స్ఫురించడం లేదు.

తలుపు తడుతూ మళ్ళీ వినిపించిందాకేక పై స్థాయిలో.

"ఎవరూ!" వెళ్ళి తలుపు తీసింది భామ. ఎదురుగా కనిపించిన వ్యక్తిని చూసి గతుక్కుమంది. "బాగున్నావా, బావా?"

"ఊఁ. జగన్మోహన్‌రావు లేడా?"

"లేరు. బయటికి వెళ్ళారు. లోపలికి రా, బావా!"

లోపలికి వచ్చి కూచున్నాడు రాఘవేంద్రరావు.

"పాప బాగుందా?"

"ఊఁ. అంతా కులాసే కదా?"

"అవును గాని, సంగతులు చెప్పు."

"సంగతు లేమున్నాయి? పాప బాగుంది. ఎమ్. ఇ డి. ట్రెయినింగ్‌కు వచ్చాను ఇక్కడికి. మొన్నామధ్య మీ చిన్నన్నయ్య కలిశాడు. మీ రిక్కడున్నారని చెప్పాడు. ఇవాళ ఆదివారం కదా, చూసి పోదామని వచ్చాను.

అయిదారు సంవత్సరాలు అయిపోయింది ఇతడిని చూసి. చిన్నక్క పోయాక పాపను తీసుకొని వెళ్ళిపోయిన అతడిని మళ్ళీ చూడలేదు. పాపను ఒకటి రెండు సార్లు భామ తండ్రి వెళ్ళి చూసి వచ్చాడు. దూరపు బంధుత్వమేమో- అతడి సంగతులు ఎక్కువగా తెలిసేవికాదు. పూర్తిగా బంధమే తెగిపోయినట్టయింది. ఇన్నాళ్ళకు అనుకోకుండా కనిపించిన అతడిని పరిశీలనగా చూసింది భామ. అప్పటికీ, ఇప్పటికీ కూడా అంతగా మార్పేమీ కనిపించలే దతడిలో. ముప్ఫయ్యేళ్ళలో ఉన్న నిండైన విగ్రహం. కాని, చెప్పుకో తగ్గ మార్పు ఒకటే. గుండెల్ని కదిలించే మార్పు. ఆ కళ్ళలో ఇదివరకటి చిలిపితనం, ఉల్లాసం లేవు. అనురాగపు వీక్షణాలతో చిన్నక్కను స్నానం చేయించే అతడి కళ్ళలోవిషాదపు నీడలు పరుచుకున్నాయి. అప్పటికి భామ చిన్న పిల్లేమో- ఆటలు పట్టించేవాడు ఆమెను. కొంటె బావగానే ముద్ర వేసుకొన్నాడు ఆమె హృదయంలో. కాని, పరాచికాలాడే ఆ బావకూ, ఈ విషాదమూర్తికీ ఎంత తేడా ఉంది!

"మీ ఆయన ఎప్పుడు వస్తాడు?"

"వస్తాడు. కూర్చో, బావా. పొయిమీద పప్పు మాడిపోతున్నట్టుంది; "లోపలికి పరిగెత్తి పప్పు దించేసి వచ్చింది.

భామకూడా యవ్వనం వికసించిన యువతి అయింది. మామూలుగా మాట్లాడడానికి కూడా అతడూ సంకోచపడుతున్నాడు. చాలా కాలం తరువాత కలిశారు ఇద్దరు. పరస్పరం తెలుసుకో వలసిన సంగతులెన్నో ఉన్నాయి. కాని, మూగబోయి కూచున్నారు ఇద్దరూ. భామ చిన్నక్క స్మృతులతో హృదయాలు నిండి బరువెక్కాయి. అప్రయత్నంగా భామ కళ్ళు చెమర్చాయి. "పాప ఎక్కడుంది?"

వాళ్ళ నాన్నమ్మ దగ్గరుంది. మంచి ఇల్లు దొరికాక అమ్మనీ పాపనూ తీసుకు వస్తానిక్కడికి."

"బాగా పెద్దదైపోయి ఉంటుంది. చదువుతూందా?"

"ఊఁ. అయిదు వెళ్ళి ఆరో ఏడు కదా? వాళ్ళమ్మలాగే చాలా తెలివైంది. రెండో తరగతి చదువుతూంది."

"పాపను తీసుకొని నా పెళ్ళికి వస్తావని అనుకొన్నాం. పాపను చూడాలని చాలా ఎదురు చూసింది అమ్మ."

"ఊఁ." మూలిగాడేగాని మరో సమాధాన మేదీ చెప్పలేదు అతడు. "జగన్మోహన్ యిప్పుడే రాడేమో. నే వెళతాను. అమ్మా వాళ్ళు వచ్చాక, మరోసారి వస్తాను పాపను తీసుకుని."

"అహఁ ఆయన వస్తారు. నువ్వు భోంచేసి వెడుదువుగాని. బొత్తిగా పరాయివాడిలా ఏమిటంత యిది?" నొచ్చుకొంది.

మొదట మొహమాటపడ్డా, భామ బలవంతంతో ఆగిపోయా డతడు. వంట గది గుమ్మంలో పీట వేసి కూచోపెట్టి సంగతులు చెప్పించుకొంటూ వంట ముగించింది భామ.

ఎక్కువగా పాప సంగతులే. తల్లి లేని పాపను పెంచడానికి చాలా కష్టపడ్డారు. పాపను దక్కించుకోడానికి చాలా డబ్బు ఖర్చు పెట్టారు. ఇప్పుడు పాప ఆరోగ్యానికి లోటు లేదు. కుటుంబంలో తల్లి పరిచిపోయిన విషాదపు నీడలను వెలుగు రేఖలా పార(దోలుతూంది పాప తన ఆటపాటలతో, తెలివితేటలతో.

"నాకు మిగిలిన ఆనందం పాప ఒక్కటే, సత్యా!" అన్నా డతడు ఆర్ద్రంగా.

సానుభూతి పూర్వకంగా అంది భామ: "నువ్వు మళ్ళీ పెళ్ళి చేసుకుంటే బాగుండేదేమో, బావా."

పేలవంగా నవ్వాడు. "పాప ఆ ఆలోచనే రానివ్వదు, నా మనస్సులోకి."

మధ్యాహ్నం ఒకటి అయినా జగన్మోహన్ రాలేదు. సంక టంలో పడిపోయింది భామ. భోజనం పెడతానని ఉంచుకొని బావను

ఆకలికి చంపెట్టు అయిపోయింది. పోనీ భోజనానికి లేపుదామా అంటే- మగడు వస్తాడేమోనని సందిగ్ధం.

"నువ్వు లే, బావా. అయన వచ్చాక ఆయనా నేను తింటాం."

"వచ్చేప్పుడు హోటల్లో టిఫిన్‌చేసి వచ్చాను. ఆకలికావడం లేదు. అతడు రానీ."

రెండు కూడా అయింది. బలవంతం చేసి బావకు భోజనం పెట్టేసింది భామ. అతడు భోజనం ముగించి చెయ్యి కడుక్కొంటూంటే అవతల జోళ్ళ చప్పుడు వినిపించింది. అపరిచితు లిద్దరూ యిబ్బంది పడకుండా భర్తకు బావగారిని పరిచయం చేసింది. "మీకోసం చూసి చూసి ఇప్పుడే బావను భోజనానికి లేపాను," నొచ్చుకుంటూ అంది.

"ఫర్వాలేదు. దానికేం?" అన్నాడు జగన్మోహన్. "స్నేహితు లింట్లో ఆడుకొంటూ కూచుంటే ఆలస్యమైపోయింది." గుడ్డలు మార్చి అక్కడే కూచో బోయాడు.

"మీరు ముందు భోజనం చేసి రండి. పొద్దు తిరిగిపోయింది. సత్య కూడా భోజనం చేయలేదు. తరువాత మాట్లాడుకుందాం'! ఆత్మీ యంగా మాట్లాడాడు రాఘవేంద్ర.

భర్తకు వడ్డించి తనూ వడ్డించుకుని కూచుంది భామ.

"పప్పు యిలా ఉందేమిటి? మాడు వాసన వస్తూంది."

"బావ వచ్చాడప్పుడే. మాట్లాడుతూ మరిచిపోయి, వచ్చి చూసే ప్పటికి అడుగంటిపోయింది."

"ఊఁ."

అప్రసన్నంగా, గంభీరంగా, దీర్ఘంగా వున్న అతడి మూలుగు, కళ్ళు మూసుకొని అమాయికంగా నడిచేవాడికి రాయి తగిలి ఎగిరిపడ్డట్టని పించింది భామకు. 'బావతో తనకున్న అనుబంధం ఈయనకు పూర్తిగా అపరిచితం. హఠాత్తుగా చూస్తున్నాడు కాబట్టి అపార్థానికి తావిస్తున్నా డేమో.'

భోజనం ముగించి, తను యిచ్చిన వక్కపొడి నోట్లో వేసు కుని సరదాగా తోడి అల్లుడితో మాట్లాడుతూన్న భర్తను చూసి ఆశర్య పోయింది భామ. 'ఏమో! నేనే అపార్థం చేసుకొన్నానేమో ఆయన్ని!'

అనుకుంది. కాని, బావగారు —"ఎవరో స్నేహితు లింట్లో దిగి, హోటల్లో వుండడం దేనికి? పాపవాళ్ళను తీసుకు వచ్చేదాక ఇక్కడికి వచ్చెయ్యరాదా? అని మర్యాదగా అనడానికి సాహసం చాల్లేదు. 'ఆయనేమంటారో? అసలే కొంచెం పెత్తు విశా రపు మనిషి! తన భార్య పరాయి పురుషుడితో సన్నిహితంగా, అందులో అపవిత్రతకు స్థానం లేదని మనస్సాక్షి చెప్పినా—మెలగడం చూసి సహించే పురుషుడు అరుదు!' జంకింది.

అసలంతగా కలవని మనసులు ఆ యిద్దరివీ. ఏం చేస్తే ఏం విడ్డూరం ముంచుకు వస్తుందో నన్న జంకు ఎప్పటికప్పుడు పట్టి నిలుపుతూ వుంటుంది స్వేచ్ఛగా పరుగులెత్తా లనుకునే భామ భావాల్ని.

ఆ రోజంతా ముభావంగానే వున్నాడు జగన్మోహన్.

## 6

ఏదోతిరుగుతూందేగాని, భామ ఆరోగ్యం ఏమంత బాగుం డడం లేదు. వేవిళ్ళు. తిండి సరిగ్గా లేదు. నీరసం, కళ్ళు తిప్పుడు. డాక్టరు ఫీజుకు, మందులకూ ఖర్చుపెట్టానని భర్త కటకట పడిపోతాడని తన అనారోగ్యం సంగతులేవీ చెప్పుకోడం లేదు.

ఏదో యిద్దరి వంటే కాబట్టి చేసుకొంటూంది గాని, ఓ సంధ్యా సమయాన మామగారు దిగడం చూసి గుండె చెదిరింది భామకు. ఎలా చేసినా యించుమించుగా భర్తని సర్దుకుపోవచ్చుగాని పెద్దమనిషిని సంతృప్తి పరచాలంటే ఎన్నివిధాల చేస్తే అవుతుంది?

తండ్రి కొడుకుల మాటల్లో మామగారు యిప్పట్లో కదలడని కూడా తెలిసింది. చేసిన పొరపాటేదో అంత వివరంగా తెలియరాలేదు గాని కరణీకం నుండి సస్పెండ్ చేయబడ్డాడని కూడా తెలిసింది.

రాకూడని వాడనా, ఉండకూడని వాడనా అన్నట్టు యిక్కడే తిష్ఠ వేశాడు ఆయన.

బాల్యంలో కాళ్ళలో యవ్వనంలో, నడుములో, వృద్ధాప్యంలో నోటికే వస్తుందట చాపల్యం. అరవయ్యో పడిలో పడ్డాడేమో నోటికి తీట పట్టుకొన్నట్టుంది ముసలాయనకు. అనవసరమైన కబుర్లూ, ఆడిపోశలూ అన్నీ కావాలి ఆయనకు.

ఇంటి ముందుకు కూరలమ్మి వస్తే సరి.

బేరం చేసేది భామే. కాని, ముందు వచ్చి నిలబడతాడు ముసలాయన. "ఆ రాయి ఏమిటి? గులకరాయి పెడితే ఎట్లా అనుకొన్నావు? అర్థ కిలో వుందో, ముప్పావు కిలో వుందో ఎట్లా తెలియాలి?"

"మీకు ఒక్కరికే వేయడంలేదు, సామీ! తూకం రాయి తెచ్చి తూచి చూసుకోండి. తక్కువుంటే చెప్పుచ్చుకు కొట్టండి."

"చిక్కుడు కాయ కిలో ఎట్లా?"

"రూపాయి."

"మా యింట్లో వుంది తీసుకొంటావూ?"

"అర్థ రూపాయి చొప్పున వేయండి. తీసుకుంటాను. వీధి వీధి తిరిగి అమ్ముకోవాలి. కూలి గిట్టుబాటు కాకపోతే ఎందుకు?"

"అమ్మమ్మ! నువ్వమ్మితే రూపాయి. మేమిస్తే అర్థరూపాయి. అందుకే కలికాలం యిలా మండిపోతూంది. అవునులే. అలా అమ్మకపోతే నీ కా దండకడియాలు, మెడలో గట్టిల పట్టెడా ఎక్కడి నుండి వస్తాయి?" కొరుక్కుతింటున్నట్టు చూస్తాడు.

కయ్యిమని లేస్తుందది.

భామ సర్ది పంపేస్తుంది.

పనిమనిషిని యింటికి రానివ్వడు. "ఓసేవ్!"

"నా పేరు రాములమ్మని ఎన్నిసార్లు చెప్పాలయ్యా?" మర్యాదగానే అంటుంది.

"తెలుసులే! ఏం లేకున్నా టెక్కుమాత్రం తక్కువ లేదు. పేరు పెట్టి రామ్ములమ్మగారని పిలువాలేమో."

"గారు పీరని ఎవరు పిలువమన్నారు, సామీ? ఒసేవ్- గిసేవ్ అని పిలువడానికి నే నేమైనా ఉంచుకొన్న దాన్నా? పెళ్ళి చేసుకొన్న

దాన్ని? మర్యాదలేని మనుషులున్నట్టుంది ఎక్కడో సహనం నశిస్తుంది దానికి.

దులిపేసుకొని పని పురమాయిస్తాడు దానికి. "పళ్ళపొడి, చెంబుతో నీళ్ళు మెట్టు మీద తెచ్చిపెట్టు. ఇదిగో, చూడు. వేప రెమ్మ ఓ నాలుగు నుగ్గులు కొట్టిపడేస్తేవంతే. కాల్చి బొగ్గు చేయిచ్చు ఈ పళ్ళపొడితో పళ్ళుతోమితే తోమినట్టు ఉండదు."

మూతి తిప్పు తుందది.

"స్నానానికి నీళ్ళతోటి బకెట్, చెంబు మెట్టు దగ్గరే తెచ్చిపెట్టు. స్నానాల గదిలో చేయాలంటే నాకేమిటో చిరచిరగా ఉంటుంది."

"నాకు పొద్దు పోతుందయ్యా, మీ ఒక్క ఇంటి కాడ పనిచేసు కొంటూ కూర్చొంటే నాకు కడుపు నిండుతుందేం?" తిరస్కారంగా వెళ్ళి పోతుందది.

కోడలిమీద ఎగురుతా డాయన. "ఇలాంటి నిలుగుకు ముందల్ని పనికి కుదుర్చుకొంటే అంతా బాగే, నిలువెల్లా కులకడంతోనే సరి పోతుంది దానికి. పనిచేతకాదు. పాటచేతకాదు."

షష్టిపూర్తికూడా అయిన ఆయనకు ఇదేం తీపో తెలియడం లేదు భామకు. బకెట్లో నీళ్ళు తోడుకొని స్నానం చేయకూడదూ! మనిషి దిట్టంగానే ఉన్నాడు. దానికీ ఓ పనిమనిషి కావాలేమో! పని మనుషు లతో అవన్నీ చేయించు కోవాలంటే ఊరికే చేస్తారా? మామూలు పనికే పదిహేనుకు తక్కువ కావడంలేదు, పరుపు లేయమని పక్కలెత్తమని నీళ్ళు తోడమని ఇలాంటి పనులన్నీ చెబుతూ కూర్చొంటే బాగే!

పనీపాట లేదేమో, విపరీతమైన పుస్తకాల పిచ్చి ముసలాయ నకు! అద్దెకు డిటెక్టివ్ పుస్తకాలు తెచ్చుకొంటాడు. భామ పెద్ద తర హాగా అవేవీ పట్టించుకోకుండా పోయినా ఓ రోజు బాగా కోపం వచ్చే సంఘటనే జరిగింది.

వంట ముగించేసి మామగారిని భోజనానికి లేపడానికి ఇవతలికి వచ్చింది భామ. గేటు బార్లా తెరిచేసి ఉంది. ఎదురుగా తనెంతో అప్ష రూపంగా పెంచుకొన్న పూలమొక్కలు మేకలు మేసిపోయి మొండిగా నిలిచాయి.

"గేటు ఎవరు తెరిచారు?"

"పుస్తకం కోసం వెళ్ళి నేనే తీసివచ్చాను. మూయడం మరిచి పోయాను."

"ఇక్కడే కూచున్నారు కదా? మేకలు మేసిపోతుంటే చూడ లేవా ఎదురుగా!"

"నేను పుస్తకం చదువుతున్నాను. నాకు ఆ ధ్యాసే లేదు."

"ఈ ముసిలాడికింత ఏకాగ్రత ఏమిటో ఈ పుస్తకాలమీద?"

అంత ఏకాగ్రతలో ఇంటికి ఎవరైనా ఆడవాళ్ళువస్తే నఖశిఖ పర్యంతం పరీక్షించ కుండా ఉండడు. వాళ్ళు పోతుంటే వెనుకే వెర్రి మొర్రి కూతలు!

పోతే, బోలెడంత చిరు తిళ్ళయావ!

పొద్దునపూట ఏదో ఒక టిఫిను చేస్తూనే ఉంటుంది భర్తకోసం. ముసలి ప్రాణానికి అవేవీ రుచించవు. వేడివేడి వేరుసెనగపప్పో, వేయించిన అటుకులో- ఏదో ఒకటి పక్కన ఉంచుకొని నోరు ఆడి స్తూనే ఉంటాడు అస్తమానం.

"మీ కోడలేదీ?"

"మీ ఇంజనీరుగారి భార్య వచ్చి వెంట తీసుకుపోయింది."

"ఎక్కడికీ?"

"లైబ్రరీకేమో! కూసే గాడిదవచ్చి మేసే గాడిదను చెడ గొట్టిందట! నీ భార్య మంచిదే గాని పక్కింటావిడ సహవాసంతో చెడి పోతుందోయ్! సంసారం చేసుకొనే ఆడదానికి ఈ తిరుగుళ్ళేంబాగు?" మామగారి చివరి మాటలు వింటూనే చేతిలో పుస్తకంతో అడుగు పెట్టింది భామ.

వెలవెల బోయాడు రంగనాథరావు. ముఖం మీద నవ్వు పులుముకొని, అన్నాడు చెయిజాస్తూ: "ఏం పుస్తక మమ్మాయ్, అది?"

"విశ్వనాథవారి వేయిపడగలండీ!"

చప్పరించాడు. ఏమిటో. అర్థమే కావది. చలం వ్రాసిన పుస్తకాలు లేవా ఇక్కడ లైబ్రరీలో? మొన్నో పత్రికలో విమర్శ చదివాను. చాలా బాగుంటాయట ఆయన పుస్తకాలు."

నవ్వు దాచుకొంటూ అంది: "ఉన్నాయేమో చూడలేదు."

"ఈసారి వెడితే పట్టుకురా ఓ పుస్తకం, చదివి చూద్దాం."

"అలాగే నండి. కాని, ఇదివరలో చలానివి ఒకటి రెండు పుస్తకాలు చదివాను. ప్చ్! అవి మనబోంట్ల సంసారులు చదివే పుస్తకాలు కావు, మామగారూ! పచ్చి శృంగారం."

"ఏదో కాలక్షేపానికి."

తండ్రిమాటలను ఎలా అర్థం చేసుకొన్నాడో గాని భార్య ప్రవర్తనకు మండిపడ్డాడు జగన్మోహన్.

"ఇది చదివి చూడండి. చాలా బాగుంటుంది. ఇది వరకు ఒకసారి చదివాను. అప్పు డంతా బాగా అర్థం కాలేదు. మళ్ళీ చదువుదామని తెచ్చుకొన్నాను," పుస్తకం మామగారి చేతికందించి లోపలకి నడిచింది భామ.

అనుసరించాడు జగన్మోహన్. "చదువుకొన్నా వెందుకు? పెద్ద మనుషులతో ఎలా మాట్లాడాలో తెలియకపోతే?"

"ఎలా మాట్లాడాను?"

నిగ్రహంలోనే వెటకారం స్ఫురింపజేస్తూ ఆవిడ నవ్విన నవ్వు చూసి చర్రుమంది అతడికి. "చలం పుస్తకాల్లో పచ్చి శృంగారమే ఉండవచ్చు. ఆ సంగతి మామగారితోటేనా చర్చించవలసింది?"

"నేనేమైనా సంసారం చేసుకొనే తీరులో ఉన్నానా? ఎవరితో ఎలా మాట్లాడవలసిందీ నాకేం తెలుసు?"

"ఆ మాట అబద్ధం కాదు, షాపింగులూ, షికార్లూ, సినిమాలూ అయ్యాయి, మగడన్నవాడికి మాటైనా చెప్పకుండా" ఉద్రేకంతో అరిచాడు జగన్మోహన్. "పుస్తకాల కోసం లైబ్రరీకి వెళ్ళ వలసి నంత అవసర మేమొచ్చింది? ఇన్ని పత్రికలు తెప్పించుకొంటున్నావు. పుస్తకాలు తెప్పించుకొంటున్నావు. నీకు ఇంకా లైబ్రరీ పుస్తకాలు తక్కువయాయా? ఆ శ్యామ సుందరొకతె జతపడింది నీకు!"

అసహనంగా అడిగింది భామ: "లైబ్రరీకి వెళ్ళి పుస్తకాలు తెచ్చుకోడంలో మీ కంత ఘోరమైన తప్పేం కనబడింది?"

''కాకపోతే ఎంతమంది ఆడవాళ్ళు వస్తున్నా రేమిటి లైబ్రరీకి? ఎవతో ఆ శ్యామసుందరిలాంటి అన్నీ విడిచిన ఆడది తప్ప.''

''అవును. చదువుకోవాలన్న జిజ్ఞాస ఎంత వున్నా యిలా లైబ్రరీలకు వెళ్ళి పుస్తకాలు తెచ్చేసుకోగల సాహసం చాలామంది ఆడవాళ్ళలో లేదు. ఆ పిరికితనం మీ కంత గొప్ప లక్షణంగా కనబడుతూందంటే, నవ్వు వస్తూంది నాకు. అయినా, ఒకటి రెండుసార్లు మిమ్మల్ని అడిగాను కూడా లైబ్రరీ నుండి పుస్తకాలు తెచ్చిపెట్టమని. మీ కంత ఓపిక లేదు. నేనే తెచ్చుకున్నాను.''

''ఓ! సాంఘిక విప్లవకారిణిగా తయారు కావాలని కలలు కంటున్నట్టుందే?''

ఫక్కున నవ్వింది భామ. ''అతి మామూలు విషయం. ఇందులో మీకు విప్లవం కనిపిస్తున్నదేమిటి?''

దెబ్బతిన్న అహంతో హుంకరించాడు, ''నోర్ముయ్, మాటకు మాట ఎదురు చెప్పావంటే తంతాను. మనిషిని కంటికి కనిపించడం లేదూ? నువ్వెంత చదువుకొన్నదానివైనా యిలాంటి తిరుగుళ్ళు మా యింటా వంటా లేవు. మర్యాద తప్పి ప్రవర్తించావంటే చీల్చిపెడతాను. జాగ్రత్త!''

నిర్లక్ష్యంగా ఒక చూపు మగడి ముఖంలోకి విసిరి మౌనంగా బాత్‌రూం కేసి వెళ్ళిపోయింది భామ. మగడి కోపానికి జడిసికాదు. ఆ పిచ్చి కోపంలో అందమైన అతడి ముఖం వికృతంగా కనిపిస్తూంటే చూడడానికి అసహ్యమనిపించి.

ఏడు గంటలకల్లా భోజనానికి లేస్తారు మామగారు. మామూలు కంటే ముందుగానే బియ్యం కడిగి ఇసిక గాలిస్తూ కూచుంది భామ. 'సాంఘిక విప్లవకారిణిగా తయారు కావాలని కలలు కంటున్నట్టుందే!' భర్తహేళన చెవిలో ప్రతి ధ్వనిస్తూంటే, అంతరంగంలో తీవ్రసంచలనం చెలరేగుతూంది. మహిళా సమాజంలో విప్లవం తీసుకురాగల సాహసిక చైతన్యం తనలో ఉంటే, ఈ సమయంలో ఇలాంటి వంటగదిలో కూచుని మామూలు గృహిణిలా బియ్యం గాలిస్తూ కూచునేదా! సామాన్యమైన గృహిణీత్వమే జీవిత పరమార్థంగా భావించేదా? అసలు,

అలాంటి ఊహలేవీ తనకులేవు. కాని, ఇప్పుడు భర్తప్రవర్తన, మాటలు అందుకు బీజాలు నాటుతున్నాయి.

దానికి చాలినంత గాలి, నీరు తగిలి పల్లవించి, ప్రవర్ధమాన మయిందంటే సంసార విచ్ఛిత్తి తప్పదు!

"భగవాన్! అలా కానీకు." కలవర పడింది భామ.

"అమ్మా, సత్యవతీ!" గుమ్మం దగ్గరికి వచ్చి నిలబడ్డాడు రంగ నాథరావు. "ఈ పూటయినా అన్నం బాగా చెయ్యి. పొద్దుటి సంకటి ముద్ద ఇంకా అరగనే లేదు. బియ్యం నానకడిగి నీళ్లు ఎసరుపెట్టి వార్స్తే కొత్త బియ్యం అన్నం కూడా పొడిపొడిగా అవుతుంది."

"అలాగేనండీ!" కొత్త బియ్యం. మిల్లు బియ్యం. బోరెడంత ఇసిక. ఎలా చేసినాగంజిపట్టి పోతూంది.

"నాలుగు అప్పడాలూ, ఉప్పు మిరపకాయలూ వేయించు, పొద్దుటి వంకాయ పప్పు. ఏం బాగాలేదు."

"అలాగే."

"ఏదో. చదువులో ఉన్నా విన్నాళ్ళు. వంట సరిగా చేతకాదు పాపం. పెళ్ళయ్యా కయినా, ఎవరైనా పెద్దవాళ్ళు వెంట ఉంటే బాగుం డేది," సానుభూతి వ్యక్తం చేశాడు.

వింతగా ఉంది భామకు. జీవితంలో నటన ఎలా చేతనవుతుం దాని! లోపల ఇంత కథ జరిగినా ఏమీ విననట్టు ఎంత గుంభనం? ఎవడి కొంప కూల్చడానికి ఇంత విషం ఊరించు కొంటున్నట్లు?

అన్నం అయ్యేలోపల మరొకసారి వచ్చాడు రంగనాథరావు. "అన్నం కొంచెం పలుకు ఉండగానే వార్చు వెయ్యి. వార్చాక నిప్పు సెగను ఉంచావంటే చక్కగా ఉమ్మగిల్లుతుంది."

ఒకరి ఆజ్ఞ క్రింద పనిచేయడమంటే అతి తేలిక పనికూడా పెద్ద బరువుగా తోస్తూ ఉంటుంది. చేసిపెట్టిందేదో తినికూచోక, వెంటపడి పోరుతూంటే విసుగ నిపిస్తూంది భామకు. 'ఈ గిన్నెలవి ఇలాగే వది లేసివెళ్ళి దుప్పటి బిగించి పడుకొంటే తన్నేం చేయగలరు వీళ్ళు?' కాని అలాంటి మొండి తనంలో తృప్తి కనిపించడంలేదు. వంట ముగిం చేసి తండ్రీ కొడుకుల్ని ఒకేసారి భోజనానికి లేపింది భామ.

"ఇదేమిటి? బియ్యం కూడు తోడావు? పొద్దుటేమో సంకటి ముద్ద చేశావు. ఇప్పుడేమో బియ్యం కూడు దించావు. ఇది తినాలనా? చావాలనా!" కంచంలో నీళ్ళుపోసి లేచాడు జగన్మోహన్.

"అన్నం పలుకుమీద తీశాను. అదేమిటో, గంజి వార్చినిప్పుల మీద వేసేప్పటికి మరీ బిరిసెక్కిపోయింది." మామగారిలాగే ఈ మాయ దారి బియ్యం జతపడ్డాయి, తనకు చీవాట్లు తెప్పించడానికి.

అదేమి వింతో గాని ఒకమాట కూడా అనకుండా తినేసి వెళ్ళి పోయాడు రంగనాథరావు.

కంచాలు తీసేసి తాను తినకుండానే వంట పాత్రలు మూసి పెడుతూంటే, అప్రయత్నంగా కళ్ళలో నీళ్ళు తిరిగాయి భామకు. 'వైవాహిక జీవితపు తొలి రోజులు. నవదంపతులు సరాగాలాడు కొంటూ ప్రతిక్షణం మధురిమలు నింపు కోవలసింది! ప్రతి క్షణం విష మంగా తయారవుతూంది కలతలతో, కలహాలతో."

రెండు చేతులు కలిస్తేనే చప్పుడు. సాధ్యమైనంత వరకు తన చెయ్యి కలపకుండా ఉండాలనే వాంఛిస్తూంది భామ. తన సహనాన్నే పరీక్షకు పెట్టే పరిస్థితులు వస్తే?

# 7

## "ఏం చేస్తున్నారు?"

"రండి!"

మంచం మీదినుండి లేస్తూ సాదరంగా శ్యామసుందరిని ఆహ్వా నించింది, భామ. "పాప రాలేదూ?"

"వాళ్ళనాన్న ఎవరో ఫ్రెండింటికి వెడుతూ వెంట తీసికెళ్ళారు. పని అయిపోయినట్టుంది. అలా పార్కుకేసి వెడదామా?" ప్రతి సాయంత్రం ఒక గంట బయట గడపటం అలవాటు శ్యామసుందరికి.

"ఉహుఁ. రాలేనండీ. ఒంట్లో అంత కులాసాగా లేదు. ఈ సాయంత్రం మా పెరటి తోటలో గడిపేద్దాం." పెరట్లోకి దారి తీసింది భామ, చిరిచాప చేత పుచ్చుకొని.

"వేవిళ్ళు మహా జోరుగా ఉన్నట్టున్నాయే? అన్నం సయిస్తూంటా లేదా? బొత్తిగా నీరసించి పోయారీ మధ్య." చిరుహాసం చేస్తూ అంది శ్యామసుందరి.

మందహాసం చేసింది భామ.

"జీవితంలో చాలా చక్కటి రోజులివి. తొలిసారిగా తల్లి కాబో తున్న రోజులు. మగవాడి ఆత్మీయతాను రాగాలను కొల్లగా దోచుకో గల దినాలు కదూ? తండ్రిని చేయబోతూ నీరసించిన ఇల్లాలి మొగం చూస్తే ఏ మగవాడి గుండె కరుగదు, కృతజ్ఞతతో?"

ముఖం తిప్పుకొంది భామ.

"పెంపుడు చిలుకకు అందించినట్టుగా పళ్ళో, మిఠాయో అంది వ్వడూ మీ ఆయన?"

శ్యామసుందరి కొంటె తనానికి లజ్జకు బదులుగా, దుఃఖం పొంగి వచ్చింది భామకు. "ఇంత తొందరగా బిడ్డ తండ్రిగా మారడం ఆయన కిష్టంలేదు. ఫామిలీ ప్లానింగ్ అమలు పెడదామను కొంటూంటే హఠాత్తుగా ముంచుకు వచ్చింది నాకు కడుపు. ఇహ మీరు చెప్పిన మాధుర్యం నా జీవితాని కెక్కడ? అవన్నీ మీ పాప పుట్టినప్పటి అను భవాలేమో!" పేలవంగా నవ్వింది భామ.

"అలాగా!" సానుభూతిగా మారిపోయింది శ్యామసుందరి వదనం. "పక్కింట్లో మీ దంపతులను అలా ఊహించుకొని నేను చాలా అసూయ పడుతూంటే! - మళ్ళీ అలాంటి అనుభవం నా జీవితా నికి రాదు కదాని."

"బలే వారేనే!" ఫక్కున నవ్వింది భామ. "ఒక భ్రమతో నన్ను వివాహ మాడారు ఆయన. నాకు కొన్ని ఆశయ ఆదర్శాలు ఉన్నాయని పెళ్ళికి ముందే తెలుసు ఆయనకు. అయితే, పెళ్ళయ్యాక, సంసార సాగరంలో మునకలు వేస్తుంటే అవన్నీ కరిగిపోయి మామూలు మనిషిని కాగలనని ఆశపడ్డారు. కాని, ఎంత సంసార

లంపటంలో అంటుకు పోయినా ఆత్మాభిమానాన్నీ, వ్యక్తిత్వాన్నీ కోల్పోయే ఆడది ఎక్కడుంటుంది? నా కనీసపు కోర్కెలు కూడా వారి దృష్టిలో హీనమైనవిగా అగుపడుతుంటే, ఏం చేసేది?'' బాధపడుతూ చెప్పింది భామ, మొన్న లైబ్రరీకి వెళ్ళిన నాటి సంఘటన.

''సరదాగా సాయంకాల మప్పుడు పార్కుకువెళ్ళి కూచోవాలనో, కూరగాయలు తెచ్చుకోవాలనో, స్నేహితులతో షాపింగ్ చేయాలనో, లైబ్రరీనుండి నాకు కావలసిన పుస్తకం తెచ్చుకోవాలనో, చల్లగా ఒంటిగా పూలమొక్కల మధ్యకూచుని వారితో కబుర్లాడాలనో ఇవి నా కనీసపు కోర్కెలు. మగవాడు సహృదయుడైతే వీటిలో తప్పు ఎంత మాత్రం లేదు. కానప్పుడే పేచీ.''

''నిజమే. ఇవి మా ఇంట్లో అతి మామూలు విషయాలు. ఇలాంటి వాటికి మా ఆయన ఎన్నడూ అనిష్టంగా కనిపించలేదు.''

తేటగా నవ్వుతూ, అంది భామ: ''అదృష్టవంతులు కాదూ?''

''ఇది అదృష్టమనికూడా అనుకోలేదు, మామూలు సంగతిగానే కనిపిస్తూంటే. మీ సంగతి వింటూంటే ఇప్పు డనుకొంటున్నాను అదృష్టవంతు రాలినని,'' అంది శ్యామసుందరి. ''ఆడదాన్ని అణచి ఉంచ డమే తమ పురుషాధిక్యాన్ని చాటుకోవడంగా భావించే పురుష పుంగ వులతోసంసార మెంత నరకం? చదువుకొంటారు, సంస్కారవంతు లుగా నటిస్తూంటారు, అంతరంగంలో మాత్రం ఆడదాన్ని తనస్థాయిలో మన్నించే సహృదయతకు స్థానమివ్వరు.''

''అసలే అంతంతమనిషి. అందులో మా మామగారి మంత్రాం గంతో మరీ అధ్వాన్న మైపోయా రీమధ్య. అత్తగారు కయ్యాలమారి అయితే గయ్యాళిగంప అంటాంగాని, ఇలాంటి కుచేష్టల మామగార్ల కు ఏంపేరు పెట్టి పిలువాలో బోధపడడం లేదు. బలే ప్రమాదమండీ ఇలాంటి మామగార్లతో.''

''ఏదైనా నాటకమాడి ఉద్వాసన చెబుదామంటారా మీ మామ గారికి?''

''కథల్లో, సినిమాల్లో నాటకాలు ఫలిస్తాయి గాని జీవితంలో

అలాంటివి కొనసాగవు లెండి. అనుకొన్నది ఒకటి అయితే, మరే వికట పరిస్థితి అయినా దాపురించవచ్చు."

"మరి, మీ దంపతుల మధ్య ఈ వైమనస్యం నుంచి విముక్తి ఎప్పుడంటారు?"

"అదే నా ఆలోచన. సాంప్రదాయకమైన కుటుంబంలో పుట్టాను. సహృదయులైన తలిదండ్రుల చేతుల్లో స్వేచ్ఛగా పెరిగాను. మధుర స్వప్నం కావలసిన వైవాహిక జీవితమే నాకు చెరగా మారిపోయింది. నా సంసారం గురించి తీయని కలలు కన్నానే గాని ఇలాంటి పెడసరపు మగడు జతపడితే ఏం చేయగలిగేదీ ఎన్నడూ ఆలోచించలేదు."

"మీ కిష్టమైనా కాకపోయినా ఒక మాట చెప్పనా?"

"చెప్పండి."

"అన్ని అవసరాలకూ పురుషుడి మీద ఆధారపడే అబలాత్వం వల్లే ఆడది పురుషుడికి బానిసగా మారుతూంది. ఆ కాలంలో, ఈ కాలంలోనూ. ఈ సంగతి గుర్తుపెట్టుకొన్నారంటే-పరిష్కారం మీకే తోస్తుంది."

"నేను ఉద్యోగంచేసి సంపాదిస్తూ ఒక స్వతంత్ర ప్రతిపత్తి కలిగి ఉండాలంటారు. కాని, అలా నే నెప్పుడూ కోరలేదు. పోతే, అసలు మా వారు ఒప్పుకోరు."

"మీవారి దబాయింపులోనే మీకు ఆనందముంటే ఈ జీవితమే బాగుంది."

"వారికి ఎదురు నిలిచి సవాలు చేయడంకంటే సరసన ఉండి చేతులు కలుపుతూనే నా సంసారాన్ని సౌఖ్యవంతంగా తీర్చి దిద్దుకోగల నేమోనని ఆశపడుతున్నాను."

"అంతటి చతురత మీకుంటే సరే! కాకపోతే నే చెప్పిందే పరిష్కారమార్గం."

* * *

ఉదయం ఎనిమిది గంటలకల్లా స్నానం, టిఫిన్ ముగించి ఎక్కడికో బయల్దేర బోతున్నాడు జగన్మోహన్‌రావు.

"కొంచెం విశ్వనాథశాస్త్రి దగ్గరికి వెళ్ళాలిరా. ఇవ్వాళ తాతయ్య తద్దినం. మొన్న కలిసినప్పుడు చెప్పాననుకో. మరొకసారి జ్ఞాపకం

బుంపాలి. అలాగ తమలపాకులు, యజ్ఞోపవీతం అవి తీసుకురావాలి. నల్ల నువ్వులు ఉన్నాయేమో కోడలిని అడుగుతా నుండు."

"ఇప్పుడు చెబుతున్నావేం, నాన్నా? నేను పనిమీద వెళ్ళిపో తున్నాను. ముందుగా చెబితే నిన్నే ప్యూన్‌కిచ్చి తెప్పించే వాడినికదా?" విసుక్కొన్నాడు తండ్రిమీద.

లోపల ఉండి వింటున్న భామకు గుండె గుభేలుమంది. ఇంత పొద్దెక్కి తీరికగా ఇప్పుడు చెబుతున్నాడేమిటి, ఈయన? తండ్రి తద్దినమేమోగాని, కోడలి తద్దినం కావడానికా? పనిమనిషి కూడా వెళ్ళిపోయింది, గదులు కడిగించడానికీ, అవీ ఇవీ కడిగించు కోడానికి. భోజనానికి ఎంతమంది ఉంటారో? వంటపాత్రలకు ఎవరి దగ్గరికి వెళ్ళాలి?

"సత్యవతీ!" అంటూ వచ్చాడు మామగారు." ఇవాళ జగనుడి తాతగారి తద్దినం. కాస్త ఇల్లుకడిగి వడా, పరమాన్నం చేస్తే చాలు. విశ్వనాథశాస్త్రీ, కాళ్ళు కడిగించు కోడానికి ఆయన కొడుకూ వస్తున్నారు. ఎక్కువమంది లేరు.

"పనిమనిషి కూడా వెళ్ళిపోయింది. వంటకు పాత్రలు అంతంత గానే ఉన్నాయి. ఎవరింట్లోనైనా తెప్పించడానికైనా చేతిక్రింద మనిషి లేదు."

"వెళ్ళి ప్యూన్‌ను పంపిస్తాను. బజారునుండి తేవలసిన సామాను వ్రాసిపెట్టు. అలాగే ఏదైనా పని ఉంటే చెప్పు వాడికి," అని వెళ్ళి పోయాడు జగన్మోహన్.

'వేవిళ్ళతో నీరసించిన మనిషికి తద్దినం వంట, వడ్డన ఎలా చేతనవు తుందన్న సానుభూతి కూడా పిసరంత ప్రకటించలేక పోయారు ఈయన. అలాంటి సానుభూతే ఆయననుండి పొందగలిగితే అదే కొండంత బలాన్నిచ్చేది తనకు. గృహిణి నిజస్థితి బానిసత్వమే నేమో!' కినుకగా అనుకొంది భామ.

వంట, తద్దినం ముగిసేప్పటికి సాయంత్రం నాలుగయింది. అప్పటికి భామ తద్దినం కూడా అయింది. అలసిపోయిన ప్రాణానికి అన్నం కూడా సయించలేదు. వడలు వేయిస్తున్నప్పుడు కొట్టిన నూనె ఘాటుతో తల తిప్పుతూంటే చెంబెడు నీళ్ళు గటగటా పట్టించి పడక

వేసింది. ముఖంలో నరాలు తటతటా కొట్టుకొంటున్నాయి. ఎవరైనా, వేడి వేడిగా కాఫీ పెట్టిస్తేబాగుండేదనిపిస్తూంది. కాని, ఎవరున్నారుదిక్కు.

అవతల శాస్త్రి వాళ్ళతో కబుర్లాడు తున్నారు తండ్రీ కొడుకులు, సుష్టుగా భోజనం పట్టించి. ఆయన లోపలికి వచ్చి పలకరిస్తాడన్న ఆశ కూడా లేదు. లోపల ఇల్లాలు తిన్నదో, చచ్చిందో కూడా ఆలోచన అక్కరలేదు. కళ్ళనిండా నీళ్ళు తిరిగాయి భామకు.

''మేం శాస్త్రి ఇంటిదాకా వెడుతున్నాం, తలుపు గడియవేసుకో.'' గది అవతల నుండే వెళ్ళిపోయాడు జగన్మోహన్.

ధారగా కారిపోతున్న కన్నీళ్ళను తుడుచుకోవాలనికూడా బుద్ధి పుట్టలేదు భామకు. చాలాసేపు నిర్జీవంగా ఉండిపోయింది. చీకటిపడు తుంటే లేచి లైటువేసి తలుపు గడియ పెడదామని వెళ్ళింది.

''భామా!''

అవతలనుండి చినబావ రాఘవేంద్ర కంఠం వినిపించి తలుపులు తెరిచింది. పాప, పాప నాయనమ్మ కూడా వచ్చారు. ''బాగున్నావా, కోడలా?''

''ఆఁ ఎన్నాళ్ళయింది మీ రిక్కడికి వచ్చి?'' అంటూ లోపలికి దారి తీసింది భామ. చిరునవ్వు వేసింది, రాఘవేంద్ర తల్లికి.

''మొన్ననే. విమల చెల్లెలు వాళ్ళుఇక్కడే ఉన్నారని రాఘవుడు చెబితే చూద్దామని వచ్చాను. మీ వాళ్ళంతా కులాసాయేనా, అమ్మాయ్?''

''ఆఁ'' కుతూహలంగా పాపను దగ్గరికి తీసుకొంది భామ. ఎంత చూసినా ఆ పిల్లలో అక్కపోలిక ఒక్కటికూడా కనిపించలేదు. ఒక విధంగా చూస్తే తండ్రిలా కనిపిస్తుంది. ఓ సారి అలా కూడా కనిపించదు. కాని, ముద్దొస్తుంది పాప. ''నేనెవరో తెలుసా? చిన్నమ్మను.''

సిగ్గుగా నవ్వుతూ తలాడించింది పాప.

''పేరేమిటి?''

రాఘవేంద్ర చెప్పాడు: ''లక్ష్మీప్రభ.''

భామను పరిశీలనగా చూస్తూ, అడిగింది రాఘవేంద్ర తల్లి. ''కళ్ళు వాచాయి. ముఖం వాడిపోయింది. ఒంట్లో బాగుండలేదా?''

''ఈరోజు మా మామగారి తండ్రి తద్దినం. ఇప్పుడిప్పుడే

భోజనాలయ్యాయి. తండ్రీ కొడుకులు, మీరు వచ్చేముందే బయటికి వెళ్ళారు. వంటా వడ్డన చేసేప్పటికి అలసి పోయానత్తయ్యా!"

"వంటకు మనిషి రాలేదా? నువ్వేనా?"

"నేనే."

వచ్చినవాళ్ళకు వడా, పరమాన్నం యిచ్చి, టీ చేసుకు రావడానికి లోనికి వెళ్ళిన భామ కళ్ళు తిరిగి పడిపోయింది అక్కడే. రాఘవేంద్ర, అతని తల్లీ బాగా ఖంగారు పడిపోయారు. ముఖం మీద నీళ్ళు కొట్టి మంచం మీదికి చేర్చారు. కొద్ది సేపటికి తెప్పరిల్లింది భామ.

తల దగ్గరే విసనకర్రతో విసురుతూ కూచుంది రాఘవేంద్ర తల్లి. "చూడబోతే ఉత్తమనిషివి కానట్టున్నావు. ఎన్నో నెల?"

"నాలుగో నెల."

"నేనప్పుడే అనుకొన్నాను, నీరసించిన ముఖం చూసి. తిన్నావా, ఏమన్నా?"

"ఎక్కడ తింటి, అత్తయ్యా? వడ చేస్తున్నప్పుడు నూనె వాసనకొట్టి తల తిప్పుడు, తల నొప్పి పట్టుకొన్నాయి. తిండి మీదికి మనసు పోలేదు. కళ్ళు మూసుకు పడుకొని మీరొచ్చే ముందరే లేచాను."

స్టౌ మీద టీ కని భామ పెట్టిన నీళ్ళు మరిగిపోతున్నాయి. రాఘవేంద్ర డబ్బాలన్నీ వెదికి టీ పొడి, పంచదార వేసి టీ కాచి తనే కప్పులో పోసి తెచ్చిచ్చాడు భామకు.

నీరసంగా నవ్వింది భామ. "బాగుంది, బావా. మీకు నేనిచ్చేది పోయి...."

"బాగుంది, మరదలా! ఒంట్లో అలా వున్నప్పుడు మా కోసం టీ లని ఫలహారాలని ఉరుకు లాడబోయావా? ఇంట్లో నిన్నిలా వదిలేసి ఏ రాచకార్యాలమీద బయల్దేరాడు అతగాడు?"

"అందరూ మా అక్కయ్యంత అదృష్టవంతులు వుండరులే, బావా."

రాఘవేంద్ర తల్లి ముఖం తిప్పుకుంది. "ఆ అర్ధాయుష్యం దాని అదృష్టం జన్మజన్మాలకూ నీకు వద్దమ్మా....చేతిలో పెట్టి పోవడానికి రెండు పళ్ళయినా తెచ్చాను కాదు. ఉత్తమనిషివి కాదని తెలిస్తే అలా

వచ్చేదాన్నా? కాని........రాఘవుడూ, ఇక్కడికి బజారు దగ్గరే కదూ? రెండు బత్తాయి పళ్ళు, ఇన్ని పూలు పొట్లం కట్టించుకొనిరా."

మొహమాట పడింది భామ. "ఇప్పుడు బావను ఎక్కడికి పంపిస్తున్నా వత్తయ్యా? మరోసారి యివ్వకూడదు

'ఎప్పుడ దప్పుడే. రెండు పళ్ళయినా చతిలో పెట్టి పోకపోతే నా మనసు కుదురొద్దూ?"

పాపను తీసుకొని రాఘవేంద్ర వెళ్ళాడు.

"లేవరాదే, సత్యా? పొద్దుటి నుండి తిండి తిప్పలు లేవంటు న్నావు. పొట్టలో పాపాయి సంగతి గుర్తుందా లేదా?" అంటూ నవ్వింది రాఘవేంద్ర తల్లి. "వేవిళ్ళున్న వాళ్ళకు ఏవీ సయించవు. అందులో తన చెయ్యి తన నోరు అవుతే అసలే సయించదు. ఇలాంటప్పుడు పెద్దవాళ్ళు దగ్గరుండాలి, పిల్లా. ఇష్టమైనవి చేసిపెడుతూంటే కొంచెం నయం కాదూ? లే, అమ్మా. నే పెడతాలే."

"వద్దత్తయ్యా! కడుపులో నొప్పి వస్తూంది." కళ్ళు మూసుకు పడుకున్న భామ మరికొద్ది సేపట్లోనే మెలికలు తిరిగి పోసాగింది.

రాఘవేంద్ర తల్లి తత్తర పడిపోతూంది. "ఎప్పుడైనా వచ్చేదా, అమ్మా? ఇప్పుడేనా?"

"పని, తిరుగుడు ఎక్కువైతే వస్తుందత్తయ్యా."

"మందులు వాడడం లేదూ?"

"ఇప్పు డేం వాడడం లేదు."

"మగవాళ్ళు వస్తే బాగుండేది. రిక్షా కట్టించుకు డాక్టరు దగ్గరికి వెళ్ళకపోతే....ప్రమాదం కాదూ?"

ఇంతలో జగన్మోహన్ వచ్చాడు.

"కడుపులో నొప్పితో పిల్ల హైరానా పడిపోతూంది బాబూ. దబ్బున రిక్షా తీసుకొని వచ్చి డాక్టరు దగ్గిరికి తీసుకు పోకపోతే ఎలా?"

"నొప్పి ఎప్పటినుండి?" విసుగ్గా భార్యను సమీపించాడు జగన్మోహన్. తొలిసారి తాను డబ్బుపోసి తెచ్చిన మందులు ఆమె పెంట పాలు చేయడం గుర్తొచ్చి మనసున గుచ్చుతూంటే.

పొద్దుటినుండి తిండి లేదట. ఇంట్లో పెద్దమనుషులు లేరా? వట్టి

మనిషి కాదు. ఆ పిల్ల అతీగతీ విచారించకుండా యింట్లో వదిలి వెళ్ళి పోతే ఎలా, బాబూ?"

చిరాకుగా అన్నాడు: "ఆవిడ అన్నం తినలేదని నేను కల గన్నానా ఏమిటి? నా పని మీద నేను వెళ్ళిపోయాను. వెడుతూంటే ఒంట్లో బాగుండ లేదని చెప్పకూడదా తాను?"

భామ మగడు అంత సమరసమైన మనిషి కాదని తెలిసి పోయింది రాఘవేంద్ర తల్లికి. "ఏదో చిన్నపిల్ల. చెప్పుకోడానికి సిగ్గు పడిందేమో. అదంతా దేనికిగాని ఆ పిల్ల బాధ ఉపశమనానికి ప్రయత్నం చెయ్యి."

"చిన్నపిల్లేమిటండీ? సత్యభామా బి. ఏ. అవుతేనూ?"

భర్త నవ్వులోని అవహేళనకు భగ్గుమంది భామ మనసు. "మీరు డాక్టరు దగ్గరికి నన్నేం తీసికెళ్ళక్కర్లేదు. అత్తయ్య తెలియక ఏదో చెప్పింది. మీరు పట్టించుకో నవసరం లేదు," అంది మంద్ర స్వరాన.

"అంటే ఏమిటి, నీ ఉద్దేశం? భార్యకు మందులిప్పించని లోభి అనుకోవాలనా వాళ్ళు?" జీతం తెచ్చి నీ చేతికే ఇస్తున్నాను. ఒంట్లో ఆరోగ్యంగా లేకపోతే డాక్టరు దగ్గరికి వెళ్ళి మందులు తీసుకో వద్దన్నానా? ఎందుకు అనవసరంగా అపకీర్తి పెట్టడం నన్ను?" ఈ అపరిచితురాలైన అత్తయ్య ఎవరో తికమక పడుతున్నాడు జగన్మోహన్.

కలతలకు, కలహాలకు కారణాలు వెదికి అటు ఇటు తప్పొప్పులు నిర్ణయించబోతే సమస్య తప్పకుండా చుట్టుకొంటుంది మధ్య వర్తులను.

"జీతం తెచ్చి భార్యకే యిస్తున్నాను కదాని జగన్మోహన్ అంటే, భర్త నిరాదరణ చేస్తున్నాడన్నట్టుగా మాట్లాడింది భామ. ఎవరిని మందలించ డానికి వస్తుందిప్పుడు? నిజంగా కూడా- అతడేదో పని మీద బయటికి వెళ్ళిపోతుంటే భార్య సుస్తీగా పడుకొన్నదని అతడి కెలా తెలుస్తుంది ఆమె చెప్పకపోతే? మళ్ళీ డాక్టరు దగ్గరికి—అన డానికి సాహసం చాల్లేదు రాఘవేంద్ర తల్లికి.

ఆలూమగల అలుకలేమో—మధ్యపోయిన వాళ్ళకు అగౌరవం

కాదూ? అయితే ఆ పిల్ల బాధ చూడడానికి కూడా కష్టంగా వుంది. ఉత్త మనిషి కూడా కాదాయె. దబ్బున రాఘవేంద్ర వస్తే బాగుండేది. వాడొస్తే ఏమైనా తోచేది.

కాని, ఏమను కొన్నాడో ఏమో, జగన్మోహన్ డాక్టర్ని తీసుకు వస్తానంటూ వెళ్ళిపోయాడు, రాఘవేంద్ర వచ్చే లోపలే.

# 8

భామ కోరికవిరాదు, భామకు కులాసా చిక్కేవరకు పెద్ద దిక్కుగా ఉండిపోయిన రాఘవేంద్ర తల్లి వెళ్ళిపోయే ముందు జగన్మోహన్‌తో అంది: "సత్యను ఓ రెండు రోజులపాటు ఉంచుకొని పంపిస్తాను. ఏమిటో ఆ పిల్లను చూస్తే విమలను చూసినట్టు ఉంది నాకు."

"ఆమెనే అడగండి" అన్నాడతడు ముభావంగా, తన అనిష్టతను స్పష్టంగా ప్రకటించలేక.

"నువ్వు పంపిస్తానంటే వస్తుంది గాని, అదేం చెప్పగలదు?"

"అయినా ఇప్పుడెందుకు?"

ఇంత సూటిగా, నిక్కచ్చిగా అత డనగల డనుకుంటే పిల్లను పంపించమని అడగకనే పోవును రాఘవేంద్ర తల్లి. బంధుప్రీతి కల మనిషి. రాఘవేంద్ర ఒక్కడే కొడుకు. ఆడపిల్ల అంటే ఎక్కడలేని ఆప్యాయత. విమలను కూతురుగానే చూసుకొన్నది. విమల చెల్లెలు భామ. కడుపుతో ఉన్న మనిషి. ఆడపిల్ల ఇల్లు నిండుగా మసలితే చూడాలని ముచ్చట పడింది. మొగుడు అంత ముద్దు ముచ్చట తెలిసిన మనిషి కాదని తెలిసి పోతూంది.

రాఘవేంద్ర అక్కడే ఉన్నాడు. "మా అమ్మ ఆడపిల్లలు లేని కొరత యిలా తీర్చుకొంటూ ఉంటుందండీ. మరోలా అనుకోకపోతే,

రెండు రోజులు పంపించండి. మళ్ళీ ఆదివారం తీసుకువచ్చి దిగబెడతాను.''

మరీ కాదనడం అసభ్యంగా ఉంటుందనిపించింది జగన్మోహన్‌కి. ''సరే, రేపు నేనే తీసుకువచ్చి దిగబెడతాను. ఆదివారం కాకపోతే సోమవారం పంపిద్దురుగాని.''

అతడు మాటవరుసకేగాని, మనస్ఫూర్తిగా అనడంలేదని తెలిసినా మరి బలవంతపెట్టలేదు వాళ్ళు. వాళ్ళు వెళ్ళిపోయాక అన్నాడు జగన్మోహన్: ''వెళ్ళాలని ఉందా?''

''ఉండేవి చాలా ఉన్నాయి. ఉంటే అవన్నీ మీకు సమ్మతమా?''

''నిన్ను చూస్తే మీ అక్కని చూచినట్టుగా ఉంటుందట మీ అత్తకు. మీ బావకు కూడానా?''

కుత్సితుడిగా తనను భావిస్తుందేమోనన్న భయం ఉన్నా పురుష బుద్ధి అణుచుకోలేక పోయాడు.

''—ఉండేమో. అతన్నడగ వలసిన మాట. నన్నడిగితే?''

ఆ వ్యంగ్యానికీ, ఆ పెళుసు దనానికి మరినోరెత్తలేదు జగన్మోహన్.

కాని, నాలుగైదు రోజుల తరువాత భామను పంపించ వలసి వచ్చింది. అదేదో భూమి పంచాయతీలో పడిందని పల్లెనుండి ఉత్తరం వస్తే అప్పటి కప్పుడు ప్రయాణమై వెళ్ళిపోయాడు రంగనాథరావు. అప్పుడే జగన్మోహన్‌కు వారం రోజులు టూరు తగిలింది. అంత ఆరోగ్యంగా లేని భార్యను వంటరిగా వదిలి పోవడం భావ్యంగా తోచలేదు. టూర్‌నుండి వచ్చాక తీసుకు వస్తానంటూ రాఘవేంద్ర ఇంటి దగ్గర దిగవిడిచాడు భామను.

పిన్ని వేసిన రెండు జడలు తిప్పి తిప్పి చూచుకొంటూ సంబర పడిపోతూంది లక్ష్మీప్రభ. ''పిన్ని జడలు బావున్నాయి, నాన్నమ్మా. నువ్వెందు కిలా వెయ్యవూ?''

''నేను పాత కాలపు దాన్ని. ఈ కాలపు ఫాషనులు నాకు రావు కదే, చిట్టి తల్లీ? అందుకే మీ నాన్నకు ఎన్ని విధాలుగానో చెప్పాను,

పాపకు కొత్త పిన్నిని తెచ్చిపెట్టరా అని. వాడు వినడు. నీ ముచ్చట లన్నీ తీర్చడం నా వల్ల కాదు.''

బయటినుండి వస్తూన్న రాఘవేంద్ర తల్లి నొచ్చుకుంటూ అంటూన్న మాటలు విన్నాడు, ''కొత్త పిన్ని పాప ముచ్చటలన్నీ తీరుస్తుందన్న నమ్మక మేమిటమ్మా? ఆవిడ పాప కోరికలకే శాపంలా తయారైతే ఆ బాధ తొలగించడానికి ఎవరికి సాధ్యం?''

''ఈ ముసలి దాని పనులేవీ నీ కూతురికి నచ్చడం లేదురా. మరి నేనేం చేసేది? రెండు రోజు లుండిపోయే పిన్ని జడలు దానికి బావున్నాయట.''

''పాపం పసిది. కోపమెందు కత్తా? ఆ మాత్రానికి నొచ్చు కోవడం దేనికి?'' అంది భామ.

''కాదే, సత్యా! పాపకు చేయడం నాకు బరువు కాదనుకో. వయసు ఉడిగిపోతుంటే సంసారంలోని బాధ్యతలు ఎంత బరువుగా ఉంటాయని! కోడలువస్తే నాకొంచెం నయం కాదా? అది ఎలాంటి దైతేనేం? పురిటిగుడ్డు దగ్గరనుంచి ఈ చేతుల్లో మల్లె పువ్వుకన్నా అపురూపంగా పెంచిన పాపను దాని చేతిలో పెట్టను.''

నవ్వుతూ అమాయికంగా అడిగాడు రాఘవేంద్ర, ''మరెందు కమ్మా, నేను తిరిగి వివాహం చేసుకోవాలని పోరుపెట్టడం? అయిదేళ్ళ వైవాహిక సౌఖ్యాన్ని అనుభవించాను. బిడ్డల ఆటపాటలవల్ల కలిగే ఆనంద మేమిటో రుచి చూశాను. ఇంకా ఏం చూడాలని పెళ్ళిచేసుకో మంటావు?''

అలాంటి మొండి ప్రశ్నలకు జవాబు చెప్పగలంత చాతుర్యం లేదు రాఘవేంద్ర తల్లికి.

* * *

చిన్నగా, పొందికగా ఉన్న మూడు గదుల ఇల్లు రాఘవేంద్ర అద్దెకు ఉంటున్నది. ఇల్లు చిన్నదైన కొద్దీ కుటుంబంలోని వ్యక్తులను మరీ సన్నిహిత పరుస్తూంటుంది. ఒకటి రెండు రోజుల్లోనే పూర్తి చనువు ఏర్పడింది దక్కాడ భామకు. తనూ ఆ కుటుంబంలోని వ్యక్తిగానే అనుభూతి కలుగుతూంది భామకు. ప్రతి విషయంలోనూ వాళ్ళు తొలి

చూలన్న గౌరవం, అపురూపత చూపుతూంటే కొంచెం ఇబ్బందిగా, సిగ్గుగా కూడా ఉంది. నిజంగా పుట్టింట్లోకూడా అంత ఆప్యాయత లభించ లేదేమో. కోడలు కావాలన్న అత్త ఆరాటం, అందుకు రాఘవేంద్ర విముఖత, అతడి శూన్యజీవితం చూస్తుంటే- ఏదైనా మార్గం ఏర్పాటుచేసి పోవాలని తహతహ పుడుతూంది భామలో.

ఆ సాయంత్రం అత్త పాపను తీసుకుని పక్కింటికి వెళ్ళింది, కాలక్షేపానికి.

రాఘవేంద్ర ఇంకా బయటి నుండి రాలేదు.

రాఘవేంద్ర పుస్తకాల షెల్ఫ్‌లోంచి ఒక పుస్తకం ఏరి తీసుకొని పెరట్లో చాప వేసుకు కూచుంది. భామ. చాలా చిన్నగా ఉన్న ఆ పెరట్లో ఇంతకు ముందు అద్దెకు ఉండిపోయిన వాళ్ళు నాలుగైదు కాయపాదులు, నాలుగైదు పూల మొక్కలువేసి పోయారు. మధ్య కాళీ స్థలంలో చిరి చాప పరిచి, తలగడ తెచ్చివేసుకొని నడుంవాల్చి పుస్తకం విప్పింది భామ.

"భామా, అమ్మా పాపా ఏరీ?"

"పక్కింటికి వెళ్ళారిప్పుడే."

రాఘవేంద్ర ముఖం కడుక్కొని వచ్చాడు. అతడికి టీ యిచ్చి చాపమీద కూచుంది భామ. నామ మాత్రంగా పుస్తకం విప్పి చూస్తూంది, అతడు దగ్గరికివచ్చి కూచుంటే అతడిని పెళ్ళికి వప్పించ డానికి తంటాలు పడాలని ఆలోచిస్తూ.

అనుకొన్నట్టు గానే స్టూల్ తెచ్చి వేసుకు కూచున్నా డక్కడే రాఘవేంద్ర.

"ఏం పుస్తకం?"

చెప్పింది భామ. సంభాషణ ఎలా సాగించాలో తికమకగా ఉంది. "ఇలా మాట్లాడు తున్నానని అనుకోకపోతే ఒక్కమాట అడగాలని ఉంది నిన్ను, బావా!"

"ముందు అడుగు. అనుకోవడం సంగతి తరువాత కదా?" చిరునవ్వు నవ్వాడు.

"నీ జీవితం చూస్తుంటే అసంపూర్ణ మనిపిస్తూంది నాకు."

"అసంపూర్ణమా?" ఆశ్చర్యంగా అడిగాడు. "సంపూర్తి ఎప్పు డనిపిస్తుంది జీవితం? ఏ విధంగా? ఎందులో?"

"నువ్వేదో వేదాంత పరంగా అడుగుతున్నట్టున్నావు. నేనడుగు తున్నది లోక వ్యవహారికంగానే. మా అక్కయ్యను నువ్వెంత మనసారా ప్రేమించి ఉండనీ. కాని, ఆమె పోయాక- ఆ మృతురాలి స్మృతికి హృదయంలో శాశ్వత స్థానమిచ్చి మిగిలిన దీర్ఘ జీవితమంతా ఖాళీగా, మోడుగా గడిపి వేయడం- ఉహుఁ. అదంత ప్రాజ్ఞతగా కన బడలేదు నాకు, నీలోని ప్రేమ భావనంతా మా అక్కయ్యే దోచుకు పోయిందంటే అది ఆమెను ఎంత అదృష్టవతిని చేస్తుందో నీ జీవి తంలో అంత విషాదాన్నీ, అసంపూర్తినీ నింపుతూంది- అసంపూర్తిలో శాంతి ఎక్కడ? నీ జీవితంలో శాంతి అనుభవిస్తున్నావని కూడా నేను అనుకోవడంలేదు."

"ఈ జీవితం ప్రశాంతి మయమని నేను అనుకోవడంలేదు. అయితే, నాలో ప్రేమించే హృదయమే నశించిందంటే- అది అబద్ధం."

"మరి?" వింతగా చూసింది. "ప్రేమించ గల వాడివి పెళ్ళెందుకు చేసుకోవు?"

"అదేమిటి? ప్రేమిస్తే పెళ్ళి చేసుకోవాలా?" గమ్మత్తుగా కళ్ళు చిట్లించాడు రాఘవేంద్ర.

కొంచెం కోపం తెచ్చుకుని చనువుగా అంది భామ: "నీకేమిటో తమాషాగా ఉంది. అత్త సంకటం చూస్తుంటే నాకే ఎదోలా ఉంది. సమాజంలో ధీమాగా జీవించగల అవకాశం ఉండికూడా, దీనంగా లోకుల సానుభూతి పొందడమంటే ఎంత దుర్భరమైన సంగతో ఆలో చించు. 'ఆవిడకేం? కొడుకూ కోడలూ -మనుమలూ మనుమరాళ్ళూ' అనిపించుకోవడంలో ఉన్న తృప్తి భార్యను పోగొట్టుకొని నిర్భాగ్యు డైన కొడుక్కి తల్లిగా, తల్లిలేని పాపకు సంరక్షకురాలిగా, ఇల్లాలు లేని సంసారాన్ని ఈడ్చుకు వచ్చే ముసలి ఎద్దులా- ఉండడంలో ఎంత మాత్రం లేదు. ఏమంటావు? కనీసం ఆవిడ తృప్తికోసమైనా నువ్వు రెండవ పెళ్ళికి ఒప్పుకు తీరాలి."

"నువ్వు చెప్పడంలో అనుచితం, అసందర్భం ఏం లేదు. కాని,

ఈజీవితం అంత సంతృప్తికరంగా లేకపోయినా అమ్మ కోరిన మార్పును అంగీకరించలేను. ఎందుకో చెప్పలేను కూడా. ప్రేమించడం ఎంత సాధారణ విషయమో, అది పెళ్ళిదాకా పోవడం కొన్ని పరిస్థితుల దృష్ట్యా అంత అసాధారణ మౌతూంటుంది.

"పోతే, ప్రేమలోని మాధుర్యం పెళ్ళితో అంతమౌతుంది కూడా. ఇది తెలిసిన వాళ్ళెవరూ పెళ్ళి ఉచ్చులో తగులుకోలేరు."

ఫక్కున నవ్వింది భామ. "పాప తండ్రివి, అయిదేళ్ళ వైవాహిక జీవితం అనుభవించిన వాడివి. తొలి వయసు ప్రేరణలో చెప్పవలసిన ప్రేమపాఠం ఇప్పుడు చెబుతున్నావా?"

అతడూ మందహాసం చేశాడు. "ప్రేమా, పెళ్ళి సర్వ సాధారణ విషయాలే కావచ్చు. కాని, కొందరి జీవితంలో పెళ్ళి తరువాత ప్రేమసంభవం కాదని అనుకోకు. అందులోనూ నేను భార్యను పోగొట్టుకొన్నవాడిని."

ఆశ్చర్యంగా కన్నులు అర్చింది భామ. "ఆ అదృష్టవతిఎవరు?"

"నా ప్రేమను పొందడమంటే అంత అదృష్టమా?" అతడూ వింతగా కన్నులు అర్చాడు.

"నిజంగా అదృష్టమే." దృఢంగా అంది. "చెప్పు, ఎవరు?" తీవ్రమైన కుతూహలంతో అడిగింది.

"చెప్పను, చెప్పకూడదు."

"ఏం?"

"నా సహృదయత మీదే నీకు నమ్మకం పోతుంది."

"మేక వన్నెపులిలా జీవించడంలో అంత ఆనందముందా?"

భామ మందస్వరానికి కలవరపడుతూ, అన్నాడు: "భామా!"

"అర్థమదే కదా?" రెట్టించింది.

ఆవేదనగా నిట్టూర్చాడు. "నీలో విమల పోలికలు చాలా ఉన్నాయి, భామా!"

అర్థమైపోయిన అతడి ఆంతర్యం భామను ఉలికి పడేలాచేసింది. బలవంతం చేసి పొరపాటు చేశాననిపించింది. కాని, హృదయంలో

ఏదో మధుర స్పందన, ఏదో వింత అనుభూతి చెంపల్లోకి ఆవిర్లను ఊదుతూంది.

"నిన్ను చూసి ఆరేడు సంవత్సరాలై పోయింది, కాదూ? అనాటికి పిల్లవు. చిత్రకారుడు గీచిన అవుట్ లైన్ వి. ఈనాడు పూర్ణ రూపు సంతరించుకొన్న యువతివి. తొలుత మీ ఇంట్లో నిన్ను చూసి నప్పుడు నేను చాలాసేపు యథార్థానికి రాలేకపోయాను. ముమ్మూర్తులా విమలవే. కంఠస్వరం కూడా అదే. ఎవరిని మరచిపోలేక ఇన్నాళ్ళుగా యాతన పడుతున్నానో ఆమెను నీలో చూస్తున్నాను."

కావచ్చు. ఒక తల్లిబిడ్డలం. వయసులో కూడా రెండేళ్ళ వ్యత్యాసం, చిన్నక్కకూ, తనకూ. తాము నలుగురు అప్పచెల్లెళ్ళయితే అందరివీ ఇంచుమించుగా ఒకటే పోలికలు, మూసలో పోసి తీసిన బొమ్మల్లా. అయితే మాత్రం.... పెళ్ళయి సంసారం చేసుకొంటున్నది తను. పరపురుషుడి నుండి అలాంటి ఆరాధన తనకు స్వీకారయోగం కాదు. అది ఎంతటి అపురూప మైనదైనా అసలు అతడి హృదయంలో అలాంటి భావం నాటుకొనడమే అనుచితమైన సంగతి. అది పెంపొం దించుకోవడం, పైగా తనకు నివేదించుకోవడం....

'ఇదంతా నా తెలివితక్కువ తనం వల్ల జరిగింది. పదుగెవరు విన్నా ఈ సన్నివేశం ఎంత జుగుప్సాకరమైంది?' ఆమెలోని స్త్రీ రాఘవేంద్ర ప్రేమ నివేదనకు గర్వపడుతూంటే, ఏదో నైతిక మైన భీతితో బలవంతాన అణచివేసి, అక్కడినుండి లేచి పోవాలనుకుంది.

కాని, అంతటి మృదుహృదయుడి ముందు కరకుగా ప్రవర్తిం చడ సాధ్యం కాలేదు.

"తప్పుకదూ?" అని మాత్రం అంది చిన్నగా, మందలింపుగా.

అలజడి నిండిన భామ నేత్రాలలోకి దీర్ఘంగా చూస్తూ, జీర బోయిన కంఠంతో అన్నాడు: "అపార్థం చేసుకున్నావా?"

"నేను చేసుకోకపోయినా, చేసుకొనేవాళ్ళు చాలమంది ఉన్నారు మనచుట్టూ."

నిస్పృహగా నిట్టూరుస్తూ అన్నాడు: "నీ పెళ్ళికి ముందే నిన్ను చూసి ఉంటే నువ్వు జగన్మోహన్ భార్య అయ్యేదానివి కాదు."

సాహసంగా, చిలిపినవ్వు పెదవులమీదికి తెచ్చుకుని అంది: "నామీద నీంకత నమ్మకమేమిటి? నిన్ను నేను ఒప్పుకోకపోతే?"

"ఇంతకు ముందేకదూ, ఆ అదృష్టవతి ఎవరో చెప్పమని బల వంత పెట్టింది?" అల్లరిగా నవ్వాడు.

వదనం అవనతంచేసి, పెదవి కొరుక్కుంటూన్న భామ వ్యధగా నిట్టూర్చింది. అదృష్టవతికాదు. సాధారణమైన సాంసారిక సుఖాను భూతేకాని, ప్రేమకూ, ఆరాధనకూ అర్థం తెలియని మోటుమనిషి అయిన మగవాడికి భార్యకావడం ఎంతమాత్రం అదృష్టంకాదు. పెళ్ళికి ముందూ, ఇప్పుడూకూడా తాను ఏదైతే భర్తనుండి ఆసించిందో అది ఈ భార్యా విదూరుడిలో వ్యక్తమౌతూంది. అద్దంలో చందమామలా, కావలసినది ఎదుటవున్నా అందుకోలేని దౌర్భాగ్యం.



జగన్మోహన్ ఆఫీసు ప్యూన్ వచ్చాడు- "అయ్యగారు వచ్చారు. మిమ్మల్ని తీసుకురమ్మన్నా" రంటూ.

ఉదయం పదిగంట లవుతూం దప్పుడు. వంట కాలేదు. 'భోజన మైనా చెయ్యకుండా ఇప్పుడు వెళ్ళి వంటేం చేయగలదు, ఆ పిల్ల? అయినా రాఘవేంద్ర ఇంట్లో లేడు. ఇన్నాళ్లు ఉంచుకొని రెండు రెవికల గుడ్డలైనా కుంకుమ పెట్టి ఇవ్వకుండా ఎలా పంపించడం?' అనుకుంది రాఘవేంద్ర తల్లి.

సూటుకేసులో బట్టలు సర్దుకొంటూంది భామ.

"ఇద్దరూ కలిసి, సాయంత్రం వెడుదురుగానిలే, సత్యా! మీ ఆయన్నే ఇక్కడికి ఈ పూట రమ్మని చెప్పి పంపు ఆ జవానుతో. వాడికి సరిగా చెప్పను చేతనవుతుందో లేదో ఓ చీటీ వ్రాసి ఇవ్వు."

"ఆయన వసారో లేదో?"

"ఇదేం పరాయి ఇల్లా ఏమిటి? రమ్మని వ్రాయి. అయినా, ఆకలితో వెళ్ళి ఈ మధ్యాహ్నం వంటేం చేసుకోగలవు?"

వస్తే పేచీ లేదుగాని రాకపోతే పరిస్థితులు వికటంగా తయారై ఎదురు నిలుస్తాయేమో అనుకొంది గాని, అత్త చెప్పినట్లుగా చీటీ వ్రాసి జవాను కిచ్చింది భామ. ఇంట్లో బావలేడు. ఇన్నాళ్ళు ఇక్కడుండి అత డింట్లో లేని సమయంలో చెప్పకుండా వెడితే ఏం మర్యాద?

మధ్యాహ్నం రెండు గంటలదాకా జగన్మోహన్ కోసం ఎదురు చూస్తూ కూచున్నారు. భోజనానికి లేవకుండా. రాలేదతడు. కాలేజీ టైం అయిపోతుంటే రాఘవేంద్ర తినేసి వెళ్ళిపోయాడు.

చూసి చూసి ఆకలి చచ్చాక రెండు మెతుకులు ఎంగిలి పడింది భామ. భర్త రాలేదన్న బెంగకంటే ఫ్యాన్ వెంట తను వెళ్ళనందుకు అతడు ఏ విపరీతార్థాలు తీసి రభస చేస్తాడోనన్న భయమే మనసుకు స్థిమితం లేకుండా చేసింది.

రాఘవేంద్ర కాలేజీ నుండి వస్తూనే రిక్షా తెచ్చాడు.

రెండు రవికల గుడ్డలు, పూలు పళ్ళు లక్ష్మీప్రభచేత ఇప్పించారు భామకు.

హృదయం ఆర్ద్రమైంది భామకు. పరాయివారయినా పుట్టిల్లులా ఆప్యాయతతో ఆతిథ్య మిచ్చారు. సంసారంలో చికాకు తలెత్తినప్పుడు పుట్టిల్లు గుర్తుకు వచ్చినట్టే వీళ్ళ ఆప్యాయత గుర్తుకు రాకపోదు. కాని, ఈ అనుబంధం ఇంతటితో ఆగిపోవడమే మేలనిపిస్తూంది. అది—రాఘవేంద్ర ఆరాధన బలీయమైతే, ఏ కారణంచేతనైనా తనలో అతడిపై ఆకర్షణ బీజం పడితే కొంపలంటుకు పోగలవన్న భీతి. ఇప్పుడు అతడంటే జాలీ, సానుభూతీ తప్ప మరో భావనేదీ తనలో చోటు చేసుకోలేదు. కాని, ప్రేమ ప్రభవించడానికి యింతకంటే మంచి అదను, అవకాశం మరెక్కడున్నాయి?

ఇంటి ముందు రిక్షా దిగుతూన్న భామకు మూసిన తలుపులు తిరిగి ఆందోళనను రేకెత్తించాయి. భర్త దగర డూప్లికేటు వుంది. తను వచ్చేసరికి భర్త యింటిదగ్గరే ఉంటాడనుకుంది.

సూట్ కేస్ బీరువాలో వుంచేసి చీపురు చేతబట్టి యిల్లు శుభ్రం

చేసింది. పెరట్లో కాసిన వంకాయ పిందెలు కోసి రాత్రి వంటముగిం చేసింది గబగబా.

వళ్ళంతా అలసటగా, చీదరగా తయారైంది. కొళాయి దగ్గర బకెట్ నిండా నీళ్ళు పట్టుకొని చన్నీళ్ళే తలనిండా పోసుకొంటేనేగాని మనసు తేలికపడలేదు. జరీ బార్డర్ ముదురు నీలం చీర, రక్తవర్ణం జాకెట్టు తీసి ధరించింది. ముదురు రంగులు భామకు అంతగా యిష్టముండవు. లేతరంగులే ఎక్కువగా ఎన్నిక చేస్తుంది. కాని, జగన్మోహన్ ఆ చీరా, జాకెట్టూ ఎక్కువగా ఇష్టపడతాడు. మగడి అభిరుచుల కనుగుణంగా తన అభీష్టాలు మార్చుకొనే అలవాటు లేకపోయినా ఇప్పుడు అలకో, ఆగ్రహమో చెంది వున్న శ్రీవారిని సుముఖుల్ని చేసుకోడానికి మత్తు మందు ప్రయోగించక తప్పదని ఎక్కువగా భర్త కిష్టమైన విధంగానే అలంకరించుకుంది.

తడిగా ఉన్న కురులను జారుగా జడ అల్లుకొని ముంగిట పూసిన ముద్దబంతి కోసి తురుముకుంది. పూర్తిగా చీకటిపడింది. లైటువేసి, యింట్లో విపరీతమైన ఉక్కపోత భరించ రానిదై పోతుంటే వాకిట్లో బంతి మొక్కల మధ్య పట్టె మంచం వాల్చుకుని నడుం వాల్చింది.

వేసవి వెన్నెల హాయిగా వుంది. చెట్ల నిండుగా అరచేతి వెడల్పు ఆరోగ్యంగా విచ్చుకొన్న ముద్దబంతులు వెన్నెల్లో అందంగా ఊగుతున్నాయి.

భర్త నిరీక్షణలో ఏడు దాటింది. ఎనిమిది కూడా దాటింది.

'రాలేదు. ఇంకా ఆఫీసులోనే వుంటాడా? మధ్యాహ్నం హోటల్లో భోజనం చేశాడేమో? ప్యూన్‌ను పంపించినప్పుడు తాను రానందుకు సంజాయిషీ అడుగుతాడేమో!' కలతగా ఆలోచిస్తుంది భామ. భర్త ఆగమనానికై మనసు వేగిరపడుతున్నది కూడా.

ఇక్కడికి కాపురానికి వచ్చాక పారంరోజుల దీర్ఘకాలవియోగం కలగడం ఇదే తొలిసారి. పరస్పర అభిప్రాయాలు కలువకపోయినంత మాత్రాన భార్యాభర్తల సహజీవనంలో ఒక తీయని అనుబంధం ఏర్పడకపోదన్న నిజం తెలిసివస్తుంది భామకు, భర్త రాకకోసం తన మనసు పడుతున్న తపన చూస్తుంటే.

తొమ్మిది పది గంటలమధ్య గేటు తీసుకొని లోనికి వస్తున్న జగన్మోహన్ మంచం చెంత ఒక క్షణం ఆగీ ఆగనట్టుగా ఆగి ఇంట్లోకి వెళ్ళాడు.

లేచి అనుసరించింది భామ.

జోళ్ళు విప్పి దుస్తులు మార్చుకొంటూ, ముఖం చిట్లిస్తూ, నిరసనగా అన్నాడు అతడు. "అప్పుడే మీ బావగారి ఇంటి సరదా తీరిందా?"

"సరదా ఏమిటి?"

"అదే నేను వచ్చానని తెలిసి కూడా నువ్వు రాకపోవడం."

'చీటీ వ్రాసి పంపాను కదా?'

"ఘనకార్యం చేశావు. ఏదో వారం రోజులు టూరు తగలడం చేత అనారోగ్యపు మనిషివని మరో దిక్కులేక నిన్నక్కడ దిగవిడిచానే గాని, ఏమంత కావలసిన వాళ్ళు వాళ్ళు? మీ అక్కబతికి ఉంటే అది వేరేమాట. నేను ఊళ్ళోకి వచ్చానని తెలిశాక వెంటనే వచ్చేయాల్సింది పోయి భోజనానికి అక్కడికే వచ్చేయమని నాకు చీటీ వ్రాసి పంపితే, నీకు బుద్ధి లేకపోతే నాకు ఉండదనుకొన్నావా?"

"అంత గత్యంతరం లేక నన్ను అక్కడికి పంపుతున్నారని తెలిస్తే నేనసలు వెళ్ళేదాన్నికాదు. మీ మాటలు వాళ్ళకు తెలిస్తే మన స్ఫూర్తిగా తామిచ్చిన ఆతిథ్యం ఇంత వృథా అనిపిస్తే ఎంత నొచ్చుకొంటారో!"

"వాళ్ళు నొచ్చుకుంటారని నువ్వు నొచ్చుకొంటున్నావుగాని, నేను అభిమానంతోనో, మొహమాటంతోనో నేనక్కడికి రాకపోతే నా అవస్థ ఏమిటని ఏమైనా ఆలోచించావా?"

'అభిమానమో, మొహమాటమో కాదు. కుచేష్ట అది,' ఉక్రోషంగా అనుకొంది భామ.

"వారం రోజులే ఎందుకు పోయాడు? ఇంకో వారం రోజులు పోతే బావగారింట్లో ఖుషీగా గడిపేద్దు ననుకొంటున్నావేమో!"

"ఛీ! ఏం మాటలివి?" ఏహ్యంగా అంది భామ. "మీరు చాలా కుసంస్కారంగా ప్రవర్తిన్నారు. మీలో ఏ కాస్త సహృదయత ఉన్నా నా కోరిక మన్నించే వారు. ఇంత అసహ్యంగా మాట్లాడడానికి ఆస్కా

రమే ఉండేది కాదు," విసురుగా వంట గదిలోకి వెళ్ళిపోయింది భామ.

కంచాల చప్పుడు విని, అన్నాడు జగన్మోహన్: "ఒక ఫ్రెండింట్లో తినేసి వచ్చాను. నాకు పెట్టకు."

"ఎందుకు?" భామ అడిగింది అసహనంగా, కోపంగా. "ఈ వంటంతా నా నెత్తిన కొట్టుకోవాలనా?"

"నువ్వు వచ్చి వండుతావని నేను కలగన్నానా?"

తీసిన రెండు కంచాలు పెద్ద చప్పుడుతో స్టాండులో ఉంచేసి వంటగది తలుపులు మూసి చాప తీసికెళ్ళి మంచానికి కొంచెం దూరంగా మొక్కల మధ్య వేసుకొని పడుకుంది భామ.

దుస్తులు మార్చుకొని జగన్మోహన్‌వచ్చి మౌనంగా పడుకొన్నాడు మంచంమీద.

వెన్నెల్లో ముద్ద బంతి చెట్ల మధ్య చిరిచాప మీద వంపులు తిరిగి పడుకొన్న భామ తన భంగిమ తనకే ముద్దొస్తూంటే ఆశ్చర్యంగా అనుకుంది- 'పొరబడ్డాను. భువనమోహిని అయినా భార్య సమ్మోహనాస్త్రం కాలేదు పురుషుడికి. అదే పరాయి ఆడదీ మర్కట వదన అయినా మగవాడికి తారస పడిందంటే- ముక్కుకు తాడువేసిన ఎలుగుబంటిలా ఆడగలడు.'

చాలాసేపు నిశ్శబ్దంగా పడుకున్న జగన్మోహన్ మెల్లగా లేచి వచ్చాడు. భామ పక్కన కూచుని ఆమెను ఒళ్ళోకి తీసుకొన్నాడు బలవంతంగా, "భోజనం చేయకుండా పడుకున్నావేం? నువ్వు ఉపవాసం ఉంటే సరే- నా బాబును ఉపవాసం పెడతానంటే నే నొప్పుకోను."

"........" అతడి కంఠం ప్రేమగా ధ్వనించినా నల్లని పెదాలకు లిఫ్‌స్టిక్‌లా అనిపించింది భామకు.

"నీకీడ్రెస్సు చాలా అందంగా అమరింది. వెన్నెల్లో చాలా బాగున్నావు!" భామ భుజాలనూ, బుగ్గలనూ మృదువుగా స్పృశిస్తున్నాయతడి హస్తాలు. "అబ్బా! ఏడు రోజులు ఏడు యుగాలుగా తోస్తూంది, భామా! పెళ్ళి కాక ముందు ఎలా ఉన్నానా అని ఇప్పుడు ఆశ్చర్యంగా ఉంటూంది."

"ఈ చెట్ల మధ్య ఏం పడుకొంటావులే. పురుగూ పుట్రా ఉండ గలదు. మంచం మీదికి పద."

అతడిలోని పురుషావేశం తనను ఆక్రమిస్తూంటే ప్రేమకూ, కామానికీ వున్న అంతరం గురించి మొదటిసారిగా ఆలోచిస్తూంది భామ.

* * *

నెలాఖరుకి మిగిలిన డబ్బు లెక్క పెడుతూంది భామ.

కాగితం, కలం తీసుకొని నెల ఖర్చు వ్రాసింది. 'అబ్బే! ఇంత కంటే పొదుపు సాధ్యంకాదు', అనుకుంది. 'ఇలా అవుతే, ఎన్ని నెలల తరువాత వస్తుంది ట్రాన్సిష్టరు? ఇంట్లో రేడియో లేకపోతే ఏం బాగుం టుంది?' పెళ్ళిలో పుట్టింటి వాళ్ళు ఇచ్చారు బాటరీ రేడియో. చాలా పెద్దది. మీరు ట్రాన్సిష్టరు కొనుక్కోవచ్చంటూ, రేడియో అత్తగారు వాళ్ళు అక్కడే ఉంచేసుకొన్నారు.

మళ్ళీ నెల ఖర్చు చూసింది. ఇంకా తగ్గించాలి. కొంచెం ఎక్కువే మిగిలేట్టు చూడాలి.

ఈసారి మరింత కట్టుదిట్టంగా ఖర్చు పెట్టాలనుకుంది భామ.

పొదుపు చేయడానికి కొన్ని సరదాలు చంపుకుంటే, మనస్సంత కష్టపడదు. ఇలా సంసారానికి శోభస్కరంగా సామాను కూర్చు కొంటూంటే ఎంత తృప్తి?

ఒక ట్రాన్సిష్టరు, కెమేరా, బైనాక్యులర్, స్టీల్ టిఫిన్ కారి యరు....వరుసగా ఇంకేవేవో సంసారానికి కూర్చుకొనే కలల్లో మునిగి పోయిన భామ—సమీపంలో పాటవిని ఆశ్చర్యంగా తలెత్తి చూసింది. చేతిలో ట్రాన్సిష్టరుతో ప్రవేశించాడు జగన్మోహన్.

"ట్రాన్సిష్టరో, ట్రాన్సిష్టరో అంటూ కలవరించేదానివి కదా? ఇదిగో నీ ట్రాన్సిష్టరు!" ధీమాగా, గర్వంగా భామ ముందు ఉంచాడు.

"కొన్నారా? ఎంత? వాయిదాల పద్ధతి మీదా?" భామ అంతగా సంబరపడినట్టు కనిపించలేదు.

"అదంతా నీకెందుకు? నీ కోరిక తీరింది కదా?"

"చెప్పరాదండేం? అయిదారు వందలైనా అయి వుంటుంది.

"అంచనా సరిగానే వేశావు. అయిదు వందల ఏభై."

"కొనేశారా? అంత డబ్బెక్కడిది?" కళ్ళు పెద్దవిచేసి ఆశ్చర్యంగా, అపనమ్మకంగా అడిగింది.

"కొనేశాను. డబ్బుదేముంది? ఉద్యోగం చేయడం లేదూ?" తేలికగా నవ్వేశా డతడు.

చిన్న పిచుకమ్మ ఈ పుల్లా ఆ పుల్లా ఏరి ఒకచోట చేర్చి గూడు కట్టుకోవడంలో ఉన్న తృప్తి, మనం తయారుగా ఓ గూడుచేసి ఉంచుతే అందులో ప్రవేశించడానికి యిష్టపడుతుందా? అలానే ఉంది భామ మనస్థితి. తను కష్టంగా కడుతూన్న మేడను మధ్యలోనే కూల ద్రోసి మరో అందమైన మహల్లోకి ఆహ్వానిస్తూన్నట్టు ఉంది. డబ్బు ఇంత సులువుగా కూర్చుకోగలిగితే తనంతగా పొదుపుచేసి మనసును యిబ్బంది పెట్టుకోవడమెంత అర్థరహితమైన పని?

"నేనింత కష్టపడి వందరూపాయలకంటే ఎక్కువగా కూడబెట్ట లేకపోయాను. జీతం నా చేతికే యిస్తున్నారు కదా? ఇంత డబ్బు మీ కెక్కడిది?"

నిర్లక్ష్యంగా నవ్వాడతడు. "నీ పొదుపు చేయడమంతా చెలమలో చేపలు పట్టడం లాంటిది. నువ్విలా కూడబెట్టి మనకు కావాల్సిన వన్నీ ఎప్పుడు కొనగలవు?"

"మరయితే?...."

"ఏం? మరీ రామావతారం మనిషిలా ఉన్నావు! ఆ మాత్రం ఊహించలేవూ? ఊరికినే వచ్చింది. ఒకడికి సహాయం చేశానంతే."

తెలిసిపోయింది భామకు. "ఛీ! మీరు లంచాలు పడతారని నాకు తెలియదు."

"లంచమన్నది అంతహీనమైనదైతే మరోపేరు పెట్టుకొందాం. కానుక, మామూలు, ప్రతిఫలం."

"పందిని నంది అనుకొంటే పంది కాకుండా పోదు."

"అయితే, ఏంచేయమంటావు?"

"కష్టార్జితంలో వున్న తృప్తి, అన్యాయార్జితంలో ఉండదు. పాపిష్టి డబ్బుతో కూర్చుకొనే వైభోగం మనకొద్దు."

అసహనంగా అన్నాడు, కనుబొమలు ముడివేసి: "అన్యా

యార్జితమేముంది యిందులో? అతడి పనిచేసి పెట్టాను. ప్రతిఫలం పుచ్చుకున్నాను. జేబులో నోట్లు కుక్కిపోతూంటే, అనిష్టంగా రామావతారం పోజుపెట్టడం కూడా ఈ కాలంలో ఎబ్బెట్టుగా ఉంటుంది తెలుసా?''

''ప్రభుత్వాన్ని మోసపుచ్చడం కాదూ, ఇది?''

''ప్రభుత్వం దేవలోకం నుండి ఊడిపడిందా ఏమన్నా? నువ్వూ, నేనే ప్రభుత్వం.'

అతడి వితండ వాదానికి మరింత మండిపడింది భామ. ''మీ తెటలు మరెక్కడైనా ఉపయోగించుకోండి. నా సంసార రథాన్ని ఎంతో అందంగా అలంకరించు కోవాలను కొన్నాను. అలంకరించుకుం టాను. మరోసారి ఇలాంటి పాపిష్టి సొమ్ము ఇంట్లోకి వస్తే చూడండి. ఇలాంటి పని చేయడానికి మీ సంస్కారం ఎలా ఒప్పుకుంది?''

''నేనో కుసంస్కారినని మన పెళ్ళికి ముందే నీకు తెలిసి ఉండాలి. నువ్వు వ్రాసిన జాబుకు నా జవాబు గుర్తుందా? సంస్కారానికి అర్థమే మారిపోయిన ఈ నాగరీక యుగంలో నన్ను నువ్వేమన్నా ఫర్వాలేదు. నువ్వేది అసహజం, అన్యాయం అంటావో అదే సహజం, న్యాయం అవుతుంది. ఎందుకంటే—పదిమందిలో ఒక్కడు మంచి తోవన పోయినా—అది మంచి తోవ కాదు. తొమ్మిది మంది పోయిందే రాజమార్గం. ఈ కాలంలో లంచం తినని వెధవ ఎవడు? ఎవడో బత కడం చేతగాని చవట అయితే గాని.''

అతడితో ఇక వాదించడం కుక్క తోక చక్కబరచడం లాంటిదని మౌనం వహించింది భామ.

అది మొదలు పొదుపు చేయాలంటే బొత్తిగా ఉత్సాహం లేకుండా పోయింది భామకు. చాలా నిర్లక్ష్యంగా ఖర్చు పెట్టేస్తోంది. వేసుకోడానికి రెండు మూడు జతల గాజులు ఉన్నా మళ్ళీ గాజులు తీసుకొంది. అవసరం ఉన్నా, అవసరం లేకున్నా డబ్బు లెక్క లేకుండా ఖర్చు పెట్టేస్తోంది. నెలాఖరుకు బ్యాంక్‌లో వేయడానికి మిగిలినవి అయిదు రూపాయలే.

''పెట్టెలో కొంత డబ్బు వుంచుకొని కూడా నెలాఖరున

బ్యాంక్‌లో వేయడానికి ఏభై రూపాయ లిచ్చేదానివి. ఇదేమిటి? అయిదు రూపాయలా?"

విరక్తిగా నవ్వింది భామ. "రెండు చేతులా నా మగడు ఆర్జిస్తూంటే నేను ఆ మాత్రం ఖర్చు పెట్టకూడదా? డబ్బుదేం లెక్క?"

"చాల్లే. ఏదో పైన వచ్చినవి కావలసిన వస్తువులు కొనడానికి వస్తుంది గాని, జీత మిలా దుబారా చేస్తే ఇహ కాపురమైనట్టే. వడ్డీ ఆశకు అసలు ముంచుకొంటామా? ఇహ ముందు యిలా జరుగడానికి వీల్లేదు."

పట్టు చీర కట్టుకొన్నమ్మ పీట చంకనిరికించుకు తిరిగినట్టుంది ఈ పెత్తనం పుచ్చుకోవడం. "ఈ నెలనుండి మీరు నా చేతికి జీతం యివ్వక్కరలేదు. కావల్సిందేదో మీరు తెచ్చి పడేయండి. నేను వండి పడేస్తాను. ఇదే సుఖం నాకు."

# 10

## "ఎక్కడినుండి టెలిగ్రాం?"

"చిన్నన్నయ్య ఇచ్చాడు. గురువారం ఉదయం ట్రెయిన్‌కు వదినా, పిల్లలు వస్తున్నారంటూ. రేపే కదూ?"

"ఎందుకు వస్తున్నట్టు?"

"ఏం? కావలసిన వాళ్ళు రాకూడదా? నాలుగు రోజులు సరదాగా గడిపి పోదామనేమో!"

"ఎందుకు వస్తున్నారంటే రాకూడదనా అర్థం? బాగుంది మీ కోపం!"

"అత్తగారి వైపు వాళ్ళంటే మీ ఆడవాళ్ళకు పడదు కదా? పైకి ఇలా అంటున్నావు కాని, నీ మనసులో లేదేం ఇదెక్కడి సంత వచ్చి పడుతూందిరా, బాబూ! అని."

చికాకుగా అంది భామ: "మీ ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్‌తో చాలా గొడవ వచ్చి పడుతూంది. లేని వన్నీ ఊహించుకొని నన్నెం దుకు బాధపెట్టడం? మీ వాళ్ళు వస్తే నేను మర్యాద మన్ననలు చేయక పోతే అప్పు డనండి పడతాను."

మరునాడు ఉదయం ముగ్గురు పిల్లలతో దిగారు తోడికోడలూ, బావగారూ.

తోడికోడలి ఆగమనం కొంచెం గుండె దడగానే ఉంది భామకు. అయితే, అది వండి వడ్డించడానికీ, ఖర్చుకూ భయపడి కాదు. ఆడ వాళ్ళ మనసు అతి విచిత్రం. ఎదుటి వాళ్ళ మనసులో, ప్రవర్తనలో కాలుష్యం లేకపోయినా అనవసరంగా, అతి మూర్ఖంగా లేనిపోని చికా కులు లేవదీస్తుంటారు. పుట్టింట్లో బాగా తెలిసిన విషయమిది. ఇద్దరు వదినలూ, నలుగురు ఆడబిడ్డలూ ఉన్న తన పుట్టింట్లో అన్నీ అర్థంలేని అపోహలూ, అనవసరమైన కలహాలూ. ఇందిర అంత కలుపుగోలు మనిషి కాదు. తాను, తన పిల్లలూ, తన భర్తా మిగతా ప్రపంచం అతి చిరాకు.

ఉన్న రెండురోజులు స్నేహంగా మెలిగి, తన ఆతిథ్యాన్ని హృదయపూర్వకంగా మన్నిస్తే చాలు. ఆవిడ సంకుచితత్వాన్ని రెచ్చ గొట్టడానికి తన ప్రవర్తన దోహదం కారాదు.

ముందే ఎంతో కట్టుదిట్టంగా అనుకుంది భామ.

వంట ముగించి, "మీ మరిదినీ, బావగారిని లేపనా, అక్కయ్యా?" అని అడిగింది భామ.

"ముందు మీ బావగారికీ, నాకూ పెట్టెయ్యమ్మా. బయటికి వెళ్ళి వచ్చేపని ఉంది."

"పిల్లలు....?"

"పిల్లలకు నేనుండే తినిపించాల్సిన అవసరం లేదు. నువ్వు పెట్టినా తింటారు. చంటివాడు లేస్తే పాలు పట్టు. సీసా, పాలడబ్బా ఇవతల పెడతాను."

పెద్దపిల్లల నిద్దర్నీ చాటుకు పంపేసి, పదినెలల చంటివాడిని

కూడా ఇంటిదగ్గరే వదిలేసి, ఏవో కాగితాలు తీసుకొని భర్తతో వెళ్ళిపోయింది ఇందిర.

ఇద్దరు పిల్లలకు అన్నాలు కలిపి పెట్టి, భోజనానికి భర్తను లేపింది.

"బావగారూ, మీ వదినా ఎక్కడికి వెళ్ళారు?"

"నీతో చెప్పలేదూ?"

"బయటికి వెళ్ళేపని ఉందని చెప్పింది."

"టైప్ ఇన్‌స్టిట్యూట్‌లో చేరుతుందట. ఆ సంగతులు తెలుసుకోవడానికేమో వెళ్ళారు," అన్నా డతడు అప్రసన్నంగా.

"టైపిస్టుగా ఉద్యోగం చేస్తుందా?"

"ఏం? నీకు అసూయగా ఉందా?"

"నాకెందుకు అసూయ? నేను కోరుకుంటే నాకు అందనిపదవి గనుకనా? చేయాలంటే ఇంకా మంచి ఉద్యోగమే సంపాదించుకోగలను."

"అన్నయ్య బుర్రలో ఉన్నది వెర్రికాకపోతే ముగ్గురు బిడ్డల తల్లిని ఉద్యోగం చేయించాలని ఉబలాటం దేనికో?"

"తప్పేముంది? మీ అన్నగారు పెద్ద ఉద్యోగస్తులు ఏం కాదు. వేణ్ణీళ్ళకు చన్నీళ్ళుగా ఉంటుంది ఆమె సంపాదిస్తే."

"ఆఁ! ఆడదాని సంపాదన అందలా లెక్కిస్తుంది సంసారాన్ని!"

"ఏం? ఆడది సంపాదించేది డబ్బుకాదా? రాళ్ళా?"

"రాళ్ళు సంపాదించినా, డబ్బు సంపాదించినా ఒకటే. ఆమె చీరలకు, విలాసాలకే చాలదా జీతం. భార్య ఉద్యోగిని అయితే వేణ్ణీళ్ళకు చన్నీళ్ళలాకాదు. వేణ్ణీళ్ళకు ఇంకా మంట తగిలినట్టు అవుతుంది. సంసారంలో మగవాడికి సౌఖ్యమే కరువైపోతుంది."

"డాక్టరేటు ఇవ్వాలి మీ పరిశోధనకు."

"ఆడది ఉద్యోగం చేయడం నాకు నచ్చని విషయం."

"డెలివరీ అయిపోయాక నేను ఉద్యోగంలో చేరాలనుకొంటూంటే!" చిన్నగా నవ్వుతూ, భర్త ముఖంలోకి పరిశీలనగా చూసింది

ఖండితంగా చెప్పాడు: "తీరని కోరిక అది."

వాదించాలనుకొంది భామ. అవతల చంటివాడు నిద్రలేచి రాగాని కెత్తుకొన్నాడు. అవసరమైనప్పుడు చూద్దాం. ఎలా చేయనివ్వరో చూస్తాను. అసందర్భంగా ఇప్పుడు పోట్లాడుకోవడం దేనికి? అను కుంది.

చంటివాడికి పాలు పట్టింది.

జగన్మోహన్ ఆఫీసుకు వెళ్ళిపోయాడు.

ఇద్దరు పిల్లలూ పిన్నీ పిన్నీ అంటూ కాస్సేపు ఆడుకొన్నారో లేదో, తల్లిమీద ధ్యాసపోర్లి ఏడుపు ప్రారంభించారు. చంటివాడు సరే సరి. పాలు పట్టినా ఏడుపు మానలేదు.

'ఇదేమి గోలరా, బాబూ!' ఆవిడేమో నిశ్చింతగా వెళ్ళిపోయింది గాని, వాళ్ళను సముదాయించలేక చావయింది భామకు. తిండి తినడానికి వీలులేకుండా పోయింది, వాళ్ళ ఏడుపులతో. బిస్కట్లు, చాక్లెట్లు ఏవీ వాళ్ళ ఏడుపులను మానిపించలేక పోయాయి. అమ్మే కావాలట!

కడుపులో ఆకలి మంట. చెవులు చిల్లులుపడేట్టు వాళ్ళ రాగాలూ కళ్ళ నీళ్ళు తెప్పించాయి భామకు.

సాయంత్రం నాలుగు అవుతూంటే నవ్వుతూ వచ్చింది తోడికోడలు.

చిరాకుగా ఎగిరింది భామ: "భలే పిల్లలమ్మా నీ పిల్లలు. ఏం చేసినా ఊరుకోరు. నువ్వు అటు వెడుతూనే ఇటు వీళ్ళు గొంతులు విప్పారు. సముదాయించలేక చచ్చాను."

"ముందు నీకు పిల్లలు పుడితే ఎలా సముదాయిస్తావు?"

ఆవిడ నవ్వులోని ఎత్తి పొడుపుకు ఒళ్ళు మండింది భామకు. 'నాకు పిల్లలు పుడితే నీలా ఒకరి ప్రాణానికి పడేసిపోను;' మనసు లోనే అనుకుని, మౌనంగా భోజనానికి వెళ్ళిపోయింది.

*　　*　　*

"ఏమంటావురా, జగనూ? నువ్వు వప్పుకొంటేనే మీ వదినను ఇక్కడ ఉంచుతాను. నెలనెలా ఖర్చులు పంపుతాననుకో. రెణ్ణెల్లతో

నా ట్రెయినింగ్ అయిపోతుంది. ఇక్కడికే బదిలీ చేయించుకొని, వేరే ఇల్లు తీసుకొంటా నప్పుడు.''

''అలాగే ఉంచు. ఇదేం పరాయి ఇల్లా, నువ్వు ఇంతగా అడగడానికి?''

''మరదల్నికూడా ఒక మాట అడుగు. ఆవిడకు ఇష్టం లేక పోతే గొడవకదా?''

''ఆఁ! దాన్ని అడిగేదేముంది?''

''అలా అంటే కాదు. సంసారంలో ఆడవాళ్ళదే కదా ముఖ్య పాత్ర? ఒక మాట అడుగు సత్యవతిని.''

''ఆడవాళ్ళను అడిగి చేయాలంటే మనం ఒక్క పనీచేయలేం.''

''తరువాత లేనిపోని స్పర్థలకు తావీయకూడదని నా ఉద్దేశం.''

క్రింద తోడికోడలూ వాళ్ళూ పడుకొంటే పైన డాబామీదపక్క వేసింది భామ.

పైన పంచమి చంద్రవంక మేఘాలమధ్య పరుగులు తీస్తూ పక్కింట్లో పెరిగిన కొబ్బరిచెట్టు ఆకులను చాటు చేసుకొంటున్నాడు. లేత వెన్నెల హృద్యంగా ఉంది.

భామ మనసులో కలతగా ఉంది, తోడికోడలు టైపూ, షార్ట్ హాండ్ నేర్చుకోడానికి ఇక్కడే ఉండిపోతుందని తెలిసినప్పటినుండీ. మనుష్యల్లో స్నేహశీలత కొరబడితే ఉమ్మడి కుటుంబం, మనస్పర్థలతో కార్పణ్యాలతో నరకమైపోతుంది. ఇందిర తన చుట్టూ తాను గిరిగీచు కొనే మనిషేగాని, మరో మనిషిని మనసులోకి చొరనిచ్చేది కాదు. అసలు ఒంటిగా సంసారం చక్కదిద్దుకోడానికి అలవాటుపడ్డ ఆడవాళ్ళు మరో సంసారంలో ఇమడడం చాలా కష్టం.

ఆవిడ టింగురంగా అని టైపు నేర్చుకోడానికిపోతే, ఆ పిల్లలతో తనేం చేయగలదు? కడుపుతో ఉన్న మనిషి. పిల్లలకూ, తల్లికీ చుద్దడం తనకు చేతనౌతుందా?

భామకు మంటగా ఉన్నది మరొకటి. సాయంత్రం అన్నదమ్ముల సంభాషణ విన్నది. 'ఆడవాళ్ళను అడిగి చేయాలంటే మనం ఒక్క పనీ చేయలేం!' అన్న తన భర్త సిద్ధాంతం గుర్తు వస్తూంటే పౌరుషం

పడగ లెత్తుతూంది. ఎలా చురక తగిలించాలా? అనుకొంటూంది కసిగా.

క్రింద అన్నగారితో మాటలు చాలించి పైకి వచ్చాడు జగన్మోహన్. వదిన ఇక్కడే ఉండిపోగలదన్న సంగతి అతడి నోటినుండి వినాలనుకొంది భామ. అతడు ఆ సంగతే ఎత్తలేదు.

మనసు పట్టలేక భామే అంది: "మీ వదిన ఇక్కడే ఉండిపోతే ఊరికే అవుతుందా?"

"కొంప మునుగుతుందా?"

"ఆడవాళ్ళ బాధ మీకు తెలియదు."

"ఏమిటో చెప్పు."

"మీరింత వెటకారంగా మాట్లాడడం భావ్యంకాదు. మీ రాడ వాళ్ళై పుట్టి ఇలాంటి సందర్భాలలో అనుభవిస్తేగాని తెలియదు. ఆ కాస్త బైపు పరీక్ష పాసై ఉద్యోగమయ్యాక వచ్చే రాజఠీవంతా ఇప్పుడే ఒలకబోస్తూంది. అంత చిన్న పిల్లల్ని నామీద పడేసిపోతే నేనెలా సముదాయించగలను? ఆవిడకు అన్నీ సిద్ధంచేసి...."

భామ మాట పూర్తి కానివ్వలేదు జగన్మోహన్. "సంకుచితం, సంకుచితమని మాటకు పదిసార్లు నన్ను ఎత్తి పొడుస్తుంటావే? నీ సహృదయత ఈ పాటిదేనా? తోడికోడల్నీ, తోడికోడలి పిల్లల్నీ నాలుగు రోజులు ఓర్చుకొని పోలేవూ? చేస్తే పాపం వస్తుందా? ఇక్కడ ఉండి సహాయం పొందిన రోజులు వాళ్ళు మరచిపోరు. అయినా పరాయివారు కాదుకదా? ఒక ఇంటివాళ్ళం. ఉద్యోగాలరీత్యా కాపురాలు వేరైనంత మాత్రాన- ఇప్పుడు కలసి ఉండడానికి మనసు కష్ట పెట్టుకోవడంలో అర్థం లేదు. ఎంత చదువుకుంటేనేం? ఆడవాళ్ళ అసలు రంగు బయటపడేది ఇలాంటప్పుడే."

"ఊరి వాళ్ళను ఉద్ధరించడమే సహృదయతకు నిదర్శనంకాదు. అయినా పరాయివాళ్ళకు వెట్టి చాకిరీ చేసే సహృదయత నాకు లేదు. అయినా, భార్య ఉద్యోగం పేరెత్తితే చిర్రెత్తుంది. పరాయి వాళ్ళను ఉంచుకొని ఉద్యోగాలకోసం సహకరించడ మేమిటో?"

"ఆడవాళ్ళు ఉద్యోగం చేయడమంటే నాకు సదభిప్రాయం లేని

మాట నిజమే. అయితే, నా స్వంతాభిప్రాయాల్ని మందిమీద రుద్దడం యుక్తమైన పనా? నా హద్దులు నాకు తెలుసు. ఆ హద్దుల్లో నా అభిప్రాయాలు, అభీష్టాలు ఆచరణలో పెడతాను.''

భామ విసుగ్గా అనుకొంది: 'నిజంగా హద్దులు తెలిసిన వారైతే ఆడదాన్నింత చులకన చేయకపోదురు!'

ఇంత సంకట స్థితిలోనూ భామకు ఊరటగా ఉన్న విషయం ఒకటుంది. అది మొన్న తండ్రి అల్లుడికి వ్రాసిన ఉత్తరం. 'అయిదో నెల పడుతూనే, అమ్మాయిని పురిటికి తీసికెడతామూ. మంచిరోజు చూసుకొని' అంటూ.

భార్యను చుట్టేస్తూ అన్నాడు జగన్మోహన్: ''డాబామీదే హాయిగా ఉంది. ఆ గోడల కాకతో, గాలి రాక ఉక్కగా ఉండేది. ఇక్కడే బాగుంది.''

* * *

కూతుర్ని తీసుకుపోడానికి వారం వర్జ్యం అన్నీ చూసుకొని భామ తండ్రి దిగాడు.

''అమ్మా అందరూ బాగున్నారా, నాన్నా?'' ఆగని ఆనందంతో అడిగింది భామ.

''బాగున్నారమ్మా. నీ ఆరోగ్యం బాగుంది కదా?'' తల్లి కాబోతున్న కూతుర్ని ఆప్యాయంగా, ఆసక్తిగా చూశారాయన. ''అల్లుడు బయటి కెళ్ళాడా?''

''అవును, నాన్నా.''కాళ్ళకు నీళ్ళివ్వడానికి లోపలికివెళ్ళింది భామ.

''పురిటికి తీసుకు వెళ్ళడానికి వచ్చారా మీనాన్న?'' పేలవంగా నవ్వుతూ అడిగింది ఇందిర.

''అవునేమో!'' లోలోపల చాలా సంబరంగా ఉంది భామకు. వియ్యపురాలిలా కూర్చొని తనతో రుద్దించుకొంటూన్న తోడికోడలు రేపటినుండి కొంగు ఎగదోపు కోవడం ఊహిస్తూంటే.

''ఇప్పటినుండి వెళ్ళి పుట్టింట్లో కూర్చుని, మరిదిని ఎవరికి పట్టివ్వా లనుకొన్నావు?''

''అదేమిటి?'' అసహ్యంగా పెదవి విరిచింది భామ. ''అంత

ఆగలేని మనుషులు భార్య పుట్టింట్లో ఉన్నా, నట్టింట్లో ఉన్నా పటుల పాలే."

"అసలు మరిది పంపొద్దూ?"

ఆవిడ దాచుకొంటున్న సిగులు చూసి నవ్వుకుంది భామ. "ఎందుకు పంపరూ?" బింకంగా అంది.

"తొలి చూలప్పుడు తొమ్మిది నెలలు నిండాకగాని పుట్టింటికి పంపలేదు మీ బావగారు నన్ను. నాకు కూడా ఆయన్ని విడిచి వెళ్ళాలంటే చాలా దిగులేసేది. పెళ్ళయ్యాక అయిదేళ్ళలో మూడుసార్లు వెళ్ళానేమో నేను."

మనసులో అనుకుంది భామ. 'మరీ అంత శృంగారం భరించే ఓపిక నాకు లేదులే.'

కాలక్షేపానికి సాయంకాలం బయటికి వెళ్ళిన అల్లుడు రాత్రికి వచ్చాడు.

కుశల ప్రశ్నలయాక కూతుర్ని వూరికి తీసుకుపోయే ప్రసక్తి ఎత్తాడు భామ తండ్రి.

నిర్మొగమాటంగా తన అసమ్మతి తెలిపాడు జగన్మోహన్. "మా వదినగారు ఈ మధ్యే వచ్చారు. కొన్నాళ్ళపాటు ఇక్కడే ఉంటారు. అలాంటప్పుడు ఆమెను పంపడం మర్యాదగా ఉంటుందా? మీరే చెప్పండి."

"నేనో మాట అననా?" అని నవ్వారు మామగారు. "మీవదినా వాళ్ళు రాకపోయిన పక్షంలో-'ఒంటిగాణ్ణి హోటల్ భోజనంతోచావనా?' అనే వాడివేమో. ఎప్పటి కప్పుడు ఏవో సాధక బాధకాలు ఉండనే ఉంటాయి. కొంచెం అటు ఇటుగా సర్దుకు పోవాలి. నన్నడిగితే ఇప్పుడే సౌఖ్యంగా ఉంది. మీ వదినగారున్నారు. భోజనం గురించి ఇబ్బంది ఉండదు. ఇహ పోతే, ఆ పిల్లకు తొలిచూలు. ఏవో మా ముద్దు ముచ్చట్లు మావి. పోయిన వేడుకలు తిరిగిరావు. ఏదో విధంగా సర్దుకు పోవాలి గాని...."

"మాటలు ఎన్నైనా చెప్పొచ్చు గాని, మామగారూ! సంగతి సందర్భాలు మీరూ చూడాలి కదా? వదినా పిలలు రావడం. ఈమెన

పుట్టింటికి పంపడం ఏమైనా మర్యాదగా ఉంటుందా? అంతగా తీసికెళ్ళా లనుకొంటే, ఓ వారం రోజులు పోయాక సత్య తమ్ముణ్ణి, మరెవరి నైనా పంపండి. పంపుతాను గాని వారం పది రోజులకంటే ఎక్కువగా ఉంచుకోవడం బాగుండదు. పురిటికి కావలిస్తే తొమ్మిదోనెల రాగానే తీసికెళ్ళండి."

అల్లుడి నిర్మొగమాట ప్రవర్తనకు భామ తండ్రి ఏమనుకొన్నాడో గాని, గుమ్మం పక్కగా నిలబడి వింటూన్న భామకు ఒళ్ళు మండుకు వస్తూంది!

మంట చల్లార్చుకోడానికి రాత్రి డాబా ఎక్కాక గాని వీలుపడ లేదు.

"మీ దయా భిక్షకు మా నాన్నకు కృతజ్ఞతలు చెప్పుకోడానికి చేతకాలేదేమో నేను చెప్పుకుంటున్నాను." కటువుగా నవ్వుతూ అంది.

"ఏమిటి?" కనుబొమలు ముడివేసి తీక్షణంగా అడిగాడు జగన్మోహన్.

తగ్గకుండా అంది భామ: "మర్యాదలూ, మన్ననలూ మీకే కాదు ఇవతలి వాళ్ళకు కూడా ఉంటాయి. అయిదువేలిచ్చి, అడిగిన లాంఛనాలు కట్టబెట్టి కాళ్ళు కడిగి కన్యాదానంచేసి పురిటికి తీసికెళ్ళడానికి పుట్టింటి వాళ్ళొస్తే—ఏదో నౌకరుకు సెలవిచ్చినట్టుగా ముష్టి ఎనిమిది రోజుల సెలవా? ఆడదంటే ఏమిటీ మీ

"ఓహ్! చదువుకొన్న పెళ్ళానివి కదూ, ఖర్మకొద్దీ మరచి పోతుంటాను."

అతడి వికటహాసం చూసి మరింతగా రెచ్చిపోయింది భామ: "విద్యా అవిద్యలను బట్టి ఆడదానికి గౌరవం ఇవ్వాలనుకొంటే అది కేవలం వెర్రి ఆలోచన. అభిమానవతి అయిన ఆడదానికి విద్య లేక పోయినా వచ్చిన లోటు లేదు. వ్యక్తిత్వాలు, ఇష్టాలు ఆడదానికి కూడా వుంటాయని గుర్తుంచుకొంటే మంచిది."

అతడు చాలా నిదానం తెచ్చిపెట్టుకొని, దీర్ఘం తీస్తూ అన్నాడు: "ఈ యుద్ధమంతా పుట్టింటికి పంపమనేనా?"

"అవును."

"ఇంట్లో బంధువు లొచ్చి దిగినప్పుడు ఇల్లు వాళ్ళ మీద వదిలి పుట్టింటికి వెళతాననడానికి సిగ్గులేదూ నీకు?"

"సిగ్గు పడడానికి ఏముంది? నేనేమైనా మగణ్ణి వదిలి లేచిపోతున్నానా? మా నాన్న తీసుకుపోడానికి వచ్చాడు. వెడతానంటున్నాను. మీ వదినా వాళ్ళు రాకముందే కాదూ—మా నాన్న పురిటికి తీసుకు వెడతామంటూ ఉత్తరం వ్రాసింది?"

"నీ యిష్టం. ఎలాగైనా తగలడు," విసుగ్గా అటు తిరిగి పడుకొన్నాడు జగన్మోహన్. "ముట్టాలకు చేయవలసి వస్తుందని పెళ్ళాన్ని పుట్టింటికి పంపాడన్న అపకీర్తి నేనేకదా పడేది."

మరునాడు భామ తండ్రి ఏ సంగతీ చెప్పమని అడుగుతూంటే మాట్లాడకుండా బయటికి వెళ్ళిపోయాడు జగన్మోహన్.

"ఏమ్మా?" కూతుర్ని పలకరించాడు.

"వారం రోజులు పోయాక తమ్ముడిని పంపండి నాన్నా, వస్తాను," అని చెప్పింది భామ.



"చినబాబు జాగ్రత్త, సత్యవతీ! నిన్నటిలా చేసేవు!"

"ఉఁ."

"ఏం చదువొచ్చిపడిందో నాకు. బయటికి వెడితే మనస్సంతా పిల్లల మీదే ఉంటుంది," ఆయాసపడుతూ వెళ్ళిపోయింది తోడి కోడలు.

చిత్రంగా నవ్వుకొంది భామ. "ఒక సంకట పరిస్థితిలో ఇరుక్కొని వుంది ఆధునిక స్త్రీ. స్వంతంగా సామాజిక మర్యాద సంపాదించుకోవాలన్న అభిలాష; ఇటు యిల్లు, పిల్లలు—తెంచుకోలేని అనుబంధం. రెంటి మధ్య యిరికి ఆపసోపాలు పడుతూంది!"

తోడికోడలి భయానికి తగిన కారణం లేకపోలేదు.

నిన్న, బయటినుండి వచ్చిన భర్త, "తొందరగా టీ పెట్టు పద. పని మీద వెడుతున్నాను" అంటూ తొందర పెట్టేశాడు. టీ చేసి భర్తకు అందిస్తూ, బంతి మొక్కల మధ్య ఆడుకొంటూన్న పిల్లల్ని విస్మరించిన భామ వీధిలో వినిపించిన గోలకు ఉలిక్కి పడింది.

"మీ బాబేనా, బస్సు క్రింద పడబోయాడు?"

పక్కనుండి దూసుకుపోయిన బస్సును చూసి బెదిరిపోయిన పెద్దవాడు, అప్పుడే వచ్చిన తల్లి గుండెలకు హత్తుకుపోయి పెద్దగా ఏడుస్తూంటే, అపరాధిలా తలవంచుకో వలసి వచ్చింది భామకు.

'అప్పుడప్పుడే కాళ్ళు వచ్చిన పిల్లలను పట్టుకోవడం ఎంత కష్టం? ఎంత కనిపెట్టి చూసినా ఎప్పుడో కళ్ళల్లో దుమ్ముకొట్టి పోతుంటారు. లేని అపనింద వచ్చి పడుతూంది ఈ పిల్లల మూలంగా,' బాధగా నిట్టూర్చింది భామ.

"ముచ్చటగా పెంచుకొన్న ముద్దబంతి మొగ్గలు పిల్లలు త్రుంచి వేస్తుంటారు. వద్దని కోప్పడితే తల్లి నిష్ఠూరం. "పిల్లలు. వాళ్ళకేం తెలుసు?"

చాలా నెమ్మదిగా అంటుంది భామ: "అంత దూషణ దేనికి, అక్కయ్యా? పిల్లలు తెలీదు గనుకనే వద్దమ్మాని చెబుతున్నాను."

"ముందు నీకు పిల్లలు పుడితే ఎంతెంత నేర్పుతావో అల్లరి చేయకుండా, చూడనా?" మూతి తిప్పుతుంది ఇందిర.

ఈ పిల్లల మూలంగా ఇంట్లో నీట్‌నెస్ అన్నది పోయింది. వారించడానికి తోడికోడలి భయం. వీక్లీలు, పుస్తకాలు అన్నీ పాడై పోతున్నాయి. చాలా సామాను కూడా పాడైపోతూంది. ఏమనడానికీ లేదు.

వీధి తలుపులు వేసి ఇద్దరు పెద్ద పిల్లల ముందు ఆట సామాను పడేసి లోపల పని చేసుకోడానికి వెళ్ళింది భామ. కాస్సేపట్లోనే రేడియో గోల వినిపించింది. ఇవతలికి వచ్చింది. స్టూల్ వేసుకుని ఎక్కి అల్మారులో వున్న రేడియో బాండ్లు తిప్పుతున్నది పెద్దది.

"వద్దమ్మా. రేడియో పాడై పోగలదు."

వాన్ని క్రిందికి దించి స్టూల్ తీసింది భామ.

ఇల్లు ఎగిరిపోయింది.

"ఏడవకు, నీకు బిస్కట్లు యివ్వనా?"

తల అడ్డంగా వీలైనంత అనిష్టత ప్రకటిస్తూ ఊపింది. రేపే యూనే పెట్టాలట తాను.

"ఊచి వెడదామా?" రేపియా ధ్యాసనుండి మరల్చడానికి మరో ఉపాయం తోచలేదు భామకు.

ఉత్సాహంగా తల ఊగించింది పాప.

పని కూడా అయిపోయింది. ఈ మధ్య శ్యామసుందరిని కలుసుకుని కూడా చాలా రోజులైంది. ఇంట్లో చుట్టాలు దిగారని ఆమె కూడా ఈ ఇంటికి రావడం తగ్గించింది.

తలుపుకు తాళం పెట్టి ముగ్గురు పిల్లల్ని తీసుకుని పక్కింటికి బయల్దేరింది భామ.

గేటు దగ్గర ఎవరూ లేరు. మామూలుగా ఎప్పుడూ ఒకరో యిద్దరో వ్యాన్లు ఇంటి ముందు వుండేవాళ్ళు. ఎవరూ లేరు. 'శ్యామసుందరి లేదేమో!' లోపలికి తొంగి చూసింది భామ. తలుపు తెరిచే ఉంది. సందిగ్ధంగా గడప దగ్గర ఆగింది.

సోఫాలో కూచున్న శ్యామసుందరి భర్త చంద్రశేఖర్ పేపరు చూస్తూ కనిపించాడు.

"శ్యామసుందరి లేరా?"

పత్రికనుండి తలెత్తి, "లేదు. మహిళామండలికి వెళ్ళిందనుకొంటాను. చాలాసేపయింది కూడా వెళ్ళి. వస్తుండొచ్చు దారిలో. లోపలికి రండి.... ఈ మధ్య మీరు లేరా? చాలా రోజులైంది మీరు కనిపించి. ఆ పిల్లలంతా ఎవరు?" అన్నాడు గబగబా.

ఇదివరకు శ్యామసుందరి కోసం వచ్చినప్పుడు ఒకటి రెండు సార్లు అతడూ తమ సంభాషణల్లో భాగం పంచుకొన్నాడు. తాము మాట్లాడుకొంటున్నప్పుడు అతడు వచ్చినా, అతడు కూచొన్నప్పుడు తను వెళ్ళినా అతడి ఎదుటే కూచోబెట్టేది శ్యామసుందరి. అది భామకు యిబ్బందిగా ఉంటుందని గుర్తించి కూడా.

"చదువుకొన్నారెందుకు దండగ, బి.ఎ.? మగ స్నేహితులంటే

అంత సంకోచం, బెదురూ దేనికి? దానివల్ల మీ సత్ప్రవర్తనకు కళంకం వస్తుందా?"

"ఛ! అది కాదు."

"మరి? చూసేవాళ్ళకు బాగుండదనా? మనసులో కాలుష్యం లేకపోతే సరళంగా ప్రవర్తించడానికి ఒకరి జడుపెందుకు? తెర మీద ఉండవలసిన బొమ్మలాట నిజ జీవితంలో చూపేవారంటే నాకు ఒళ్ళు మంట."

"మీరు ఒక పక్కే మాట్లాడుతున్నారు. వారితో నేను ఫ్రీగా మాట్లాడుతూ హఠాత్తుగా ఒకరి కంట పడ్డానే అనుకోండి. ఎలాంటి భ్రమకు లోనవుతారు? అనవసరంగా అలాంటి అపార్థానికి ఆస్కారం ఎందుకు కలిగించాలి? మగ స్నేహాలు కావాలని కల్పించుకోనంత మాత్రాన అభ్యుదయం కాదంటారా, అది? అది కుసంస్కారమా?"

"కుసంస్కారమనీ కాదు. అభ్యుదయ నిరోధకమనీ కాదు. కాని, మన సమాజంలో స్త్రీ పురుషులు స్వేచ్ఛగా కలిసి మాట్లాడుకో గలగాలి. కార్యరంగంలో కలిసి పనిచేయగలగాలి. "ఈసారి చంద్ర శేఖర్ కల్పించుకొన్నాడు. "మన విజ్ఞానపథం విస్తృతం కావాలంటే స్త్రీ పురుషుల సహకార, సహవాసాలు ఎంతైనా దోహద మిస్తాయి. వ్యామోహపు సంకెళ్ళు తప్ప స్నేహ బంధం ఉండదనా పరాయి వ్యక్తులైన ఇద్దరు యువతీ యువకుల మధ్య?

"మీరు మాళ్యామను చూసి నేర్చుకోవలసింది చాల ఉంది. చదువుకొన్నారు కొంతవరకు, వివాహమైనంత మాత్రాన ఆ చదువుకు అక్కడితో ఫుల్‌స్టాప్ పెట్టేసి పూర్తిగా గృహిణీత్వంలో ఇమిడిపోవడం వివేకవతి లక్షణం కాదు. స్త్రీకి ఇల్లాలి విధులు నిర్వహించడం ఎంత ముఖ్యమైనా మనోవిస్తృతికి, విజ్ఞాన వికాసానికి దూరంకావడం అంత తెలివైన పనికాదు. అటు ఇల్లాలుగా విధులు నిర్వహిస్తూనే ఇటు సామాజిక ఉన్నతికి శక్తికొద్దీ సేవచేయడం కూడా అంత ముఖ్యమైన విషయమే. అంలాటప్పుడు పరాయి మగవాడని, అదని ఇదని జిడ్డు మీదనీరులా జారిపోవడం అంత మెచ్చుకోతగ్గ సంగతికాదు. మగే మిటి, ఆడేమిటి-నలుగురిలో తిరగాలి. నలుగురి సంగతి తెలుసుకోవాలి.

నలుగు రేమైనా అనుకొంటారంటే అనుకోనీ. మీలో నిజమైన వివేక జ్యోతే వెలుగుతూంటే ఈ నీలాపనిందల నీడలేవీ మిమ్మల్ని సోక లేవు. మీరు ఎన్నుకొన్నది రాజమార్గమైతే సాగిపోడానికి భయమెందుకు?

"అందుకే మీకు చెబుతున్నాను, ఇల్లాలుగా మీరు నాలుగు గోడల మధ్యే జీవితం సంకుచిత పరుచుకోకండి. విద్యలో జిజ్ఞాస ఉంటే చదువుసాగించండి. కాకపోతే ఉద్యోగం ద్వారానో, మరే విధంగానైనా ఉడతా భక్తిగా దేశసేవచెయ్యండి. చదువుకొన్న యువ తులు కేవలం ఇంటి పనులకే అంకితం కావడం అంత హర్షదాయకం మాత్రం కాదు."

అలా మొదలైంది అతడితో పరిచయం. ఎందుకో అతడితో మాట్లాడాలంటే సంకోచమనిపించదు భామకు. శ్యామసుందరితో మాట్లాడగలిగినంత చనువుగా అతనితోను మాట్లాడగలుగుతూంది. అతడి సరళ ప్రవర్తనా, స్నేహ శీలము అందుకు దోహదం చేశాయేమో.

అందుకే, ఇంటి ముఖం పట్టకుండా వెళ్ళికూచుంది భామ. "ఈ పిల్లలు మా తోడికోడలిపిల్లలు," అంటూ వివరంగా చెప్పి, "ఇంట్లో వీళ్ళ అల్లరి భరించలేక మీ పాపతో కలిపి కాస్సేపు ఆడిద్దా మని తీసుకువచ్చాను. పాపకూడా లేదు. అమ్మతో వెళ్ళిందా." సోఫాలో చెరోపక్కా కూచోబెట్టుకుని, ఒళ్ళో బుజ్జిపాపను వేసుకుంది.

"ఉహుఁ. వాళ్ళమేనమామ వచ్చాడు. తిన్పుకు రావడానికి బజారుకేసి తీసికెళ్ళాడు. ఈ పిల్లలు మీ పిల్లలైతే వీళ్ళ మధ్య మీరు చాలా గమ్మత్తుగా కనబడతారు," అంటూ నవ్వాడు చంద్రశేఖర్.

"తలక్రిందుగా మాట్లాడుతున్నారు. ఈ పిల్లలు నా పిల్లలు కానందుకే గమ్మత్తుగా కనబడుతున్నాను. నా పిల్లలయ్యేనాటికి నాచు రాలిటీ వస్తుంది. గమ్మత్తేమీ ఉండదు."

"కావచ్చునేమో." మందహాసం చేశాడతడు. "మీరు పై చదు వుకో, ఉద్యోగానికో ఎందుకు ఉత్సాహపడడం లేదు? జగన్మోహన్‌కు ఇషంలేకా? మీకే ఇషంలేకా?"

"ఆయన ప్రోత్సాహం ఉంటే పై చదువుకు పోయేదాన్ని; కాకపోతే ఉద్యోగం చేసేదాన్ని. కాని, ఆయన కేదీ ఇష్టంలేదు."

"ఎందుకని? తనకు గౌరవహాని అనా?"

"కావచ్చు. ఆడది ఉద్యోగిని అయితే సంసారసౌఖ్యం లోపిసుందని ఆయన ఉద్దేశ్యం."

"సంసార సౌఖ్య మంటే?"

"వండి వార్చి పెట్టడం, అడుగులకు మడుగులొత్తడం, పడక టింట్లో స్వర్గద్వారాలు తెరిచి చూపడం....ఇంకా నేను చెప్పడం దేనికి? మగవాళ్ళు మీకు తెలియదా?" అంటూ మ్లానంగా నవ్వింది భామ.

"మీరు కోప్పడరంటే, స్త్రీని ప్రేమించిన పురుషుడికి ఆమె నుంచి ఆ పాటి సౌఖ్యం ఆశించడం దురాశ అంటారా? అది మీ ఆత్మాభిమానానికి కళంక మనుకొంటారా?"

"మీ శ్రీమతికి కావలసినంత స్వేచ్ఛ నిచ్చిన సంస్కారవంతులు మీరే అలా మాట్లాడితే?" ఆశ్చర్యాన్ని ప్రకటించింది భామ.

"స్వేచ్ఛ ఇచ్చిన మాట నిజమే. ఆదిలో మగవాడు వంటింటి మహాలక్ష్మినే ప్రేమించాడు. అదే అతనిని స్త్రీకోపానికి గురిచేసింది. అన్యాయమన్న ఆమె ఆక్రోశమే అతడిలో చైతన్యం తెచ్చింది. విద్యా విజ్ఞానాలలోముందంజ వేయడానికి అవకాశం కల్పించి సహృదయతను చాటుకుంటున్నాడు. ఇంకా అక్కడక్కడ పాతభావాలకు దాసులై మగవాళ్ళు ఉన్నారనుకోండి.

"అప్పుడప్పుడు అలసిసొలసి డ్యూటీనుండి ఇంటికి వచ్చి నప్పుడు శ్రీమతి మందహాస వదనంతో ఎదురు వచ్చి బూట్లు విప్పాలని, కాలరు గుండీలు తీయాలని, చల్లని మంచినీళ్ళో, కమ్మని తేనీరో తెచ్చివ్వాలని, కమ్మని కబుర్లు చెప్పి అలుపు తీర్చాలని కమ్మని కలగంటాను. కాని, శ్యామ ఇంట్లో ఉండదాసమయంలో, ఉన్నా చదువుకొంటూనో, పాపను ఆడించుకొంటూనో మరేదో పనిలోనో ఉంటుంది. కొంచెం బాధ అనిపిస్తుంది కాని, నా స్వార్థ కాంక్షతో విజ్ఞాన పథంలో ఆమె దృష్టిని అడ్డుపెట్టే అధికారం నాకు లేదు. లేని అధికారాన్ని ప్రదర్శించడం మూర్ఖమే కాదు, అది కుసంస్కారం.

సంకుచితం కూడా. భార్యాభర్తల సహజీవనం సుఖమయం కావా లంటే పరస్పరం కొన్ని స్వార్థ త్యాగాలు చేసుకోవలసిందే.''

మేనమామతో వెళ్ళిన పాప, మహిళా మండలికి వెళ్ళిన శ్యామ సుందరి ఒకేసారి వచ్చారు. శ్యామసుందరితో వచ్చిన యువతిని చూసి ఆనందంగా అరిచింది భామ. ''ఓ! ఉమా!''

''నువ్విక్కడున్నావేమే?'' భామ భుజం మీద చెయ్యి వేసింది ఉమ ఆశ్చర్యంగా.

శ్యామసుందరి ఇద్దరి ఆశ్చర్యాన్ని పోగొట్టింది. ఉమ భర్తకి ఇక్కడే ఉద్యోగం. ఉమ కూడా ఉద్యోగం చేస్తూంది. మహిళా మండలి సభ్యురాలైన ఉమ శ్యామసుందరికి బాగా పరిచయం.

బజారునుండి పాప తెచుకున్న బంతి విసురుతూ పాపతో పసి వాడిలా చంద్రశేఖర్ ఆడుకొంటూంటే ముగ్గురు మహిళలు కబుర్లలో పడ్డారు.

ఏదో సేవాసంస్థ సహాయార్థం మహిళా మండలి వాళ్ళు నాటకం వేస్తున్నారట.

''మంచి సమయానికి దొరికావే. నిన్ను వదలనింక.''

విస్తుపోయింది భామ. ''ఏమిటి?''

''స్కూల్లో, కాలేజీలో చదువుతున్నప్పుడు నువ్వు తెచ్చుకొన్న బహుమతులు మరిచిపోయావా? హీరోయిన్‌కోసం మేమంతా బుర్ర బద్దలు కొట్టుకొంటున్నాం. సమయానికి దొరికావు. నీ నటనా సామర్థ్యం అంతా ధారబోసి నాటకం రక్తి కట్టించాలి. నటిస్తావు. నాకు నమ్మక ముంది.''

''నే నొప్పుకొన్నట్టు!''

''ఒప్పుకోకపోతే వదిలేది లేదు.'' శ్యామసుందరి పట్టుదలగా అంది. ''మీరు నాటకాలు వేశారని, మీలో నటనా శక్తి ఉందని తెలి యదు నాకు. తెలిస్తే ఎప్పుడో మహిళా మండలికి ఈడ్చుకుపోయే దాన్ని. మీవారు సూటిగా వచ్చి నన్ను తిట్టినా సరే, మా అవిడకు పాడు బుద్ధులు నేర్పుతున్నారంటూ.''

?" గాబరా పడింది ఉమ. "మీ ఆయన బి. సి. బాపతు వాడా?"

"ఏ బాపతు వాడైనా ఆడది గుమ్మం కదలడం అంతగా నచ్చదు ఆయనకు." ఉదాసీనంగా చెప్పింది భామ.

"నువ్వు పతివ్రత వయ్యావా?"

పేలవంగానవ్వింది భామ. "అడుగులకు మడుగులొత్తకపోయినా ఏదో సంసార పక్షంగా ఉండాలన్న తాపత్రయం తప్ప మరేం లేదు."

"ఇంట్లో ఎలాగో ఏడుద్దూగాని, నాటకం తప్పక వేయాలే. మీ ఆయన ఒప్పుకోకపోతే నేనువచ్చి మీ ఆయనతో పోట్లాడి వప్పిస్తాను."

"ఎవతో బరితెగిన ఆడదాన్ని నా మీదికి ఉసికొల్పా వనగలరు."

"ఫర్వాలేదు. అంటే అననీ."

"అక్కర్లేదు లే. నేనే అడుగుతా నీవేళ."

"ఒప్పుకోకపోతే?"

"ఎదిరించగలను."

"యుద్ధం ప్రారంభమైతే?"

"ఫలిత మెలాంటిదైనా సిద్ధమే."

"భేష్!" పెద్దగా చరిచింది భామ వీపుమీద, ఉమ, "సత్యభామవు కదూ?"

భామ తోడికోడలి పిల్లలతో ఉమకు దోస్తీ కలిపి వచ్చి కూచు న్నాడు చంద్రశేఖర్. "ఆమె వీపు పగులగొట్టారేమిటీ?" అన్నాడు నవ్వుతూ.

ఉమ గలగలా చెప్పేస్తుంటే భామ వింతగా అనుకొంది: "అప్పటి ఉమే. ఏమీ మార్పురాలేదు. ఆ చలాకీ తనం ఆ లేడిగంతులు అన్నీ అలాగే ఉన్నాయి. మగవాళ్ళతోకూడా అరమరిక లేకుండా మాట్లాడేయ గలదది. ఇలాంటి తత్వంవల్ల దీనికి మగడితో ఏ పేచీలూ రావా?

"ఉత్తమ గృహిణీత్వం ప్రతి స్త్రీ కర్తవ్యమైనా, వినోద వికా సాలకు దూరంగా ఉండడం దేనికి? వినోద వికాసాలకు ఇంట్లో ఎంత వరకు అవకాశం ఉంటుంది ఆడవారికి? చాలా తక్కువ. వాటి కోసం

సక్రమ మార్గంలో బయటికి వెళ్ళడంలో తప్పేముంది?

"కళలంటే ఆసక్తి, ప్రతిభ ఉండడమే చాలా అరుదైన సంగతి. ప్రతిభ ఉన్నా వికసింపజేసుకొనే అవకాశం చాలా తక్కువ. ముఖ్యంగా గృహిణులైన ఆడవారికి. మీలో నాటకకళ ఉన్నప్పుడు, ఇంతమంచి అవకాశం వచ్చినప్పుడు జారవిడుచుకోవడం అంత తెలివైన పనికాదు. ఒక సేవా సంస్థ సహాయార్థం కదా నాటకం వేయడం?" అంటూ సమర్థించాడు చంద్రశేఖర్.

ఆరాత్రి భర్తతో ముచ్చటించింది భామ. "మా ఫ్రెండు ఒకామె కలిసిందీ రోజు," అంటూ మొదలుపెట్టి. నాటకం సంగతి ఎలా చెప్పాలో తోచలేదామెకు. పుస్తకం కోసం గ్రంథాలయం వెడితేనే మన్నించని భర్త నాటకం వేస్తానంటే అనుమతి ఇస్తాడా? అయితే నాటకం వేయాలన్న కుతూహలం చంపుకోలేక ధైర్యంచేసి చెప్పింది. "అదేదో సేవా సంస్థ సహాయార్థం నాటకం వేస్తున్నారట వాళ్ళు. హీరోయిన్ పాత్ర నన్ను తీసుకోమంటున్నారు వాళ్ళు."

పరిహాసంగా నవ్వాడు జగన్మోహన్. "నువ్వేమన్నావు?"

"ఇదివరకు నాకు కొంత అనుభవముంది నాటకాల్లో. స్కూల్లోనూ, కాలేజీలోనూ వేశాను. బాగా నటించగలనన్న నమ్మకం కూడా ఉంది నాకు. మీ రిష్టపడితే...."

"అదేమిటి? పిచ్చా నీకు?" అసహ్యంగా చూశాడు. "వీధిని బడి వేషం కట్టేది ఒకటి తక్కువయిందా! సిగ్గులేకపోతే సరి!"

"బాగుంది. ఇందులో అంత నైచ్యమేముంది?"

"సినిమాల్లో, నాటకాల్లో వేషాలేసే ఆడవాళ్ళు ఎలాంటివాళ్ళో, వాళ్ళ కిచ్చే విలువేమిటో నీకు నేను చెప్పాలా? కాపురం చక్కదిద్దుకోవాలనుకుంటున్నావా? వీధి కెక్కి తైతక్కలాడాలనుకుంటున్నావా?" కటువుగా అన్నాడు.

"నాటకాలు, సినిమాలు చూసేవాళ్ళకులేని అగౌరవం, వాంట్లో నటించే వాళ్ళకేనా?"

"కాకపోతే, పరువున్న దెవతె కూడా రంగమెక్కి ఆడదు."

"నాటక కళ మీరనుకొన్నంత హేయమైనది కాదండీ!"

"నాటక కళ గురించి కాదు నేను చెప్పేది. అందులో నటించే వాళ్ళని గురించి."

"పిచ్చి ఊహ మీది. మీతో వాదించడానికి ఓపిక లేదు నాకు."

విసురుగా అన్నాడు: "ఓపిక లేకపోతే ఊరుకో. నాటకం పేరె త్తితే పుట్టింటికి తరిమేస్తాను." భార్యలో కలిగిన వెర్రి ఊహను మొదలోనే తుంచి వేయాలని వీలైనంత కటు దర్పాలు ఒలకబోశాడుగాని, తను ఆమెలో పట్టుదలను రేకెత్తించినట్టు గుర్తించలేదతడు.

"ఉత్త మాటలతో మనసు కష్టపెట్టుకోవడం దేనికి? చేసేది చేస్తాను. అయ్యేది అవుతుంది." అనుకుంది మొండిగా. "అర్థంలేని పంతానికి పోయి కాపురం కలతలమయం చేసుకొంటున్నానా?" తిరిగి సమీక్షించుకొంది. "కాదు. ఎదురు తిరగకపోతే లాభంలేదు. జీవితమంతా కుమిలింపు భరించడం సాధ్యమయే పనికాదు. కొంతవరకు బయటి ప్రపంచంలో తిరగ నేర్చిన తను కేవలం గృహ కృత్యాలతో నాలుగు గోడల మధ్య జీవించడం ఎల్లకాలం తనవల్ల అయ్యేపనికాదు. ఎంతకాపురం చక్కదిద్దుకొనే ఆడదైనా వినోద వికాసాలనుండి బహిష్కరింపబడితే ఎలా ఉంటుందామె బ్రతుకు?"



# "అయిందా టాయ్‌లెట్?"

"నీ మొహం. వాయిల్ గుడ్డల్తో తయారయ్యావ్? ఏ ఎల్. డి. సి. పెళ్ళాం లాగానో ఉన్నావు. ఛ! కొంచెం డాబుగా తయారవ్వు. అక్కడికి వచ్చేవాళ్ళంతా గొప్పింటి పడచులు. ఎంత నిరాడంబర సుందరివైనా వాళ్ళ మధ్య తీసి పారేసినట్టు కాగలవు!" ఒకసారి నువ్వనీ, ఒకసారి మీరనీ అనేస్తుంటుంది శ్యామసుందరి.

భామ నవ్వింది. "మగవాళ్ళ వెక్కిరింపు నిజం చేయాలంటావు. ప్రదర్శనకు వెడుతున్నామా?"

"ప్రదర్శనకు కాదు. మహిళా మండలికే. అంతా చక్కగా అలంకరించుకొని వస్తే నువ్విలా వస్తే ఏం బాగుంటుంది? అందం అలంకరణా ఆడదాని సొమ్ము. సందర్భం తెలుసుకొంటే సరి."

అయిదు నిమిషాల్లో జరీ బార్డర్ లే గులాబీ రంగు పట్టు చీరలో నిండుగా తయారైంది భామ.

"ఎప్పుడొస్తావు?" తోటి కోడలి అట్టహాసం చూసి ముఖమంతా దిగేసుకొని అడిగింది ఇందిర.

"గంట. అంతకంటే ఎక్కువ టైం పట్టదనుకుంటాను." చకచక మెట్లు దిగింది భామ. శ్యామసుందరితో మహిళామండలి భవనం చేరుకుంటూంటే భామ హృదయం వింతగా స్పందించింది.

సువిశాల ప్రాంగణం. అందంగా పెంచబడిన క్రోటన్సు చెట్లూ పూలమొక్కలూ. మధ్య తెల్లని విశాలమైన భవనం.

మహిళా మండలి ప్రెసిడెంటు చంద్రకళ. సెక్రటరీ త్రిపుర సుందరి. తక్కిన సభ్యుల్ని కూడా పరిచయం చేసింది శ్యామసుందరి. భామనుకూడా సగౌరవంగా పరిచయం చేసింది వాళ్ళకు. "సత్యభామ, బి. ఎ. నిరుద్యోగిని. మన నాటకంలో హీరోయిన్ పాత్రకు ఎన్నిక చేసింది ఈమెనే."

"మీ వారు ఏ డిపార్టుమెంటులో పని చేస్తుంటారు?"

సెక్రటరీ ప్రశ్నకు చురుగ్గా సమాధాన మిచ్చింది శ్యామసుందరి. "ఇది మహిళా మండలి. మహిళల అర్హతలు తప్ప మగవారి పదవుల సంగతి అప్రస్తుతం. మన నాటకంలో ప్రధానాంశం యిదేనని మరిచావా?"

"సారీ! మీరు నాటకం చూస్తారా?"

"ఇవ్వండి."

కాగితాలు భామ చేతికి అందించింది త్రిపురసుందరి. తొలి పేజీలో రచయిత పేరు చూసింది. "కిరణ్!" అంత ప్రచారంలో వున్న పేరు కాదు. "ఈ రచయిత మీకు పరిచితులేనా?"

“మన ప్రెసిండెంటుగారి సోదరులే. మంచి రచనా కౌశల ముంది ఆయనలో. కాని వ్రాయ రెక్కువగా. మన ప్రెసిడెంటు ఏడాది నుంచి పోరాడి రాయించిన నాటక మిది.”

“కలం పేరనుకొంటాను ‘కిరణ్’ ”

“ఉదయ భాస్కర్ ఆయన పేరు.”

“ఉహూం.” నాటకం చదివించింది భామ. భర్త హోదా చూసుకుని మిడిసిపడుతూ అవిద్యతో, అహంకారంతో ప్రవర్తించే ఒక పడతికీ, విద్యావతియై స్వయం కృషితో స్వంతంగా సమాజంలో ఉన్నత గౌరవాదారాలు సంపాదించుకొన్న మరొక యువతికీ పోటీ. సహజ సంస్కారంగల యువతికే విజయం. పోటీదారుకు అవమానం ప్రాయశ్చిత్తం. ఇతివృత్తం స్పష్టంగా అది.

నాటకం చిన్నది. మగ పాత్రలు రెండు ఉన్నా ఆడవారినే సెలెక్ట్ చేశారు.

నాటకంలో వేయడానికి అభ్యంతరం కనిపించలేదు భామకు. ఉత్సాహంగా ఉంది కూడా.

మహిళా మండలిలో సభ్యత్వం స్వీకరించింది భామ. అక్కడ కలిసిన మహిళల అందాల్లోనూ, మనస్తత్వాల్లోనూ ఎంత వైవిధ్యం కనిపించినా సభ్యతా, సంస్కారాలు కలవారుగానే కనిపించారు భామకు.

కొత్త పరిచయాలతో ఏదో చైతన్యపు వెల్లువ భామ హృదిలో గంతులు వేసింది. మగడి యిష్టానికి కట్టుబడి వీధి గుమ్మం దిగకుండా ఉండిపోతే, తన ఊహలూ, ఆలోచనలూ సంకుచితమైపోయే ప్రమాదం కూడా ఉండేదనిపించింది.

“మీరు ఎక్కడుంటున్నారు?” ప్రెసిడెంటు చంద్రకళ ప్రశ్నించింది.

“శ్యామసుందరి యింటి పక్కనే” భామ సమాధానం చెప్పింది.

“నాటకానికి తొందరగా ప్రిపేరవ్వాలి. ప్రదర్శన దినం వారం రోజులే వుంది. రిహార్సల్‌కు యిక్కడికి రాగల అవకాశం ఉంటే రండి. కాకపోతే మీ హంగు చూసుకొని మీ యింట్లోనే ఏర్పాటు చేయవచ్చు.”

"నాటకం వేయాలన్న ఉత్సాహమైతే వుందిగాని, నిత్యం యిక్కడికి రాగల వీలులేదండీ. ఎందుకంటే మా తోడికోడలు హైస్కూల్ ఇన్‌స్టిట్యూట్‌కు పోతే, పిల్లల్ని పట్టుకోవాలి. ఇంట్లో పని కూడా ఎక్కువగానే ఉంటుంది నాకు."

ఉమ చెప్పింది. "మీ యింట్లోనే రిహార్సల్స్‌కు ఏర్పాటు చేసుకొందామే. నేనూ, రమణీ ఆఫీసువదిలాక అయిదున్నర ప్రాంతంలో వస్తాం. జ్యోతి స్కూలు వదిలాక అదీ వస్తుంది. నర్మద భర్త నెలలో యిరవై రోజులు టూర్‌లో వుంటాడు. ఆవిడకు అభ్యంతర ముండదనుకొంటాను."

అంతా సరేనంటూ తల లూచారు.

* *

"వదినా, మీ చెల్లెలేదీ?"

"పక్కింటావిడ వచ్చి తీసికెళ్ళింది."

"ఎక్కడికీ?"

"మహిళామండలికట."

"పక్కన శనిలా దాపురించిం దొకతె! సిగ్గు విడిచిన ఆడది. దాని సహవాసంతో ఇదీ చెడిపోతూంది" కోపంగా పైకే తిట్టుకొన్నాడు జగన్మోహన్.

రాత్రికి వంట తయారు చేయకుండా వెళ్ళిపోయింది భామ. ఈ ఒక్కరోజే కదాని తాను వంట చేస్తే, పంతగించి రోజూవంట తనకు అంటగట్టి తోడికోడలు షికార్లకు బయల్దేరుతుందేమోనన్న భయంతో వంట గదికేసి వెళ్ళలేదు ఇందిర. పొద్దుగ్రుంకుతున్న కొద్దీ మంటగా అనుకుంది. 'తన నౌకరు ఎవరున్నారనో, ఇంట్లో తయారుగా వండిపెట్టడానికి. దొరసాని తీరికగా చక్కర్లు కొట్టడానికి వెళ్ళింది. అయినా తన నొక్కమాట పిలువకూడదూ, కూడా రమ్మని. అలాంటి చోటికి వెళ్ళడానికి తనంత అనర్హమైన మనిషని అర్థమా?' అనుకుంది కసిగా. శ్యామసుందరి అన్నా మంటగానే ఉంది ఇందిరకు. 'ఏమండీ' అని పలుకరించకపోతే పీడాపాయె. ఓ పురుగును చూసినట్టుగా చూడడం

చెంత తన ఎదుటే ఒకరి మీద ఒకరు పడడం, వికవికలూ ఏమిటో? అదేం స్టైలో? అనుకుంది అక్కసుగా.

మరిది సపోర్టు దొరకగానే మందర అవతారం ఎత్తింది ఇందిర. "నిజంగానే నయ్యా. పక్కింటావిడను చూసి నేర్చుకుంటూంది. కాకపోతే, సంసారం చేసుకొనే దానికి నాటకా లేమొచ్చె? వాళ్ళ రిహార్సలేమోగాని పెద్ద గోల ఈ రోజు. అంతా బరితెగిన ముండలే! ఒకటే అల్లరి కొంపలో."

"అది ఏమన్నా ఏడవనీ. నువ్వు కొంచెం భయం చెప్పాలి."

మగ తూరుడి ననిపించుకున్నాడు జగన్మోహన్. "చెప్పాల్సిందే! ఇలాంటి పరువు తక్కువ పనులజోలికి పోకుండా చెప్పుచ్చుకొని కొడతాను.". బట్టలు మార్చుకుని, మొహం కడుక్కు వచ్చి కూచున్నాడు. టూరునుండి తిరిగి వస్తున్నాడు. సరైన వేళకు తిండి లేక, ఎండ దెబ్బకు అలసటగా, తల నొప్పిగా వుంది. ఇంటికి వచ్చేప్పటికి భార్య యింట్లో లేక, కాస్త టీ పెట్టిచ్చే దిక్కులేక వళ్ళు మండుకుపోతూందతడికి.

ఇందిరకు జ్ఞాపకం లేకపోలేదు, మరిదికి టీ చేసివ్వాలని, కావాలనే చేసివ్వలేదు. భార్య మీద కోపం తారాస్థాయి నందుకోవాలంటే ఈ సమయంలో ఉపశమనాలేవీ అందనీయ కూడదు.

తన కేమీ పట్టనట్టు వాకిట్లో పిల్లలను ముందుంచుకొని కూచుంది ఇందిర.

రాత్రి ఏడవుతుంటే యింట్లో అడుగుపెట్టింది భామ. వారం రోజుల దాక తిరిగిరానన్న భర్త మూడు రోజులకే తిరిగిరావడం కొంచెం ఆశ్చర్య మనిపించింది భామకు. "ఎప్పుడొచ్చారు?"

ముఖానికి పేపరు అడ్డం పెట్టుకొన్న జగన్మోహన్ ఉలకలేదు, పలకలేదు.

'కోపం వచ్చిందేమో!' నిర్లక్ష్యంగా లోనికి వెళ్ళిపోయింది భామ. 'మగవాడు యింటికి వస్తూనే ఇల్లాలు ఎదురు రావాలన్న కోరిక ఎంత సహజమైనదైనా ఇల్లాలి యిష్టాలు గుర్తించి మసలుకోకపోతే

ఎలా? బయటి నుండి తనకంటే ముందు వచ్చాడు భర్త. 'ఎక్కడికి కెళ్ళావు? ఏం సంగతులు? నీ కోసం ఎదురు చూస్తున్నాను' అంటూ చిరు నవ్వుతో పలుకరిస్తే ఎంత బాగుంటుంది. జంట పక్షులు కలిసి కట్టుకొన్న గూటికి ముందు ఎవరొచ్చినా రెండవవారి కొరకు ఎదురు చూడడంలో ఎంత ఆనంద ముంది? ఆడపక్షి మాత్రమే గూటిని కరుచుకు కూచుని, మగపక్షికోసం నిరీక్షించాలంటే న్యాయ మేముంది?"

మారిపోతున్న ఈ సమాజంలో ఆడది బయట ప్రపంచంతో నిమిత్తం లేకుండా నాలుగు గోడల మధ్య బ్రతకాలంటే ఏమైనా సబబైన మాటేనా? తన చర్యను సమర్థించుకొంటూనే భర్త ప్రవర్తనను గర్హించింది భామ.

దుస్తులు మార్చుకొని బాత్‌రూంకు వెళ్ళి వచ్చి వంటగదిలోకి తొంగి చూసింది భామ. ఇటు పుల్ల తీసి అటు వేయలేదు తోడికోడలు. 'పిల్లలు పుట్టకముందే వియ్యపురాలిని సంపాదించుకొన్నాను' విసుగ్గా అనుకొన్నా, శాంతంగానే వంట పనిలో నిమగ్నమైంది భామ.

చిన్నవాడిని చంక నేసుకొని వచ్చింది ఇందిర. బియ్యం కడిగి వంటకు పెడదామనుకొంటే ఎన్ని పావులు పోయాలో తెలియ లేదు. చెప్పి వెళ్ళావు కాదు."

'ఎందుకొచ్చిన నంగనాచి కబుర్లు? సంసారం చేసిన ఆడది కాదూ? కొంచెం హెచ్చు తగ్గులతో ఆ మాత్రం తెలియదూ?' మనసులో చిరాకుగా అనుకొన్నా, పైకి నెమ్మదిగా అంది: "అయితే ఏమైందిలే. చేస్తున్నాను కదా?"

వంటా, భోజనం అయ్యి దాబా ఎక్కేప్పటికి రాత్రి పదిగంట లయింది.

అప్పటి వరకు ఒక్క మాటకూడా పైకి తేలలేదు జగన్మోహన్.

ఒకవిధంగా సంతోషమే కలిగింది భామకు. నాలుగు చీవాట్లు పెట్టినా ఏంకాంతంలో అయితే ఫర్వాలేదు. కాకపోతే, మగడు కొట్టి నందుకు కాదు, తోడికోడలు నవ్వినందుకు- అన్నట్లయ్యేది తన పని.

లాంతరు వెలిగించుకుని, మహిళామండలి లైబ్రరీ నుండి తెచ్చుకొన్న పుస్తకం పేజీలు తిప్పేస్తూ పడుకుంది భామ.

ఏకాంతంలోకి రాగానే పట్టి బలవంతాన తెచ్చుకొన్న నిగ్రహం ఒక్కసారిగా సడలిపోయింది. భార్య చేతిలో పుస్తకం చటుక్కున గుంజి పారవేశాడు జగన్మోహన్.

"చూడగా చూడగా దేనికో లీడరువె పోయేట్టున్నావే!"

"మీ ఆశీర్వాదం ఫలించాలి. మంచిమాటే కదా?"

"నోర్ముయ్! తొండముదిరి ఊసరవెల్లి అవుతూన్నట్లుంది నీ వ్యవహారం. మొగుడంటే ఇంత నిర్లక్ష్యమా?"

"నిర్లక్ష్యం ఎక్కడ చూపాను?"

"వేళకు తిండీ నిద్ర లేక అలసటతో కొంపకు వస్తే, తమరు షికార్లు కొట్టబోయారు. వచ్చాకైనా అతీగతీ పలుకరించావా? కాస్త టీ యిచ్చావా? నా సంగతి నీకెక్కడ పట్టింది? నీ షోకులు, షికార్లు నీ కయ్యాయి."

"నిర్లక్ష్యం నాది కాదు. మీది." పెడసరంగా అంది భామ. "ఎప్పుడు వచ్చారని పలకరిస్తే మీ రెందుకు పలకనట్టు?"

"పొగరెక్కింది నీకు. ఏ పరిస్థితిలోనూ ప్రశ్న నాదీ, జవాబు నీది కావాలి గాని, తారుమారు నేను సహించను."

భామ వ్యంగ్యంగా, తిరస్కారంగా నవ్వింది. "ఆకలివేళ అన్నపూర్ణ. అర్ధరాత్రికి అపరరంభ. ఆ తరువాత అరికాలి క్రింద చీమ. ఇదీ ఆలి కున్న విలువ. ఇలాంటి ఆత్మగౌరవ విఘాతాన్ని సహించే అలవాటు నాకు లేదు.

"వారం రోజులదాకా రానన్న మీ కోసం ఇంట్లో నేనుతపిస్తూ కూర్చో లేదనడం ఏమైనా భావ్యంగా ఉందా?"

"మగడు ఊళ్ళో లేని అదను చూసి విచ్చల విడిగా తిరగ డానికి ఇదే సమయమనుకొన్నావేమో."

"అంత దొంగతనం ఏమొచ్చింది నాకు? మీరు ఊళ్ళో ఉన్నా లేకపోయినా ఒకటే, దెబ్బకొట్టి మనసు విరిచే యిలాంటి మాటలు అంటూంటే."

"ఆ తాడెందుకు మెడలో? తెంచెయ్యి."

"ఎందు కలా కోపోద్రేకంతో ముఖం అందవికారం చేసు కొంటారు? సమరస భావంతో సర్దుకు పోవలసిన విషయాలను సంకు చిత మనస్తత్వంతో రభస కేసి రచ్చ కీడుస్తున్నారు. నావి చెడ్డ తిరుగుళ్ళా? కాలక్షేపం కోసం మహిళా మండలికి వెడుతున్నాను. కొంత సేవా భావంతోనూ కొంత సరదాతోనూ నాటకం వేస్తున్నాం. ఆ పాటి సరదాకు నోచుకోలేదా ఆడజన్మ?"

"చేసేవి సిగ్గులేని పనులు. తెలివంతా ఒలకబోసి సమర్థించు కోవడం. వేషం కట్టి రంగమెక్కితే ఎంత పరువైన విషయమో నువ్వే ఆలోచించు. సరదా అట. సరదా."

అక్కడితో ఆగిపోయింది ఘర్షణ. 'పెంచుకొనే కొద్దీ పెరిగిపో గలదు. అసహ్యంగా;' భామే గాంభీర్యం దాల్చింది.

## 13

చివరిదినం రిహార్సల్ భామ ఇంట్లో హుషారుగా జరుగుతూంది.

ఇందిర టైప్ ఇన్‌స్టిట్యూట్‌కు వెళ్ళింది.

శ్యామసుందరి నాటకంలో లేదు. ఊరికే కూచుని చూస్తూంది.

మగడ్రెస్సులో ఉమ- "అబ్బా! ఏమిటిది, శశీ? పూర్తిగా పల్లెటూరి గబ్బిలానివి. తారు పోసినట్లుగా గుండు అంత నున్నగా వెంట్రుక బయట పడకుండా దువ్వి, మెడమీద నరాలు తేలేట్టుగా జడ బిగించి వేయకపోతే ఏం? అబ్బా! నిన్ను మార్చే దెలాగో తెలీడం లేదు. చెవులమీద, నుదుటిమీద కాస్త ముంగురులు రేపుకొంటే అందం పెరుగుతుందేగాని, తరగదు కదా? అంత అందమైన చీరను పాడుచేశావు. కట్టుకోవడం చేతగాక. తాటి బొమ్మకు చుట్టినట్టుగా అదేం చుట్టడం?...." అమాయికు రాలైన భార్యకు ఫాషన్లు నేర్పి తరువాత పశ్చాత్తాపం అనుభవించే భర్త పాత్రలో జీవించడానికి సాధ్య

మైనంత మట్టుకు కృషి సల్పుతూంది ఉమ.

జగన్మోహన్ వస్తూ గుమ్మందగ్గర టక్కున ఆగిపోయాడు లోపల ఆడ మళయాళాన్ని చూసి.

"రండి. మీరూ చూద్దురుగాని." ఆహ్వానించి, తిరిగి రిహార్సల్‌లో పడిపోయింది ఉమ.

జగన్మోహన్ ఆగలేదు. గడప దగ్గర బూట్లు విప్పేసి లోనికి వెళ్ళిపోయాడు విసవిసా.

అన్యమనస్కంగానే రిహార్సల్ ముగించింది భామ.

భామ మగడి అప్రసన్నత గుర్తించి కొంటెగా నవ్వింది జ్యోతి. "సరదాగా కూచుని చూస్తే ఏం పోయింది?"

వాళ్ళను పంపేసి లోనికి వెళ్ళింది భామ. జగన్మోహన్ మంచం మీద పడుకొని ఏమిటో ఆలోచిస్తున్నాడు.

"అయిందా?"

"ఉఁ."

"మంచి స్నేహితులతోటే జత కట్టావు."

చురుగ్గా చూసింది భామ. "ఏం?"

"సిగ్గు శరం లేని ముండలు."

అతడిని కదిలించి, అతడిలోని సంకుచితత్వపు లోతులు చూడ్డమే అని తెలిసినా, అంత మాటవిని తట్టుకోలేక పోయింది భామ.

"గుడ్డ లిప్పేసి దర్శన మిచ్చారా?" తీవ్రంగా అంది.

"మరి ఏమిటా వేషాలు? పరాయి మగాడి ఎదుట సిగ్గుపడేది పోయి నన్నూ కూచుని చూడమంటారా? దానికి లేకపోతే లేకపోయింది సిగ్గు. నాకుండదూ?"

"సిగ్గుంటే వచ్చే జన్మకు దాచుకోండి. ఆడదై పుడుదురు గాని." చరాలున వెళ్ళిపోయింది భామ.

చిట్టడివిలో చిక్కుకు పోయినట్టుగా ఉంది భామకు.

నాటకానికి టైం అయిపోతూంది.

భర్త మూలుగు వింటూన్న కొద్దీ గుండెల్లో గుబులు పెరిగి

పోతూంది. పరీక్షకు కాకపోతే రాయిలా తిరుగుతున్న వాడికి ఈ నొప్పేమిటి హఠాత్తుగా! ఇది దొంగ నొప్పని తనకు తెలుసు. ఆశా భంగం కలగాలంటే మాటలతో లాభం లేదని ఈ ఎత్తు ఎత్తా రీయన. అలా అని దులిపేసుకొని వెళ్ళిపోలేని సంకట పరిస్థితి.

'నొప్పితో గిలగిల కొట్టుకొంటూంటే కూడా నాటకమని తను వెళ్ళిపోయింది. అది ఆడదా? ఆ తరువాత ఎన్ని మాటలైనా అనడానికి ఆయనకు సందు దొరుకుతుంది!'

భామను కలుపుకొని వెడదామని వచ్చిన శ్యామసుందరి, ఆశ్చర్యంగా "ఏమిటి నువ్వింకా తయారుకాలేదు? ఇప్పటికే ఆలస్యమై పోయింది!" అంది.

"ఏం నాటకమో. ఆయనకు రెండుగంటలనుండి ఒకటే కడుపు నొప్పి. పక్కనుండి కదలడానికి వీలు లేకుండా ఉంది."

"పక్కన కూచుని నువ్వు కడుపు నొప్పి తగ్గిస్తావా ఏమిటి? భలే దానివే! రెండుగంటలనుంచి ఆయన కడుపునొప్పితో అవస్థ పడుతుంటే డాక్టరుకు కబురు పెట్టకుండా నువ్వు బింగరాయల్లే కూచున్నావంటే అదేంమాట?" హడావిడిగా వీధిలోకి వెళ్ళి డ్రైవర్‌ను కేకేసి, "వేగం వెళ్ళి మన డాక్టరుగారిని తీసుకురా. పాపం భలే బాధపడిపోతున్నారు రావుగారు," అంటూ తొందర పెట్టి పంపేసింది. సంగతి తెలిసి చంద్రశేఖర్ కూడా వచ్చాడు. "వాట్ మిస్టర్? కడుపులో నొప్పి ఎప్పటినుండి? ఇదివరకు ఎప్పుడైనా వచ్చేదా?"

చంద్రశేఖర్ ఫ్యాన్లు ఒకరిద్దరు కూడా వచ్చారు.

ఒక నిమిషంలో శ్యామసుందరి చేసిన ఆర్భాటానికి ఇంట్లోనూ, బయటా చిన్న సంత సాగింది.

అయిదు నిమిషాలు మించకుండానే డాక్టరు దిగాడు. పరీక్ష చేశాడు. ఇంజెక్షన్ ఇచ్చాడు. మాత్రలు ఇచ్చాడు. "ఫర్వాలేదు. తగ్గిపోతుంది. తగ్గకపోతే ఉదయం కబురు పెట్టండి నాకు," అని వెళ్ళిపోయాడు.

"లేలే, భామా! త్వరగా తయారవు. మీ ఆయనకేం భయం లేదులే!" భామను త్వరపెడుతూ "ఒక్క గంటలో మీ శ్రీమతిని మీ

ముందు దిగబెట్టేస్తానండీ! డాక్టరు ధైర్యం చెప్పారు కదా? మా వారు పక్కనే ఉంటారు, భామ వచ్చేదాకా. వెళ్ళి వచ్చేదా?'' నిమిషాల్లో భామను తనతో బయల్దేరదీసింది శ్యామసుందరి.

ఇంటిముందు కారులో కూచున్నాక నవ్వుతూ భామ భుజంమీద చేయివేసి అడిగింది. "నిజంగా నొప్పే మీ ఆయనకు?''

ఏమౌతుందో నన్న బెంగ ముఖంలో చిందులేస్తుంటే అయో మయంగా, మరబొమ్మలా శ్యామసుందరిని అనుసరించిన భామ కొంచెంగా తెప్పరిల్లుతూ చిన్నగా నవ్వేసింది. "కాదనడానికి నిదర్శనా లేమున్నాయి?''

ముగ్గువేసి అందులో బంధించా ననుకుంటున్న తన భార్యను తనను మించిన మంత్రగత్తె వచ్చి చిటికలో తనతో మాయంచేసి ఎత్తుకుపోయినట్టుగా తోచింది జగన్మోహన్‌కు; భామను తీసుకుపోయిన శ్యామసుందరిని తలచుకొంటే! అక్కడ నాటకంలో నటిస్తూన్న భామను ఊహించుకొంటూంటే మనసులో చిరచిర నిండిపోయింది. అసలు ఆడదాన్ని చూస్తేనే లేని వెర్రి పుట్టుకు వస్తుంది మగాడికి. కొంచెం అందంగా ఉన్న ఆడది కనబడితే వెర్రికోతే అవుతాడు. అందితే ఫల హారం: అందకపోతే లొట్టలు వేసి ఆనందిస్తుంటాడు. అందుకే తన భార్య బయటికి వెడితే తనకు కష్టంగా ఉంటుంది.

అలాంటిది, పరువుగల కుటుంబములోని యువతి స్టేజి ఎక్కి నటించడమా పదిమంది ముందు? గౌరవమేం నిలుస్తుంది?

సైతానులా ఆ శ్యామసుందరి జతపడబట్టి గాని, తన భార్య మరీ ఇంత బరితెగించే మనిషికా దనిపించింది జగన్మోహన్‌కు. ఇల్లు మార్చితే బాగుంటుందనిపించింది గాని, అంత గాఢస్నేహం పెనవేసు కొన్న ఆ ఇద్దరూ ఎప్పుడో ఒకప్పుడు కలుసుకోరన్న ఇది ఏముంది? మరి ఏం చేయాలో పాలుపోలేదు అతడికి. ఆలోచించి చివరికి నిర్ణ యించుకొన్న దొక్కటే. నోటిమాటకు బెదరని మనిషి దెబ్బకులొంగు తుందేమో నన్న ఆశ!

*　　　*　　　*

భామకు అయిదోనెల వెళ్ళిపోతుందనగా తమ్ముడు వచ్చాడు

తీసుకుపోవడానికి. వారం రోజుల భాగ్యానికి వెళ్ళడ మెందుకు అనుకుంది గాని, ఇంట్లో చాకిరీతో, భర్త అనవసరపు చిరచిరలతో ఊపిరి సలపనట్లుగా ఉండి, వెళ్ళడానికే నిశ్చయించుకుంది.

"ఆ తంతేదో జరిపించుకొని వారం తిరగకుండానే వచ్చేయాలి," అన్నాడు భర్త.

"తంతేమిటి?" ఒళ్ళు మండిపోయింది భామకు, "అసహ్యంగా ఎందుకలా మాట్లాడతారు?"

"సీమంతమేమో!" నవ్వాడు. అందుకే కదా ఇప్పుడు తీసి కెళ్ళడం? ఏకంగా పురిటికి తొమ్మిదోనెలలో తీసికెళ్ళమంటే విన్నాడు కాదు మీ నాన్న. ఏమిటో అర్థం పర్థం లేని వెధవ సంప్రదాయాలు."

స్త్రీ జీవితంలో కమనీయ ఘట్టాలు ఇలాంటివే. వాటిని చులకన చేసి, హేళనగా మాట్లాడితే ఆడదాని మన సెంతగానైనా మండిపో తుంది.

పైకి మౌనమే వహించింది భామ, మోటు మనుషులతో మాటలు పెంచుకోవడం ఎంత మూర్ఖతో తెలుసు గనక.

తొలిసారిగా భర్త దగ్గరికి కాపురానికి వచ్చి, తిరిగి పుట్టింటికి వెడుతున్న ఈ తరుణంలో భర్త విరహం ప్రకటిస్తాడేమోనని ఆశించిన భామకు ఆశాభంగమే అయింది.

బస్సులో ఎక్కాక, "వారం రోజులు మించకుండానే వచ్చే యాలి చూడు. వదినా, పిల్లలు- ఇబ్బందిగా ఉంటుంది నాకు," అన్న ఆజ్ఞే దక్కింది. అదే మాట ప్రేమ పూర్వకమైన అర్థింపు అయితే ఎంత బాగుంటుంది?

బిడ్డ నెత్తబోతున్న భామకు పుట్టింట్లో వారంరోజులు పూల మీద గాలిలా హాయిగా చిటికలో గడిచిపోయాయి.

తల్లి ఎంత ఆనందంగా, ప్రశాంతంగా ఉంటే కడుపులో బిడ్డ అంత ఆరోగ్యంగా ఎదుగుతుందుట.

అక్కడున్న వారం రోజులూ ఏదో పండగలాగే జరిపారు. తల్లీ తోబుట్టువులూ.

పోస్టువేళ కొద్దిసేపు వాకిట నిలబడితే చాలు, "విరహపత్రం కోసమేనో" అని వెక్కిరిస్తుంది చెల్లెలు.

కొద్దిగా ముఖం ముడుచుకుంటే సరి, "బావగారి కోసమా?" అని దీర్ఘం తీసి నవ్వుతాడు అన్న.

ఇదివరకు విమలక్కకు జరిగిన అనుభవాలే ఇవి. అప్పటికి తన వయసు ఈ చెల్లెలు వయసే. ఇలాంటి పరిహాసాలే అప్పుడు తను చేసేది. కాని, విమలక్కకూ, తనకూ వైవాహిక జీవితంలో గల తేడా వీళ్ళకేం తెలుసు?

అక్కడ రాఘవేంద్ర కలవడం, పాప సంగతీ చెప్పింది భామ.

"వెళ్ళేప్పుడు తిరిగి తీసుకు వెళ్ళేదానివి. పాపను తీసుకురాక పోయావా?" అంది తల్లి.

"వచ్చేప్పుడు వెళ్ళా నమ్మా. బావను పంపించమని అడిగాను. ఈసారి ఏదైనా శుభకార్యం అవుతే పాపతో వస్తానులే. ఇప్పుడు వద్దు అన్నాడు బావ."

"దాన్ని నీతో పంపితే ఏమయ్యేది?"

"తల్లిని పోగొట్టుకొన్న ఈ చోటికి పాపను పంపాలంటే అదోలా ఫీలవుతున్నట్టుంది ఆయన. నేనూ బలవంత పెట్టలేదు." పాప పోలికలూ, ఆట పాటలూ, తెలివి తేటలూ అన్నీ అడిగి అడిగి చెప్పించుకొని కంట తడిపెట్టింది భామ తల్లి. పోయిన బిడ్డ జ్ఞాపకాలు మనసును కలిచి వేస్తూంటే.

తమ్ముడిని వెంటబెట్టుకొని తిరిగి భర్త దగ్గిరికి వెళ్ళే వరకు కూడా భర్తనుండి ఒక ఉత్తరం ముక్కకూడా రాలేదు. 'హృదయం లేని మనిషి!' ఎన్నో సార్లు తిట్టుకుంది భామ.

భామ ఇంత తొందరగా వెళ్ళడం ఎవరికీ ఇష్టంలేదు.

"బావను రానీవే, ఇంత అర్జంటుగా పోకపోతే ఏం?" అన్నాడు పెద్దన్న.

"ఊహుఁ వెళ్ళాలి," అంది భామ. మొదటే, మనస్పర్ధలతో తమ మధ్య ఉండవలసిన అనురాగ బంధం సన్నగిల్లుతూన్న ఈ తరుణంలో మరింతగా, అనవసరంగా భర్తను రెచ్చగొట్టడం యిష్టంలేదు

భామకు. భర్త ఆజ్ఞకు భయపడికాదు. సాధ్యమైనంత మట్టుకు సర్దుకు పోయే మనస్తత్వం ఉన్నందువల్ల.

చిన్నవదిన వెక్కిరించింది. "ఆరు నెల్లయినా సరిగా కాలేదు. అప్పుడే ఎంత మమకారమో కాపురమంటే."

కంట తడిపెడుతూనే సాగనంపింది తల్లి. "వేవిళ్ళతో ఏం తింటుందో ఏం లేదో. మళ్ళీ దాని ప్రాణానికి తోడికోడలి సంతొకటి వచ్చిపడింది. అత్తారింటి కాపురం. చచ్చినట్టుగా చాకిరీ చేయక తప్పదు. తొలి చూలు. ఉంచుకుని- మా ముద్దు ముచ్చట్లు తీర్చుకొనేట్టు లేదు. ఒకింటి కిచ్చాక మా దేముంది? నయా పైసంత అధికారం లేదు."

భామ కాపురంలో మార్పేమీ లేదు.

భామ మనస్తత్వంలో మాత్రం మార్పు వచ్చింది. భర్త మాటకు గౌరవం యివ్వవలసిన చోట ఇస్తుంది. అనవసర అధికారానికి మాత్రం తలొగ్గడం లేదు. భర్త అదుపాజ్ఞలు పక్కకునెట్టి తన ఇచ్ఛానుసారం నిర్భయంగా ప్రవర్తిస్తుంది.

*　　　　*　　　　*

దగ్గు, ఆయాసం, ఎక్కువయ్యా యని మామగారూ, కీళ్ళ నొప్పులు పట్టుకొన్నాయని అత్తగారూ పెద్ద డాక్టరు దగ్గరికి వైద్యం కోసమని వచ్చారు. పండగకని ఒక్కగానొక్క ఆడబిడ్డకూడా వచ్చింది, అయిదుమంది పిల్లల్లో పెద్ద పిల్లలు ముగ్గుర్ని అక్కడే వదిలేసి, ఇద్దరిని తీసుకొని.

ఇద్దరికని తీసుకొన్న చిన్న ఇల్లు. అంత మందితో ఊపిరిసలప నట్టుగా అయింది భామకు. ఇహ పని సంగతి చెప్పాలా? ఉద్యోగం చేయబోతున్నాను. నాకేమిటి లెఖ్ఖ అన్నట్టుగా ఉండే ఇందిర తన పిల్లలకు చేసుకోవడం తప్ప, తోడికోడలికి ఒక్క పనిలోనూ సాయం రావడం లేదు.

"కొడుకును కంటానంటే వదిలేది లేదు. మా చిన్న వాడికి పెళ్ళాన్ని యివ్వాలి!" అంటూ పరిహాసాలాడే ఆడబిడ్డ ఇప్పటినుండే వియ్యపురాలి హోదా ఒలకబోస్తూంటుంది. ఆవిడ పూచికపిల్ల తీసి అటువేయదు. ఎవరు తప్పించుకున్నా గృహిణికి తప్పేదేముంది?

చాకిరీతో నడుం విరిగి పోతూంది భామకు. సమయంవస్తే చేయవలసిందే. కాని- "అబ్బా! పనితో అలసిపోతున్నావు కదూ?" అంటూ- ఓ చల్లని ఓదార్పుకోసం హృదయం తహతహలాడి పోతూంటుంది భామకు. జగన్మోహన్‌కు భార్యకష్ట సుఖాలు గుర్తించగల తెలివి లేనట్టే ఉంది. ఎద్దు జన్మ ఎత్తాక చాకిరీ దానికెంత సహజమో, ఆడజన్మ ఎత్తాక ఈ గొడ్డు చాకిరీ అంతే సహజం! అన్నట్టుగా ప్రవర్తిస్తుంటాడతడు.

పని ఎక్కువై అలసటతో సన్నగా జ్వరం తగిలినా, ఒంటిమీద చెయివేసి సానుభూతిగా నిట్టూర్చే తోడు కరవై బాధతో నిద్రపట్టక నిశ్శబ్దంగా ఏడుస్తూంటుంది భామ.

"ఎవరు బాబూ?"

తల్లి మాటవిని తలెత్తి చూశాడు జగన్మోహన్.

"బాగున్నారా?" అంటూ వచ్చి కుర్చీలో కూచున్నాడు రాఘవేంద్ర.

"ఊఁ. చాలా రోజులకు కనిపించారు," అంటూ, అతడిని తల్లికి పరిచయం చేశాడు జగన్మోహన్.

"మరదలు ఇక్కడే ఉందా?"

"ఊఁ. జ్వరం వచ్చిపడుకొంది," వొంగ జ్వరం అన్నట్టుగా నిర్లక్ష్యంగా దీర్ఘంతీసి చెప్పిందావిడ.

"ఎప్పటినుండి? డాక్టరుకు చూపించారా?"

అతడి ఖంగారు, ఆత్రంచూసి చిరచిరగా అనుకొన్నాడు జగన్మోహన్- "మగణ్ణి. నాకులేని తత్తరపాటు ఈయన కెందుకు? ఏమైనా పొరుగింటి పుల్లకూర రుచి మగవాడికి ఎక్కువ కదూ? పెళ్ళాం కూడా లేదు."

కొద్దిసేపు మాట్లాడి లోపలికి వచ్చాడు రాఘవేంద్ర. "సత్యా!" భామ ముఖం మీదినుండి దుప్పటి తీసింది భామ అత్తగారు.

ఎర్రగా కందిపోయిన ముఖంతో సరిగ్గా తెలివి లేకుండా పడి ఉంది భామ.

ఆగలేక, చనువుగా భామ చెయ్యి అందుకొని చూశాడు రాఘవేంద్ర. "ఒళ్ళు పేలిపోతూంది. డాక్టరుకు చూపించలేదూ?"

"గదిలో ఉక్కగా ఉంది. దుప్పటి బిగించి పడుకొంది. ఒళ్ళు వెచ్చగా కనిపిస్తూందేమో! అంత జ్వరం ఎక్కడిది?" విడ్డూరంగా దీర్ఘం తీసింది అత్తగారు.

"భలే అత్తగారేనే సినిమాలో సూర్యకాంతంలా?" హాస్యంగా ఎదుర్కొందా మనుకొన్నాడుగాని, లేనిపోని నిష్ఠూరం తెచ్చుకోవడ మెందుకని ఊరుకున్నాడు. "సత్యభామా!" పిలిచాడు మళ్ళీ.

"జ్వరంబాగా ఉన్నట్టుంది, జగన్మోహన్! డాక్టర్ని తీసుకు రాక పోతే ఎలా? ఉత్తమనిషి అయితే పోనీ అనుకొన్నా...."

"అంత అపురూపం పనికిరా దబ్బాయ్! చివరికి ముంచుకోవడం తప్పితే. చూసీ చూడనట్టు పోవాలి. జ్వరంవస్తే అలాగే పట్టుకొని ఉంటుందా? ఒక పూట లంఖణం తీయిస్తే మాపటికల్లా తగ్గిపోతుంది." విమలను అపురూపంగా చూసుకొని ఆమెను పోగొట్టుకొన్న సంగతి గుర్తు చేస్తూ అందావిడ.

డాక్టర్ని తీసుకువచ్చి చూపాలని ఉంది కాని, పూర్తిగా అపార్థానికి తావిచ్చినట్టేనని జంకాడు రాఘవేంద్ర. జ్వరం వచ్చిన మనిషిని అలా ఎడ్డె మనుషుల మధ్య వదిలేసి వెళ్ళాలంటే బాధగా ఉంది కూడా.

అర్హతలేని అనురాగాలు అనర్థాలకు దారి తీస్తాయి కదా?

"మాపటివేళ జ్వరం తగ్గితే సరే. కాకపోతే డాక్టరుకు చూపించండి. ఉత్తమనిషికాదు కదా?..." ఒక బంధువుగా సలహా యిచ్చి వెళ్ళాడు.

"ఈయన కేమిటో అంత ఇది? కట్టుకొన్న మగణ్ణి నాకు తెలియదేమో!" చిరచిరగా అన్నాడు జగన్మోహన్

# 14

నీరసంగా పడుకుని ఉంది భామ. నిన్నంతా లంఖణం.

ఈ ఉదయం డబుల్ రొట్టే, పాలూ తెప్పించాడు జగన్మోహన్.

"తొందరగా వంట ముగించి, అవతల పడదామంటే ఒక్కటీ తొందరగా దొరికి చావదు!" వంటింట్లో అంట్ల గిన్నెల దడదడలూ! తోడికోడలి చిరచిరలూ!

భామచేసి పెడుతూంటే వంట అలవాటు తప్పి సుఖానికి మరిగిన ప్రాణం వంటమీద పడేసరికి చిరాకుతో చిందులు వేస్తూంది ఇందిర. ఏ డబ్బాలో ఏ సామానుందో తెలియదు. అన్నీ వెదుక్కోవాలి! ఆ విసుగులో అనవసరంగా పిల్లల్ని చావ బాదేస్తూంది.

తోడికోడలి ఆర్భాటం గ్రహిస్తూ పక్కమీద పడుకోలేక పోయింది భామ. ఓపిక కూడదీసుకుని లేచి స్నానంచేసి వచ్చింది. "చిట్టిని సముదాయించు పో, అక్కా. పాపం, చావబాదేశావు దాన్ని."

"పప్పు అడుగంటడానికి వచ్చింది. పోపు పెట్టిదించాలి." తరువాత వంట నీ తాత చేస్తాడా అన్నట్టు చూసింది.

"నే చేస్తాలే. వెళ్ళు. నా ఒంట్లో కొంచెం కులాసాగానే ఉంది."

బయట పడింది ఇందిర, ఇంతే చాలనుకొన్నట్టుగా.

సాయంత్రం రాఘవేంద్ర వచ్చాడు, జ్వరం తగ్గిందా అంటూ.

"తగ్గింది." ముభావంగా చెప్పింది

ఆమె ముఖం చూస్తేనే తెలిసి పోతూంది బలవంతంగా లేచి తిరుగుతూందని.

పుట్టింట్లో మల్లె పువ్వులా పెరిగిన ఏ ఆడపిల్లకైనా, అత్తింట్లో అడవి పువ్వులా అలక్ష్యంచేయక తప్పదు. ఎంత అదృష్టవతి అయితేనో అత్తింట్లోనూ అపురూపత దక్కేది!

కొద్దిసేపు మాట్లాడి లేచాడు రాఘవేంద్ర.

"కూచో, బావా, టిఫిన్ తీసుకుని వెడుదువుగాని."

"మెడికల్ షాపుకు వెడుతూ వచ్చానిటు. అమ్మకు రెండు రోజులుగా ఒంట్లో అంత బాగుండటం లేదు, తగ్గకపోతే హాస్పిటల్లో చేర్చాల్సి వస్తుందో ఏమిటో!"

కలవరంగా అడిగింది భామ. "ఏమిటంత సుస్తీ?"

"దగ్గు. చాలా ఆయాసంగా ఉంటూంది."

టిఫిన్ తయారవడానికి ఆలస్యముందని అతడిని ఆపలేదు భామ.

రాఘవేంద్ర లేస్తూంటే, జగన్మోహన్ వచ్చాడుగాని పలకరించ కుండానే లోపలికి వెళ్ళిపోయాడు.

పూర్తిగా జ్వరం తగ్గకుండానే లేచి తిరగడంవల్ల రాత్రి మళ్ళీ జ్వరం తగిలింది భామకు.

రాత్రి డాబా మీద ఏకాంతంలోకి చేరాక—"నేను మా పుట్టింటికి వెళ్ళి వారం రోజులు ఉండి వస్తాను. పని ఎక్కువై అలుపు జ్వరం పట్టుకొంటూంది నన్ను," అనేసింది.

నిరసనగా కొట్టి పారేశాడు ఆమె మాటను. "భలే ఆడదానివే! ఇల్లయ్యాక, చుట్టపక్కాలు రాకుండా ఎలా ఉంటారు? రెండు రోజులు ఒళ్ళు మనది కాదనుకొని ఒంగితే ఎవరిళ్ళకు వాళ్ళు పోయేవాళ్ళే. చుట్టా లొచ్చారని పుట్టింటికి పారిపోతానంటే- మూతి మీద కొడతారు!"

విచిత్రంగా తోచింది భర్త స్వభావం. కొత్త కాపురం చక్క దిద్దడానికి అత్తగారు వస్తానని ఉబలాట పడితే, చూసి చూసి ఖర్చు పెట్టాలన్న వాడు కాదూ ఈయన?

"కొంచెం ఒంటి మీద చెయ్యేసి చూడండి" కోపంగా అంది.

"చుట్టాలు వచ్చారని వచ్చిందా జ్వరం?"

"మనుషులైతే అర్థం చేసుకొంటారు. ఉత్తమనిషి కాదు. ఇంతమందికి చేయడం నా వల్ల కాదంటున్నాను. అర్థంచేసుకోవడం పోయి హేళన చేస్తారేమిటి, అసహ్యంగా?"

"చేతగాకపోతే ఒకచోట కూచో హాయిగా. వాళ్ళే చేసుకుం టారు గాని, చుట్టా లొచ్చారని పుట్టింటికి ఉడాయిస్తానంటే అసహ్యంగా

వుండదూ?'' నిర్లిప్తంగా అన్నాడు.

తను ఒకచోట కూచుంటే చేసేవాళ్ళా వాళ్ళు? అలా చేసేవాళ్ళయితే జ్వరం తగ్గకపోయినా తను లేచి తిరగాల్సిన అవసర మేమిటి? అసలు కట్టుకొన్న వాడికి లేని అభిమానం, అపురూపత తక్కిన వాళ్ళకు ఎలా వస్తాయి? 'అయ్యో! వదినతో చేయిస్తే అన్నయ్య ఏమను కొంటాడో? జ్వరం వచ్చిన మనిషితో చేయించుకుంటే మరిది ఏమను కొంటాడో?' అనుకోడానికి. ఆయనగారి బలం ఎక్కడుంది తనకు? ఆయనకే లోకువయ్యాక తక్కినవా ళ్ళందరికీ లోకువే. నిస్పృహగా నిట్టూర్చింది భామ.

''ఒకపూట పడుకొన్నానో లేదో ఇల్లు అడవిలా తయారైంది. వంటింట్లో ప్రళయమే పుట్టింది. నేను కూచుంటే చేస్తారా వాళ్ళు? మగ వాళ్ళు, మాటలు చెబుతారు ఎన్నైనా.''

''మళ్ళీ వచ్చాడే మీ బావ?''

''రాకూడదా?''

''చెయ్యి పుచ్చుకు చూశాడా జ్వరం?''

''ఊహుం. ఊరికే అడిగాడు జ్వరం తగ్గిందాని,'' కోపాన్నీ, అసహ్యాన్నీ అణచుకొని నిదానించి చెప్పింది.

''నువ్వంటే అంత అభిమానం ఉన్నవాడు నిన్నే పెళ్ళి చేసుకో లేకపోయాడా?''

''చేసుకొనేవాడట'' నిర్లక్ష్యంగా నవ్వింది భామ. ''మా అక్క పోయినప్పటికి నేను చిన్న పిల్లను. అలాంటి ఊహ అతడికి కలుగ లేదు. వయసొచ్చాక అంతా విమలక్క పోలికలే వచ్చాయి నాకు. నీ పెళ్ళి కాక ముందు చూసి వుంటే నా పెళ్ళానివి అయ్యేదానివి— అన్నాడు బావ.''

దెబ్బ తగలవలసిన చోటే తగిలింది! ''ఇలా మాట్లాడడానికి సిగ్గేయడం లేదా నీకు?''

''మీకు లేని సిగ్గు నా కెందుకు?''

'నా కెందుకు సిగ్గు?''

''అన్నదమ్ములైనా ఆ మాత్రం ఒళ్ళు తాకి చూడరా? అక్క

మగడనా యింత అసహ్యంగా మాట్లాడడం? ఏ కల్మషమూ లేనిదాన్ని పట్టుకొని, 'ని న్నెవడో పెళ్ళి చేసుకోలేకపోయాడా?' అనే మగవాడి దెంత సంకుచితత్వమో, జుగుప్సాకరమో నేను చెప్పాలా?''

''బయట తిరగడం ఎక్కువై, కూతలు నేర్చావు.''

మగడి అరుపుకు సమాధాన మివ్వకుండా అటు తిరిగి పడుకుంది భామ.

*   *   *

ఒంటరిగా మిగిలిపోయింది భామ, ఇంట్లో. సినిమాకు వెళ్ళా రంతా. పని కాలేదని భామ యింట్లోనే వుండిపోయింది. భర్త ఈ మధ్య పెందరాళే యింటికి రావడం లేదు, షైరుకంటూ వెళ్ళి.

వంటపనీ అదీ ముగించుకుని గేటులోకి వచ్చి నిలబడింది భామ.

ఇలా నిలబడగల తీరిక కలిగి ఎన్నాళ్ళయిందో?

ఏమిటో—తనకు సమ్మతం కాని జీవితం అనుభవించాల్సి వచ్చింది. పెరట్లో, ఇంటి ముందరా కూడా తనెంతో మక్కువగా పెంచుకొన్న తోట పాడుబడింది. ఇంట్లో పనితోటే సరిపోతుంది. వాటి వైపు చూడడానికే తీరిక ఉండదు. ఇల్లు నీటుగా వుంచుకోవాలని ఎంత అనుకొన్నా ఏమిటో చీదరగా తయారవుతుంది.

మగడన్నట్టుగా, ఇల్లు సంసారమంటూ ఉన్నాక చుట్టపక్కాలు రాకుండా, పోకుండా వుండరు. గృహిణిగా తన ధర్మం తనకు తెలుసు. చేతనైనంత మట్టుకు చేయవలసిందే. కాని, సానుభూతి లేని చాకిరి ఎంత మటుకు చేయగలరు?

''పాపం! రోజంతా పనితోటే సరిపోతూంది. ఓ మంచి పుస్తకం చదువుకోడానికైనా సమయం దొరకడం లేదుకదూ?'' అన్న ఆర్ద్రమైన పలుకే ఆయన్నుండి కరవైతే హృదయ మెంత రగిలి పోతుంది? అతడి ఇల్లాలిగా మోస్తున్న బరువు కాదూ ఇది?

సంసారమంటే స్త్రీ పురుషులు కలిసి జీవించడమేనా? మరో బంధం, అనుబంధం ఏదీ వుండనవసరం లేదా?

తన సంసార రథాన్ని ఎంత అందంగా అలంకరించాలని కలలు కన్నదో అంతగా భంగపడుతూంది భామ, నిరసనగా, నిరా

దరణలతో నిండిన భర్త ప్రవర్తన వల్ల. సంసారమంటే విరక్తి పుడుతూంది.

పాపతో పార్క్‌కు వెళ్ళి వస్తున్న శ్యామసుందరి పలకరించింది. "ఒక్కరే ఉన్నారా?"

"ఉఁ. వాళ్ళు సినిమాకు వెళ్ళారు. ఆయన లేరు."

"మరి కాస్సేపు కూచుందురుగాని రండి."

తలుపుకు తాళం పెట్టి శ్యామసుందరితో వచ్చింది భామ.

చంద్రశేఖర్ వాకిట్లోనే పేపరు చూసుకుంటున్నాడు. అక్కడికే మరో రెండు కుర్చీలు తెప్పించింది శ్యామసుందరి. "కూచోండి. గుడ్డలు మార్చి వస్తాను."

పేపరు పక్కకు తీసి చిరునవ్వుతో పలుకరించాడు చంద్రశేఖర్. "బాగున్నారా? ఈ మధ్య కనిపించడం లేదు?"

చిన్నగా నవ్వి ఊరుకొంది భామ. చుట్టాలొచ్చారని, పనితో సతమత మౌతున్నాననీ- ఆడవాళ్ళ సోదె ఆయన ముందు మొదలు పెట్టడ మెందుకని.

"మీరు బాగా నటించగలరట. శ్యామ చెప్పింది. మీరు రేడియో నాటకాల్లో పాల్గొనడానికి ఎందుకు ప్రయత్నించ కూడదూ?"

"ఏమో. మీ స్నేహితుడి కిలాంటి వన్నీ నచ్చవు. మొన్న వేసిన నాటకానికే చాలా రభస చేశారు."

"మీకు వేయాలనే వుందన్న మాట."

"కళలో అభిరుచి, ప్రజ్ఞ ఉన్నప్పుడు యింకా పెంపొందించు కోవాలనీ, పైకి పోయి పేరు తెచ్చుకోవాలనీ ఎవరికి ఉండదు? ఆయనకు ఇష్టంలేనప్పుడు అలాంటివి ఎలా సాధ్యం చెప్పండి? సాధారణ గృహ జీవితమే తప్ప అలాంటి వేవీ ప్రాప్తం కావని ఊరుకొంటున్నాను."

"ఇక్కడే వస్తుంది నాకూ, సత్యభామకూ పోట్లాట," ట్రేలో షరబత్ గ్లాసులతో వచ్చిన శ్యామసుందరి చురుగ్గా అంది: "మీలో కళావికాసానికి అతడి సంకుచిత మనస్తత్వం అడ్డుపెడుతూంటే ఆగి పోవడమేనా ఉత్తమ స్త్రీత్వం?"

"ఉత్తమ స్త్రీత్వం కాదు. ఉత్తమ గృహిణీత్వం. వీటన్నిటి కంటే నాకు సంసారం అంటే ఇష్టం, గౌరవం కాని, సంసారానికి మచ్చరాకుండా ఇలా విజ్ఞానాన్నీ, కళలనూ వికసింప జేసుకోవడం కూడా ఇష్టమే. రెంటికీ పొసగనప్పుడు వాటికోసం సంసారం వదులు కోవాలన్న ఉద్దేశం నాకులేదు. అవకాశం ఉనప్పుడే వాటికోసం ప్రాకులాట."

"అక్కడ నిల్చున్నారేం? రండి, రావుగారూ!" చెయ్యెత్తి పిలిచింది శ్యామసుందరి.

గతుక్కుమంది భామ. గేటులో రానా, పోనా అన్నట్టుగా నిల బడ్డ జగన్మోహన్‌ను చూసి.

వచ్చి క్షణం కూడా ఆగకుండా, తాళం చేతులివ్వు!" అన్నాడు.

"కూచోండి ఇద్దరూ కలిసి వెడుదురు గాని. ఒక్కతే ఉంటే కాస్సేపు కూచుందువుగాని అని నేనే పిలిచాను."

ఏదో మర్యాదకోసం అన్నట్టుగా కూర్చున్నాడేగాని, వీళ్ళ సంభాషణలో ఒక్కమాటకూడా కలపలేదతడు. మరో గ్లాసు షరబత్తు తీసుకు వచ్చింది శ్యామసుందరి; తీసుకోండి."

భామకూడా స్వేచ్ఛగా మాట్లాడ లేకపోయింది, భర్త ఎదుట. పరాయి పురుషుడైనా నిష్కపటి, సరళంగా సంభాషించగల చంద్ర శేఖర్‌తో మాట్లాడడానికి అంతగా బిడియపడదు, కాని, భర్త మన స్తత్వం, భావాలు తనకు తెలుసు. పిల్లి ఎదుట ఉండగా ఎలుక ఆటలుకట్టినట్టుగా ముడుచుకుపోయి కూచుంది అక్కడున్న ఆకాస్సేపూ.

తలుపు తాళంతీసి లోపలికి అడుగు పెడుతూనే కటువుగా అడిగాడు జగన్మోహన్: "ఈ మగ స్నేహా లెప్పటినుంచీ?"

అనుకుంటూనే ఉంది భామ, ఇలాంటి సంఘటనను ఎదుర్కోవలసి వస్తుందని. "చాలా రోజులనుంచీ." చాలా శాంతంగా జవాబిచ్చింది, అతడిలోని మృగాన్ని రెచ్చగొట్టి ఎదుర్కోవాలన్న ఉద్దేశంతో. మృగం గుహలో ఉన్నంతవరకూ భయమే. ఎదుర్కొని హతమార్చాలి. కాకపోతే, తనైనా హతమవ్వాలి.

తను కోరిన సంసారం యిలాంటిది కాదు. కళంకలతో, అస

హ్యామైన అపోహలతో, చావ సిద్ధమైన డొక్కు ఎద్దులతో ఈడ్చుకు వచ్చే బండిలా కాకూడదు తన సంసారం. అలాంటి జుగుప్సా పూరితమైన సంసారం తన కక్కరలేదు, పెళ్ళున కూలిపోయినా సరే.

"చాలా రోజులనుండి అంటే?" అసహనంగా అరిచాడు.

"శ్యామసుందరికోసం వెళ్ళినప్పుడు- కలసినప్పుడు అతడితో మాట్లాడుతుంటాను."

"తన ఆటలకు ఎదురు చెప్పకుండా చెప్పు చేతలలో ఉంచుకోడానికి పరాయి ఆడదాన్ని భర్తకు పరిచయం చేసిందా తార్పుడుకత్తెలా?"

అతడు తీవ్రమైన కోపంతో పళ్ళుకొరుకుతూంటే, చూస్తూనే ఒళ్ళు జలదరించే వికృత మృగంలా తోచాడు భామకు. "సిగ్గేయడం లేదూ, ఇలా మాట్లాడడానికి?"

"సిగ్గు విడిచింది నువ్వు. నాపై ఆఫీసరు. అతడి భార్యతో నీకు స్నేహమౌతే అతడితో మాట్లాడవలసిన అవసరమేమిటి? కావాలని కల్పించుకొనే అవకాశం కాకపోతే?"

"నాతో, మీ అమ్మ అక్కయ్యలతో తప్ప, మరో ఆడజీవితో మీరెప్పుడూ మాట్లాడలేదా? వాళ్ళంతా మీ ప్రేయసులే అయ్యారా?"

"నాన్సెన్స్! మగవాణ్ణి. నాకూ నీకూ సాపత్యమా?"

మగవారే కాదు. నాకు భర్త. నా కష్ట సుఖాలు మీవిగా భరించవలసినవారు. నాపై సంపూర్ణ విశ్వాస ముంచి ఈ సంసారాన్ని నా చేతిలో పెట్టవలసిన వారు. మీరే యిలా అసహ్యాకరమైన మాటలతో దెబ్బ కొడుతూ అవిటిదాన్ని చేస్తూంటే కాపురం దిద్దుకోగలశక్తి నాకెలా వస్తుంది?"

"నువ్వు చేసేవి మంచిపనులా? నీది కాపురం చేసే మొగమా?"

"కాకపోతే, అతడితో మాట్లాడినంత మాత్రాన పోయిన శీలమేమిటో?"

"శీలమంటూ ఒకటి ఏడిస్తే కదా. దాన్ని గురించి చెప్పాల్సింది?" ఛీత్కారంగా లోపలికి వెళ్ళిపోయాడు జగన్మోహన్.

వెనక్కాళ్ళతో గాడిద తన్నినంత బాధ కలిగింది భామకు.

'ఈ మగవా ళ్ళింత సంకుచితంగా ఎందుకుంటారో? పరాయి మగా డితో మాట్లాడినంత మాత్రాన పోయే శీలమా ఆడదానిది?'' వేడిగా నిట్టూర్చింది.

పరుపు చుట్ట పట్టుకెళ్ళి డాబా మీద పడుకుంది భామ, అన్నం పెట్టడానికి పిలిచినా వెళ్ళకూడదన్న పంతంతో.

కొద్దిసేపు చూసి వచ్చాడు జగన్మోహన్. ''అమ్మా వాళ్ళంతా ఎక్కడి కెళ్ళారు?''

''సినిమాకు.''

''నువ్వెందుకు వెళ్ళ లేదు?''

''పక్కింటి చంద్రశేఖరంతో ఊసులాడాలని.''

కస్సు మన్నాడు. ''జవాబులు తిన్నగా రానీ. వెధవ నీలుగుడు సహించను.''

అతి వినయంగా చేతులు కట్టి స్వరాన్ని వణికిస్తూ— ''సిని మాకు వెళ్ళారండీ!'' అంది భామ.

''అంత హేళనగా వుందా నేనంటే?''

''అబ్బే! భక్తిగా.''

విసురుగా వెళ్ళిపోయాడు జగన్మోహన్.

## 15

''చాలారోజులకు వచ్చారు? ఊళ్ళో లేరా?'' మహిళామండలి ప్రెసిడెంటు చంద్రకళ అడిగింది.

''ఉన్నాను. చుట్టా లొచ్చారు. ఈ రోజూ తీరిక కాలేదుగాని బలవంతాన బయట పడ్డాను.'' చెప్పింది భామ.

ఉమ ఏవో కాగితాలు నింపుతూంది. ''ఏమిటే అవి?''

''ఎస్. ఇ. వొ. ట్రెయినింగ్‌కు అప్లికేషన్ పెడుతున్నాను.''

''నువ్వు చేసున్న జాబ్ ఏమైంది?''

"నాకు, నా ఉత్సాహానికి సరిపడింది కాదు." నువ్వూ యింట్లో ముద్దరాలిలా కూచోకపోతే ఓ అప్లికేషన్ పడేయరాదూ?"

'ఆయన ఒప్పుకోరు,' అనలేకపోయింది భామ. ఒప్పుకోరు. తనూ ఓ హృదయమున్న మనిషిగా బ్రతకడం ఆయన ఒప్పుకోరు. ఎంతకని తల ఒగ్గడం? రాతి క్రింద మొక్క సూర్యరశ్మి లేక పాలి పోయినట్టుగా ఎన్నాళ్ళని అతడి బలదర్పాల క్రింద అణగిపడి ఉండడం?'

సాహసించి ఉమ దగ్గర అప్లికేషన్ ఫామ్ పుచ్చుకుంది భామ. 'ఆర్థిక సమానత్వం లేకపోవడం కూడా స్త్రీకి దాస్యాన్ని తెచ్చిపెడు తూంది. తనూ ఓ ఉద్యోగిని అయి సంపాదించగలిగిన రోజు అతడి పై ఖరి ఎలా వుంటుందో చూడాలి' చిన్నగా నవ్వుకొంది.

"నమస్కారమండీ."

ఉమ గొంతు విని అప్లికేషన్ ఫామ్‌లు పరిశీలించడం ఆపి తలెత్తింది భామ. గుమ్మంలో నిలువెత్తు విగ్రహం. ఉదయ భాస్కర్! నాటక ప్రదర్శన రోజు అతడి పరిచయమైంది భామకు.

చిరునవ్వుతో ప్రతి నమస్కారంచేసి వచ్చి కూచున్నా డతడు.

మండలి చిన్న కుటీర పరిశ్రమ నడుపుతూంది. అక్కడ తయా రైన వస్తువులు మార్కెట్‌లో సేల్ కావడానికి ఎక్కువగా సహాయ పడుతుంటాడు అతడు. అదీగాక, మండలికి పెద్ద మొత్తం విరాళ మిచ్చేది కూడా అతడే. పెద్ద కంట్రాక్టరు. రెండు చేతులా ఆర్జిస్తుం టాడు. పెళ్ళాం సంసారంలేదు.

కాలాన్ని ఖులాసాగా గడిపేసే రకంగా అగుపడతాడు. అలాంటివాడు చక్కని ప్రయోగాత్మకమైన రచనలు ఎలా చేయగలడో ఆశ్చర్య

అక్కగారితో మాట్లాడ్డం ఆపి యిటు తిరిగాడు. "దేనికి ఆ ఫామ్‌లు?"

ఉమే చెప్పింది.

"కావాలని ఏదో సాంఘిక సేవ చేయాలంటే అవకాశాలు తక్కువ ఆడవాళ్ళకు. ముఖ్య సేవికనో, గ్రామసేవికనో వెడితే బోరా

డన్ని అవకాశాలు. కార్య దక్షత వుండలే గాని మహిళల ఉన్నతికి, సంస్కారయుతమైన మార్పులకు ఎంతగానైనా ప్రయత్నించవచ్చు."

"అందుకే, నా ఎల్. డి. సి. జాబ్ వదిలేసి దీంట్లో జొరబడుతున్నాను." ఉత్సాహంగా చెప్పింది ఉమ.

"మీరూ!"

"ట్రై చేద్దామని," పేలవంగా నవ్వింది భామ, భర్త సంగతి గుర్తు వచ్చి.

కొద్దిసేపు ఆగి, అన్నాడు ఉదయ భాస్కర్: "మీరు చాలా చక్కగా నటించారు, మొన్నా నాటకంలో. మీ సహజ నటనా చాతుర్యంతో ఆ పాత్రకే జీవం వచ్చింది. మీరు తరుచుగా నాటకాలలో ఎందుకు వెయ్యకూడదూ? మీరు అతి సునాయాసంగా తారస్థాయినందుకోగలరు!"

"మీకు ఎవరైనా సినిమా ప్రొడ్యూసరు తెలుసాండీ? ఆవిడకు సినిమా ఛాన్సు ఇప్పిద్దురూ!"

ఉమ పరిహాసానికి విసుక్కొంది భామ. "చాల్లే, ఊరుకో! అలాగేనా మాట్లాడేది?"

"నిజంగా కూడా మీలో కళ దాగి ఉంది. దాన్ని వెలికి తెచ్చి పదును పెట్టి మా బోటివారికి వినోదానందాల్ని ఎందుకు అందించకూడదూ? మూసిపెడితే పాసిపోతుందని ఒక సామెత."

అతడి ప్రశంసకు చిరునవ్వుమాత్రం చిందించి ఊరుకుంది భామ.

"నా దగ్గర మరో నాటకం వుంది. నే వ్రాసిందే. మీరు పాల్గొంటానంటే ప్రదర్శనకు ఏర్పాట్లు చేయిస్తాను."

"చూద్దాం లెండి."

భామ మొహమాటం కొద్దీ అంటే గట్టిగా పట్టుకొన్నాడతడు "అక్కయ్యతో యింటికి రండి. నాటకం యిస్తాను. చదివి చూద్దురగాని. పాత్ర అదీ మీకు నచ్చాలి కదా?"

చంద్రకళ పని కట్టేసి లేచింది. "పదండి. మీరు మా యిల్లు కూడా [illegible]."

చెట్ల మీదికి చేరిన పక్షులు సద్దుమణుగుతున్న వేళ వీథిలో దీపాలు వెలిగాయి.

కారు డోరు తెరిచి నిలబడ్డాడు ఉదయభాస్కర్.

ఉమ నవ్వుతూ చెప్పింది: "కారులో వద్దండి, సరదాగా బజారు చూసుకొంటూ వెడతాం."

ముందుకు రెండడుగులు వేసీ వేయక ముందే ఉదయ భాస్కర్ కారు తుర్రున వెళ్ళిపోయింది.

బట్టలషాపుకు దారి తీస్తూ, "కర్టెన్ గుడ్డ తీసుకురావాలి. మొన్న పరిమళ కుట్టిన శివ పార్వతుల షాడో కుట్టు చూశావా? చాలా బాగుంది కదూ? అలాగే ఒకటి నేనూ కుడదామని," అన్నది ఉమ.

"చూశాను. బాలా బాగుంది. నేనూ ఓ గుడ్డ తీస్తాను పద."

"భామకు చాలా కుట్లే వచ్చు. ఈ మధ్య ఓపిక తగ్గి అంతగా కుట్టడం లేదు.

కర్టెన్‌కు గుడ్డ తీసుకొని, రంగు దారాల కోసం మరో షాపుకు నడిచారు.

రంగు దారాలు పట్టుకొని ఇవతలికి వచ్చేస్తూ, ఆశ్చర్యంగా చూపిం దొక దిశకు ఉమ. "మీ ఆయనేకదూ?"

భామ చూసిందటు.

లైటు స్తంబం పక్కగా పువ్వులు కొంటూ జగన్మోహన్—అతడి పక్క మరో ఒప్పులకుప్పా నిలబడి వున్నారు. పువ్వుల దండ కొని ఆవిడ చేతి కందిస్తూ, పూలమ్మికి డబ్బులిచ్చేసి ఆవిడతో కదులుతూన్న భర్తను చూసి; నిస్పృహగా నిట్టూర్పు విడిచింది భామ. 'రాత్రి పది, పదకొండుగంటలదాకా రాకుండా వుంటే ఏ స్నేహితుడింట్లోనో అనుకొన్నాను. స్నేహితురాలన్నమాట!'

"ఆ పిల్ల నాకు తెలుసు. జమున. మీ ఆయన ఆఫీసులోనే టైపిస్టు."

"తను అవివాహితుడిగా నటిస్తూ పెళ్ళిచేసుకొంటానని చెప్పి ఆ పిల్లను మోసగిస్తున్నాడేమో, పాపం."

ఉమ ఊహాగానాన్ని కొట్టి పారేసింది చంద్రకళ. "అదేం

కాదు. వాళ్ళ సంగతి నాకు తెలుసు. వాళ్ళమ్మ భోగం మనిషి. ఆ పిల్ల కారెక్టరు కూడా మంచిది కాదు."

"ఎంత సిగ్గు లేదో? తండ్రి కాబోతున్నాడు! ఆ పిల్లను తాకుతూ ఎలా నడుస్తున్నాడో? రసికత్వ మంతా ఒలకబోస్తూ. ఈ మహా పట్టణంలో ఎలా తిరిగినా ఎవరికీ పట్టదనేమో ఆ తెగువ?

భామకు బాధకంటే ఎక్కువగా ఉన్నది విస్మయం. కట్టుకొన్న దానికి జీవన మధురిమలు చవిచూపలేని మగవాడు పరాయి ఆడదానితో పై లాపచ్చీసు ప్రేమ వ్యవహారమా? ఆ పాటి ప్రణయస్పందన అతడిలో ఉంటుందని తన కెప్పుడూ స్ఫురించనేలేదు. చీకటిలో స్త్రీని ప్రేమించే రకమే తప్ప ప్రేమమూర్తిగా ఎప్పుడూ గోచరించలేదు తనకు!

ఈర్ష్యపడడం తెలివి తక్కువ. భోగం యువతిని ప్రేమించిన

కర్టెన్ గుడ్డమీద శివపార్వతులకు షాడోకి కుట్టుతో చక్కని ఆకృతి నిస్తూంది భామ. ముందు కిటికీలో ఎస్. ఐ. వొ. అప్లికేషన్ ఫారంలు గాలికి రెపరెపలాడుతూంటే భర్తతో జరగబోయే యుద్ధాన్ని ఊహిస్తూ కలవరపడుతూంది. 'ఆయ నొప్పుకోడు. తన పట్టు నెగ్గించుకోవాలంటే, తెగదెంపులదాకా పోవలసివస్తుందేమో!'

రాత్రి పదిగంటలు దాటి వచ్చిన జగన్మోహన్, "మహిళా మండలి సాంగత్య ప్రభావమేమో!" అని వెటకరిస్తూ సమీపించి భార్య చేతిలోని పట్టుగుడ్డ అందుకొని చూశాడు. "గుడ్. చాలా బాగుంది. ఇంట్లో ఉండి ఇలాంటి పనులు చేసుకొంటూంటే ఆడదానికి శోభ. కాని, అదేపనిగా డబ్బు తగలేసేవు దారాలకూ, గుడ్డలకూ."

"మీరేం బెంగపడకండి. నేనూ చూసుకొంటున్నాను సంపాదనా మార్గం."

"అంటే?"

"ఆ ఫారమ్‌లు చూడండి."

చేతికి తీసుకొని చూశాడు. "ఎవరి నడిగి చేస్తున్నా వీ పని?" కస్సుమన్నాడు.

"ఎవరి నడగ మంటారు?"

"నన్ను డగక్కర లేదా?"

"నే నేమైనా కాని పని చేస్తున్నానా ఏమిటి? మీ పాద ప్రదక్షిణం కంటే ఉత్తమమైనపనే. వంటింటి గోడలతో పాటు నేనూ పొగచూరి పోవడం నా కిష్టం లేదు. భుక్తి ముక్తి అన్నట్లుగా కాలక్షేపానికి సాంఘిక సేవ చేసినట్టు అవుతుంది. నాలుగు రాళ్ళు సంపాదించు కొంటాను."

"నేను చచ్చాననుకొన్నావా? చవటననుకొన్నావా?"

"ఎంత మాట? రెండూ అనుకోలేదు. ఉద్యోగం చేయాలని సరదా పడుతున్నాను."

"దేనికి తెగించి ఈ కవ్వింపో తెలియడం లేదు."

"విడ్డూరంగా మాట్లాడతా రెందుకు? మీ వదినగారు సైన్సు ఇనిస్టిట్యూట్‌లో ట్రెయినింగ్ అవుతూన్నదంటే దేనికి తెగించి అంటారు?"

"అతి తెలివి ప్రదర్శించకు. ఒకరి సంగతి నాకు చెబుతా వెందుకు? ఉద్యోగం చేయడం నా కిష్టం లేదని ఏనాడో చెప్పేశాను. నన్ను కవ్వించడంకాక ఏమిటీ పని?"

"మీరు ఎలా అనుకొన్నాసరే. నేను ఉద్యోగం చేయాలనుకొన్నాను. చేస్తాను.

"ఉండ దలచు కొన్నావా? పో దలచు కొన్నావా?"

లేచి నిలబడి కిటికీనుండి అవతలికి చూస్తూ చాలా నిశ్చింతగా చెప్పింది భామ. "ఎలా అయినా సరే."

"తన్ని తగిలేస్తాను ఇంట్లోంచి. బజారు ముండవై ఊరేగక పోతే అప్పుడు చూస్తాను."

"అప్పుడు మీ లాంటి వాళ్ళే దాసులౌతారు."

భార్య వ్యంగ్యహాసానికి తల తిరిగి పోయింది. "ఏమన్నావు?"

"జమునలా షోగ్గా బ్రతక గలను. అగ్నిసాక్షిగా పెళ్ళాడిన నాకంటే అది అదృష్టవంతురాలు కాదూ? ఏనాడైనా పావలా పువ్వులు కొని తెచ్చి తల్లో పెట్టుకొమ్మని యిచ్చారా ప్రేమగా?"

"నీకు నోరెలా వస్తూంది యిలా మాటాడడానికి? సిగులేదూ?"

కళ్ళలో నీళ్ళు తిరుగుతూంటే నిలదీసినట్టుగా అంది భామ: "అయినింటి పిల్లను. అయినింటి కోడల్ని. నేనేం నీతి బాహ్యమైన పనులు చేశావని బజారు ముండలా బ్రతకమని సెలవిస్తున్నారు? ఇంత అన్యాయంగా, అసహ్యంగా మాట్లాడటానికి మీ కెలా నోరు వస్తూంది? మగవాడు ఎలా మాట్లాడినా తప్పులేదనా?"

కొంచెం తగ్గాడు. "జమునకు పువ్వులుకొని పెట్టానని ఎవరు చెప్పారు? అసలు జమున సంగతి ఎవరు చెప్పారు?"

"జమునకు పువ్వులు కొన్నారని ఎప్పు డన్నాను? నాకు తీసు కురా లేదని ఏడ్చానేగాని?"

"వగలెందుకుగాని ఎవరు చెప్పారు?"

"నేనే చూశాను. బయట మీ ఆటలు నా కళ్ళ బడకూడదనే కదా, నన్ను ఇలు పటం గటుకు పడిఉండమని చెప్పేది?"

దొంగకు తేలుకుట్టినట్టుగా అక్కడినుండి జారిపోయాడు జగ న్మోహన్.



మంచంగదిలోనే పడుకుంటాడు భామ మామగారు. ఈమధ్య దగ్గు ఎక్కువై పుస్తకాలు చదివే ఓపిక లేకున్నా, ఎవ రేది మాట్లాడుతున్నా, ఏమిటే ఏమిటే- అని అడగడం మానలేదు. ఇంట్లో ఏం మాట్లాడుకొన్నా, ఏ సంగతి జరిగినా ఆయన్ని వదలిపోకూడదు. ముసలితనం ముదిరి మృత్యువు చేరువవుతున్న కొద్దీ తాపత్రయం ఎక్కువే అవుతూంటుంది మనిషికి.

అలాంటివేవీ పట్టించుకోకపోయినా, మంచంమీద పడుకుని తుపుక్కు తుపుక్కుమని మంచం చుట్టూ ఉమ్మి వేసుకోవడం మాత్రం సహించలేక పోతూంది భామ.

చిప్పలో ఇసుక పోసి మంచం తలదిక్కుగా పెట్టింది. "కింద

ఉమ్మేయకండి, మామయ్యా! ఎవళ్ళైనా ఇంటికి వస్తే అసహ్యపడతారు. దీంట్లో ఉమ్మేయండి. నేను ఇసుక చల్లి తెచ్చి పెడుతుంటా రోజూ!

అనుకోని రాద్ధాంతమే తెచ్చిపెట్టింది చిప్ప.

కొడుకు ఇంటికి వస్తూనే అంతెత్తున విరుచుకుపడింది భామ అత్తగారు. "ఆయనేమైనా క్షయరోగి అనుకుందా? అంటు జాడ్య మనుకొంటా నీ పెళ్ళాం? ఈ రోజు చిప్ప తెచ్చిపెట్టింది. రేపు చెంబు, కంచం వేరుగా పెడుతుంది. మరునాడు ఇంట్లో ఉండకూడదు. ఏ పశువుల కొట్టంలోనో పడి ఉండమంటుంది. దాని చదువు చట్టుబండలు గానూ! ఆరోగ్యసూత్రాలు మాకు తెలియవనుకుందా? ముసలి తనాన దగ్గు పట్టుకుంటే ఇది చిప్ప తెచ్చిపెడుతుందా?"

భామ దురుద్దేశంతో చేసినపని కాకపోయినా, భర్తతో చీవాట్లు తప్పలేదు. "వాళ్ళు చేసే పని నీకు కష్టం కలిగించేదైనా, వాళ్ళను అవమానించే సాహసం ఎక్కడనుండి వచ్చింది నీకు? సర్దుకు పోవల సింది పోయి, పెద్దవాళ్ళ మనసుకు కష్టం కలిగిస్తావా?"

'ఆపాటి విజ్ఞత తనకు లేదా? సర్దుకు పోవలసిన సంగతేనాఅది? మంచం చుట్టూ, ఈగలు పారాడుతూ తెమడ! అన్నం ముందు కూచు న్నప్పుడు కళ్ళముందు కదిలిందంటే వాంతిచేసుకొని లేవాల్సిందే.'

అసలు కపుడుతో ఉన్నవాళ్ళకు వికారా లెక్కువ!

అత్తింట కాపురం కాకపోయినా, నా ఇల్లన్న స్వతంత్ర ప్రతి పత్తి లేకుండాపోయింది భామకు.

చేతనైనంత మట్టుకు చేసి, ఎవరి జోలికి పోకుండా [illegible]లు నెట్టుకొస్తూంది. ఇవాళ చిప్ప మనస్పర్థలకు అంకురార్పణ చేసింది! అన్నీ విపరీతార్థాలే! అన్నిటినీ భూతద్దంలోంచి చూడడమే.

భర్తకు ఏదైనా చెప్పుకొని ఊరట పొందుదామన్నా అక్కడా ఎదురయ్యేవి చీవాట్లే.

"ఆడబుద్ధి కదూ? మగడి మనసు మార్చి, పుట్టింటివైపు అను బంధాన్ని పటిష్ఠం చేయడానికి, మనసు విరిచి అత్తింటివైపు అనురాగ బంధాన్ని త్రుంచడానికి ప్రయత్నం చేస్తుంటారు మీ ఆడవాళ్ళు! అవి చెప్పుడు మాటలకు చెవులప్పగించే చవటను కాదులే. చదువుకొన్న

వానివి కదా? సమరసభావంతో సర్దుకుపోవడం చేతగాక నాదాకా తెస్తా వెందుకు మీ తగవుల సంగతి?"

"నిజంగా బుద్ధి లేకే!" కోపంగా అనుకొని మనసులో లెంపలు వేసుకొంది భామ. 'మీ లాంటి మగడితో కష్టసుఖాలు చెప్పుకోవలసిన వారు కాదని తెలిసిపోయినా, ఏదో ఊరట పొందాలని చెప్పుకోవడం ఎంత తెలివి తక్కువ?'

* * *

రాఘవేంద్ర ఇంటికని బయల్దేరింది భామ. మొన్నా మధ్య వాన వచ్చినప్పుడు వాళ్ళమ్మకు సుస్తీగా ఉందని చెప్పినందువల్ల చూసి వద్దామని.

వెడుతూంటే, అత్తగారు అడిగింది– "ఎక్కడికో వెడుతున్న ట్టున్నావు. రాత్రికి అన్నం వండావా?"

"వండలేదు, వచ్చాక వండుతాను. ఆలస్యమౌతే బియ్యం కడిగి పొయ్యిమీద వేయండి. పెద్ద గిన్నె లేదూ? అందులో అయిదు పావులు పోసి నిండా నీళ్ళుపెడితే సరి."

ఆఫీసరు ఆజ్ఞలా చెప్పి, నిర్లక్ష్యంగా వెళ్ళిపోతున్న కోడల్ని చూసి, ముక్కున వేలు వేసుకుంది. భామ అత్తగారు, 'పట్నం నీళ్ళు తాగి ఎంత మారిపోయింది మనిషి? ఎంత తెంపరి తనం!'

భామ వెళ్ళేప్పటికి ఇంటికి తాళం ఉంది.

'అత్త పోలేదు కదా?' గుండె గతుక్కు మంటూంటే పక్కింటి వాళ్ళ నడిగింది

"ముసలామెకు ఏమీ బాగాలేదు. ఆసుపత్రిలో చేర్చారు."

"ఆసుపత్రికి వెళ్ళేదా? ఇంటికి వెళ్ళేదా?" భామ ఆలోచనలో ఉండగానే లక్ష్మీప్రభతో రాఘవేంద్ర వచ్చాడు. "ఎప్పు డొచ్చావు?"

"ఇప్పుడే. అత్త కెలా ఉంది?"

"కొంచెం కష్టంగానే ఉంది. గుండెపోటు." అధైర్యంగా అన్నాడు; "ప్రభ బెంగపడినట్టుగా ఉంది, నాన్నమ్మ ఇంట్లోలేనందుకు దాన్ని నీతో తీసుకు వెడతావా? అమ్మకు కొంచెం నయమై ఇంటికి తీసుకువచ్చాక, వచ్చి తీసుకు వస్తాను."

"నువ్వు పంపుతానంటే నేను తీసికెళ్ళనా? వంటా, ఆసుపత్రికీ తిరుగుడూ చాలా ఇబ్బంది పడిపోతున్నావుకదూ? వచ్చి నాలుగు రోజు లు నే ఉండామన్నా, చుట్టాలొచ్చినప్పుడు, నే నిక్కడుంటానంటే కొంపలు తగిలేస్తారు. ఏమిటో అస్వతంత్రమైన బ్రతుకు." చుట్టాల సెపమే చెప్పింది గాని మగడి అనుమాన ప్రవృత్తి గురించి చెప్పలేదు.

"నువ్వు మనసు కష్టపెట్టుకోకు. నాకు తెలుసు నీ కుటుంబ పరిస్థితు లేమిటో. మృదుపుష్పం రాలి ముళ్ళడొంకలో పడినట్టుంది నీపరిస్థితి."

అతడి సానుభూతికి హృదయం చలిస్తూంటే పేలవంగా నవ్వి అంది భామ: "ముళ్ళడొంకను పూలవనముగా మారుద్దామని పెళ్ళికొత్తలో కలగన్నాను. అది సాధ్యంకాదని తెలిశాక, ముళ్ళు గుచ్చుకోకుండా ఓ పక్కకు నా మానాన నేనుందామని ప్రయత్నించాను. అది పిచ్చితన మని తెలిసిపోయాక కర్తవ్యం బోధపడడం లేదు!" తిరిగి లక్ష్మీప్రభ భుజం తట్టింది. "మా ఇంటికి వెడదాం. నీ పుస్తకాలు, గుడ్డలు తెచ్చుకో."

ఆ పిల్ల సామాను ఓచేతి సంచిలో సర్దియిచ్చాడు తండ్రి.

రిక్షా కేకేసి ఇద్దర్నీ కూచోబెట్టి, "పాపను తీసుకు వెళుతున్నం దుకు మీ వాళ్ళేమైనా అనుకోవచ్చు. కాని, పాప బెంగపడడం చూసి పంపక తప్పడం లేదు. ఎక్కువ రోజులు ఉంచనులే. అమ్మకు కొంచెం నయమనిపించగానే ఇంటికి తీసుకువచ్చేసి పాపను తెచ్చు కొంటాను," అన్నాడు రాఘవేంద్ర.

"నువ్వేం దిగులు పెటుకోకు, బావా. రెండు రోజులు పాపను ఉంచుకొన్నంత మాత్రాన ఏమో అనుకోగలంత నైచ్యం లేదులే వాళ్ళలో."

అని చెప్పిందేగాని, భామతో బావ కూతుర్ని చూసి, ఆ పిల్ల వచ్చిన విధం తెలిసి మూతులు ముడిచారు. అత్తా వాళ్ళూ. కోడలివైపు చుట్టాలను చూస్తే అత్తగారి వాళ్ళకు ఇంత నిరసన చేనికో?

భామ ఇంటికి వచ్చేప్పటికి అప్పటే రాత్రి కాకున్నా భోజనాలు

ముంగిచేసి పక్కలు పరివారందరూ. గుడ్డలు మార్చి కాస్త కడు క్కొని వంటింట్లోకి వెళ్ళింది భామ.

అన్నంలేదు గిన్నెలో, మాడు వెక్కలూ పక్కకట్టిన అన్నమూ తప్ప. ఆధరువులూ అన్నీ అడుగంట కొద్దికొద్దిగా ఉన్నాయి. 'మను షుల్లో ఇంత కుత్సితమా?'' ఆశ్చర్యపడింది భామ.

మరునాటి పెరుగుకోసం తోడేయించుకొన్న పాలు స్టౌ మీద వెచ్చబెట్టి పంచదారవేసి పాపకిచ్చి, మజ్జిగలో ఉప్పువేసి ఓ గ్లాసుడు తను తాగి డాబామీద పక్కవేసింది భామ.

భర్త టూర్‌లో ఉన్నాడు కాబట్టి పాపని గురించి గొడవేమీ జరుగలేదు అప్పటికి.

కాని మరునాడు అన్నాల దగ్గర మొదలైంది పోట్లాట.

మజ్జిగ చిలకడానికి కవ్వం పట్టుకొని, ''పెరుగేదీ?'' అంది తోడి కోడలు.

''లేదు. రాత్రి పాపకు యిచ్చాను పాలు.''

''మండిపోతున్న ఎండలకు ఒంట్లో ఉష్ణం ఉడికిస్తూంది మను షులను. ఆ కాస్తా కడుపు చల్లగా మజ్జిగ కరువు చేశావా? ఇదెక్కడి సంత తెచ్చి పెట్టావు కొంపలో?''

''సంతా?'' విస్మేరపోయింది భామ, అత్త ధోరణికి. ''చిన్న పిల్ల. ఆ పిల్లమీకు సంత అవుతే మీరు కాదా నాకు సంత?'' ఆగ్రహా వేశాలతో నోరు జారింది.

యుద్ధరంగమే ప్రత్యక్షమైంది ఇంట్లో. శంఖ ధ్వానాలు, మత్తే భాల ఘీంకారాలు వినవస్తూంటే కురుక్షేత్రంలో నిస్పృహతో అస్త్ర సన్యాసం చేసిన పార్థునివలె భోజనం కూడా మానేసి గదిలో కిమ్మన కుండా కూచుంది భామ.

అన్నాలు పెట్టుకు తినేసి బిస్తర్లు కట్టారు. ఇందిర మాత్రం ఈ కీచు లాటలో జోక్యం కలిగించుకోలేదు రెండు రోజులుండి పని జరిగించుకు వెళ్ళవలసిన మనిషి కదా? ఓర్చలేకపోతే ఎలా?

తీరా ముసలాయన అన్నాడు: ''వాడు రానీ, మనం ఇలా వెళ్ళిపోతే పెళ్ళాం ప్రతాపం తెలిసేదెలా వాడికి? దాన్ని నాలుగు

తన్నించిగాని వెళ్ళకూడదు. పెళ్ళయ్యి ఏడాది అయినా కాలేదు. అది ప్పుడే ఇంతమాట అంటుందా?''

''పౌరుషమున్న మగాడైతే పట్టుకు తంతాడు.''

వింటూనే ఉంది భామ. 'మీ సుపుత్రుడికి పౌరుషం లేకేమి? ఆలిని సమర్థిస్తున్నట్టుగా అగుపడితే అమ్మా వాళ్ళు ఎక్కడ చపటక్రింద జమ కట్టేస్తారో నని భయపడి అన్ని విధాలా అవమానిస్తూనే ఉన్నారు కదా నన్నాయన?' అనుకుంది మంటగా.

పదిహేను రోజుల తరువాత వచ్చే తన చిన్న కొడుకు పుట్టిన రోజు దాకా ఉంటాన్న ఆడబిడ్డ ఒక్కక్షణం నిలువనంటూ ఎగురు తూంది.

''అన్నయ్యొచ్చేదాకా ఆగు. పిల్లడికో అంగీ, నీకు చీరా రవికా తెప్పిస్తాను మీ అన్నయ్యతో చెప్పి. పసుపు కుంకుమ తీసుకోకుండా వెడతావా?'' అంటూ ఆపింది తల్లి.

కొడుకు రావడమూ అయింది. తల్లి బోధించడమూ అయింది.

భామ కొళాయి దగ్గర పని చేసుకొంటూందప్పుడు.

అక్కడికివచ్చి చాలా సీరియస్‌గా అడిగాడు జగన్మోహన్, ''ఉంచ దలచుకొన్నావా? వొదలుచుకొన్నావా?''

అంతకంటే సీరియస్‌గా, విసురుగా జవాబిచ్చింది భామ. ''ఇంపుడు క త్తెనసుకొన్నారా అలా అడగడానికి.''

ఒక్కక్షణం దంగై, తిరిగి రెచ్చిపోయాడు, ''ఒక్క మగ డితో కాపురం చేయాలనే పెళ్ళి చేసుకొన్నావా? అలా అనుకొంటే నలుగురిలో ఉన్నవాణ్ణి ఎందుకు చేసుకొన్నావు? ఏ దిక్కులేని వాణ్ణో చేసుకుంటే బాగుండేది కాదా?''

''ఇప్పుడేమైంది?''

''సంత అనలేదూ వాళ్ళని? ఏం కాలేదూ?''

''అంటే?''

''మెదడుందా లేదా? వాళ్ళు నీకు సంతలా కనబడ్డారా? అత్తా మామ రాకూడదని వాణ్ణా? నీకు చేసే బాధ్యతలేదా?''

''బాధ్యత ఎందుకు లేదు? ఉంది. కోడలు పిల్లంటే చాకిరీకి

కొన్న బానిస పిల్లలా చూస్తే మాత్రం కాదు. ఇష్టాలు, వ్యక్తిత్వం నాకు ఉండవా? ఆ మాత్రం గౌరవించకుండా ప్రవర్తిస్తే ఎట్లా? అత్తకు సుస్తీచేసి, పిల్ల బెంగపెట్టుకొందంటే రెండు రోజులు ఉంచుకొందామని తీసుకువచ్చాను, వెధవసంత ఎందుకు తీసుకు వచ్చావంటే ఏమన్న మాట? ఆపదకు అక్కరకు రాకపోతే మనుషులమై ఉన్నామెందుకు?''

''అయితే, వాళ్ళను సంతంటావా?''

''కాకపోతే? స్వంత ఊరు, స్వంత ఇల్లు, స్వంత భూములూ అన్నీ వదిలేసుకొని ఇక్కడికి వచ్చి ఉండడ మెందుకు? చూడాలని బుద్ధిపుడితే ఓ నాలుగు రోజులు ఉండిపోతే సరిపోదూ? మనకు సెలవు దొరికి నప్పుడు వెళ్ళి చూడమూ? పై ఊరు. అసలే అద్దె కొంపల్లో ఎన్నో ఇబ్బందులు. ఇలా వచ్చి నెలలు నెలలు నెత్తిమీద కూచుంటే చేసేదెవరూ? పెట్టేదెవరూ?''

''తెచ్చేవాడిని నేనున్నాను. చేసేది కష్టమైందా నీకు?''

''తేరగా వచ్చిన డబ్బు ఖర్చుపెట్టడంలో కష్టమెందుకు కనిపిస్తుంది మీకు? ఇల్లు చిన్నది. చేసిన పనే చేయాల్సి వస్తుంది. వంటకు పాత్ర సామాను సరిగాలేదు. పూటకు రెండు గిన్నెల్లో అన్నం, దినానికి రెండు పూటలు కూరగాయలు వండలేక నేను చస్తున్నాను. అత్తగారు ఒకరు. కాబోయే వియ్యపురాలు మరొకరు. ఇంట్లో ఉన్నంత సేపూ తనకూ, తన పిల్లలకూ చేసుకోవడం తోటే సరిపోయే తోడికోడలు మరుకరు. ఇంతమందికి చేసిపెట్టే గొడ్డును నేను.''

''ఆడదానవై పుట్టావెందుకు?''

''రెండు కాళ్ళు రెండు చేతులు పెట్టుకొని నాలుగుకాళ్ళ ఎద్దులాఁబతకడానికి,'' విసురుగా కదిలింది భామ.

ఎగబడి కొడితే నేత్రానందకరంగా తిలకించవచ్చని ఊపిరి బిగబట్టుకొని నిలబడ్డ వాళ్ళకు ఆశాభంగమే అయింది.

ఆడబిడ్డా, అత్తగారూ మరునాడు ప్రయాణ మయారు.

తెప్పించి సిద్ధంగా ఉంచుకొన్న చీరా, రవికగుడ్డా, చిన్నవాడికి చొక్కా పసుపు కుంకుమలతో ఆడపడుచు చేతిలో ఉంచుతూ, చేతులు పట్టుకొంది భామ. ''రెండు జీవాల మనిషిని. చేయడంచేత

గాక ఏదో అన్నాను. మనసులో పెట్టుకోకు. మీరు రాకూడని వాళ్ళా, పోకూడని వాళ్ళా కాదు."

నిన్న తిట్టినా ఈరోజు హృదయ స్ఫూర్తిగా చూపుతున్న ఆప్యాయతకు కళ్ళు చెమర్చాయి ఆడపడుచుకి. అత్తిల్లు పెట్టిన ప్రీతి ఆడపిల్లకూ ఉన్న అనుభవమే అది. కడుపులూ, వేవిళ్ళూ, సీరసాలూ వచ్చిపోయే వాళ్ళకు చాకిరీ. అత్తమామల సేవ, ఆరుమంది బిడ్డలతల్లి అయినా ఏడాదికి ఆరునెల్లు పుట్టిల్లు చేరుతుంది తను, అక్కడ కష్టం సహించలేక; ఉన్న నాలుగు రోజులు ఏవో కీచులాటలు, నిష్ఠూరాలు, చేసి చేసి అలసిన శరీరంతో చిరాకు కొండెత్తు లేస్తుంటే, నోరు హద్దులో పెట్టుకోలేక.

అత్తగారు మాత్రం ఊరుకోలేక, "నరంలేని నాలుక. ఎలా అయినా తిప్పొచ్చు. ఎంతయినా సత్యభామవు కదూ?" అంది మూతి మూడొంకలు తిప్పి, అక్కడనుండి కదులుతూ.

మరునాడు ముసలాయనతో అత్తగారు కూడా వెళ్ళిపోయింది.

రెండు రోజుల తరువాత తోడి కోడలుకూడా, భర్తకు ఉత్తరం వ్రాసి పుట్టింటికి వెళ్ళిపోయింది, వారం రోజులు పోయాక తిరిగివస్తానని చెప్పి.

కొద్దిగా పని తక్కువైనంత మాత్రాన భామకు ఒరిగింది ఏముంది? భర్త ప్రవర్తనలోనే మార్దవం లేకపోయాక? పాప మరికొన్నాళ్ళు ఇక్కడే ఉండిపోవలసి వచ్చింది.

ఆరోగ్యం కొద్దిగా మెరుగైనట్టే అనిపించి, మళ్ళీ ఉధృతంగా గుండె నొప్పి రావడంతో అనుకోకుండా దాటిపోయింది ప్రభ నాయనమ్మ. కర్మకాండ ముగించాక రాఘవేంద్ర వచ్చాడు పాపకోసం.

"అత్తలేని జీవితం కొంచెం అలవాటు పడేదాకా పాపను యిక్కడే వుంచు కొన్నాళ్ళు," అంది భామ.

పాప కోసం ఒక పావుశేరు పాలు ఎక్కువగా కొంటూంది భామ, నిత్యం.

"ఎన్నాళ్ళీ ఖర్చు?" అని అడిగాడు జగన్మోహన్.

"మీ వాళ్ళు ఎంత మంది వచ్చి కూచుని తినా ఖర్చు అని

పించదు. నా తరఫు నుండి ఒక చిన్న పిల్లను ఉంచుకొన్నానని బరువుగా భావిస్తున్నారా?"

"తినవలసిన వాళ్ళు వచ్చి తింటారు. అది బరువుగా భావిస్తే ఎలా? నీ చనిపోయిన అక్క కూతుర్ని మనం ఉంచుకొని పెట్టడమేమిటి?"

"గతి లేక వచ్చి ఉందా? నాయనమ్మ పోయినందుకు నాలుగు రోజులు ఉండమన్నాను నేనే, కొంచెం అలవాటు పడనీ అని."

"మీ అత్త పోయి, మీ బావకు కూడా గుండె చెదిరిందేమో, అతడిని కూడా పిలువలేక పోయావా, వచ్చి ఉండమని."

విరుచుకు పడింది భామ. "నేనంటే ఏమిటి మీ వుద్దేశం? మంచివానికి, చెడ్డవానికి నన్నింత చులకనగా మాట్లాడవలసిన పనేమిటి మీకు? అంత విలువలేని మనిషి ననుకొన్నారా?"

"అబ్బా! విలువలేని మనిషి వెందు కౌతావు? సత్యభామా, బి. ఏ. వి. కాబోయే ఎస్. ఇ. వో. వి. రివ్వున మింటి కెగసిపోతున్న నటీమణివి."

"ఆ పాటి అభివృద్ధినీ, అర్హతలనూ మీరు సహించలేరా? మీకు అవమానకరంగా ఉంటుందా?"

"లేదు సమ్మానకరంగా ఉంటుంది. వారిలో పోతూంటే, ఫలానా నాటకంలో వేషంవేసిన దాని మగడు అంటూంటే, ఫలానా ఎస్. ఇ. వో. మగడు అంటూంటే ఏనుగ ఎక్కినంత గర్వంగా ఉంటుంది నాకు."

నిస్పృహగా, చికాకుగా అడిగింది భామ: "అయితే ఏం చేయాలంటారు?"

"పెళ్ళయిన ఆడది ఏం చెయ్యాలి, ఇల్లు చక్కదిద్దుకోవడం కంటే?"

గృహమే కదా, స్వర్గసీమ! తనెన్ని కలలు గనలేదు ఆ స్వర్గసీమ గురించి? చక్కని డాబా యిల్లు (అద్దెదైనా), ఇంటి ముందు చక్కని తోట, ఇంట్లో చక్కని ఫర్నీచరు, అలంకార వస్తువులు—

అప్యాయంగా, అభిమానంగా చూసుకొనే భర్త, ఇంట్లో నవ్వులు పువ్వులు వెదజల్లే చిన్నారి పాపలు.

ఇల్లు రావచ్చు. ఇంటికి కావలసిన సామాను రావచ్చు. పిల్లలు పుట్టవచ్చు. కాని, గృహమేధి సహకార ప్రోత్సాహాలు లేకుండా గృహానికి కళ ఎలా వస్తుంది? గృహం స్వర్గసీమ ఎలా అవుతుంది ఒక్క గృహిణివల్ల మాత్రమే?

సహృదయతా సంస్కారాలు లేని బంధువుల రాకడతో, మంచీ చెడ్డా పట్టించుకోకుండా అదో విపరీత మనస్తత్వంతో ప్రవర్తించే భర్తతో తనాశించిన విధంగా యింటిని ఎలా తీర్చి దిద్దుకోగలదు? అందుకే దిన దినానికి సంసారమంటే మక్కువ, శ్రద్ధ తగ్గిపోయి బయటి ప్రపంచంలోని అభివృద్ధి ఔన్నత్యాలకోసం మనసు మొగ్గు చూపుతూంది. ఇంటిని నిర్లక్ష్యం చేసి తను పక్కదోవ పడుతూన్న దంటే లోపం తనలో కాదు, అతడిలో ఉంది. కాని; ఆ సంగతి అర్థమయ్యేలా ఆ మొండి మనిషికి ఎలా చెప్పగలదు?"

"ఇల్లు చక్కదిద్దుకోవడం అక్షర జ్ఞానంలేని ఆడది కూడా చేయగలదు. సత్యభామా బి. ఏ. నని తెలిసి కూడా ఎందుకు చేసుకొన్నారు?"

"పెళ్ళయ్యాక మామూలు ఆడ దానిలా మారిపోగలవని ఆశించి. కాని, ఇప్పుడు పొరపాటు చేశానని చింతిస్తున్నాను."

పాపను వారం రోజుల తరువాత తీసికెళ్ళాడు తండ్రి.

# 17

ఎప్పటికప్పుడు సంసారమంటే విరిగిపోతున్న మనసుకు నీరు పోసి బలమిచ్చి ఆశావల్లరులు చిగురింపజేసుకోవడానికే ప్రయత్నిస్తూంది భామ.

ఈ సంసార నౌక మునిగిపోవాలంటే చిటికెలోపని. కాని.

ఎన్ని సుడిగుండాలు వచ్చినా, ఎన్ని పెను తుఫానులు వచ్చినా, సురక్షితంగా నావ నడపాలంటే నే శ్రమా ప్రయత్నం అవసరం. ఎంత శ్రమ అయినా పడవ నడవాలనే వుంటుంది గాని, మునిగిపోవాలని ఎవరికి వుంటుంది?

ఒక సాయంత్రం భర్త ఆఫీసు నుండి వచ్చేప్పటికి టిఫిన్ గిఫిన్ అంతా రెడీ చేసి, తనూ టాయ్‌లెట్ అయి అతడొస్తూనే అన్నీ అందించి, అలుపు తీర్చుకొన్నాక అడిగింది: "ఈ రోజు సినిమాకు వెడదామని అంతా తయారయ్యాను."

"ఎవరితో?"

"మీ తోనే."

"కపటం యివతలి వాళ్ళకు ఉందంటావు. నీకు లేదూ? వదినా వాళ్ళతో ఒకసారన్నా వెళ్ళావా, పని కాలేదనో, తలనొప్పిగా ఉందనో సాకు చెప్పి."

"ఆ సంగతి ఇప్పుడెందుకు, నేను సరదాగా మీతో సినిమాకు వెడదామని కోరితే?"

"బాగా సరదాపడ్డావుగాని ఆదివారం వెడదాం. ఈ రోజు ఆఫీసులో పని ఎక్కువై తలనొప్పి పట్టుకొంది."

ఆ చెప్పడంలో అనునయింపు లేదు. సంజాయిషీ లేదు. అదే మిటో తల బిరుసు తనం తప్ప. హతాశురాలై పోయింది శ్యామ. ఎంత కని ఆశలు పెంచుకోగలదు?

పేరాశకు పోవడం తప్ప, అతడితో సినిమాకు వెడితే ఉన్న సరదా కూడా చచ్చి ఊరుకొంటుంది. ఇదివరలో జరిగిన అనుభవ మది. దారి తెలియకపోతే, అతడే టర్నింగ్‌లోనో మాయ మౌతే ఏడ్పు మొగంతో ఇంటి ముఖం పట్టాల్సిందే. చేసుకొన్న దానితో జోడీగా వెళ్ళాలంటే, ఆయన కేమిటో నామోషీ. (జమునతో వెళ్ళొచ్చుగాని) అర ఫర్లాంగు ముందు నడిచి పోతుంటే అందుకోవాలనే తాపత్రయంతో ఆయాసపడి చావాలి!

"ఆగండి. కలసి వెళ్ళకూడదూ కబురు చెప్పుకొంటూ?"

"ఏం బాగు? ఆలుమగలమని తెలియని వాళ్ళు వింతగా చూస్తారు. ఎందుకొచ్చిన అపవాదు?"

"అనుకొంటే అనుకోనీ. మనకొచ్చిన కష్టమేమీ?"

"ఫ్రెండ్సూ, వాళ్ళూ కలుస్తుంటారు. నువ్వు పక్క నుంటే ఏం బాగు?"

ఇక థియేటరులో పక్క పక్కన కూచుని చూడాలన్న కోరిక ఏ జన్మకు తీరేను?

భార్యకు అవసరమైన చనువు యివ్వలేని మగవాడు; మరో ఆడదానికి నాసుదెలా అవుతున్నాడో అర్థంకాదు. స్త్రీ బుద్ధిః ప్రళయాంతకః అని చెప్పిన వాడెవడో బుద్ధిలేనివాడు.

* * *

రేడియో స్టేషన్‌కు వెళ్ళడానికి తయారవుతూంది భామ.

వీథిలో కారాగిన సవ్వడి విని కిటికీ దగ్గరికి వచ్చి తొంగి చూసింది. కారులో స్టీరింగ్ ముందు కూచుని దిగడానికి సంచేహిస్తున్నాడు ఉదయభాస్కర్.

తలుపు తీసి—"లోపలికి రండి" అని పిలిచింది, కొద్ది తడబాటుతో.

"స్టేషన్‌కు తయారయ్యారా?"

"మరో అయిదు నిమిషాలయితే వెళ్ళిపోయేదాన్ని."

"అయితే పదండి."

"ఎందుకండీ, మీకు శ్రమ? రిక్షా...."

మరి మాట్లాడనివ్వలేదు. "ఫర్వాలేదు. మీకు ఏపాటి శ్రమ కలుగ కూడదనే నేను వచ్చాను. ఒకరు కాదు కదా? రెండు జీవాల మనుషులు!"

అతడి కంఠంలోని ఆర్ద్రతకు, అభిమానానికి ఏదో తెలియని భీతితో స్పందించింది హృదయం.

రేడియో నాటకాలలో పాల్గొనే అవకాశం కల్పించిందీ అతడే. అవకాశం వచ్చిన సంగతి భర్తకు తెలుసునేగాని ప్రోత్సాహమిచ్చి, అవకాశం కల్పించిందీ ఒక సుందర యువకుడని మాత్రం తెలియదు.

తెలిసిన నాడు తను ఇంట్లో నిలువదు.

ఆ సంగతి తనకు దృఢంగా తెలుసు! అయినా వెనుకంజ వేయడం లేదు మనసు. సంసార సౌఖ్యం లోపించిన తనకు మరో విధంగా శాంతి వెదుక్కోక తప్పడంలేదు. ఆ శాంతిని ఎదుర్కోవడంలో తప్పటడుగువేస్తూందా? ఉహుఁ. నైతికంగా తనెప్పుడూ దిగజారదు.

తను కోరిన అభివృద్ధి కావాలంటే, ఉదయ భాస్కర్ లాంటి వాళ్ళ సహకారం తనకు కావాలి.

అతడు తనకు తానుగా, మనస్ఫూర్తిగా అందిస్తున్నాడు సహాయం. ఆ సహాయ సహకారాల వెనుక స్వార్థపు ఛాయలు తనకెప్పుడూ అగుపించలేదు. అదొక విధమైన స్నేహార్ద్రత తప్పితే, సిరి ఉన్న అందమైన యువకుడు. ఉత్సాహవంతుడు. కళాభిమాని. కళాసేవకుడు.

నాటక కళలో తనకున్న ప్రతిభను గుర్తించి మంచి కళాకారిణిగా తీర్చిదిద్దాలన్న తాపత్రయం తప్ప మరో విధమైన భావమేదీ అగుపించ లేదింత వరకు.

అగుపించిన నాడు ఉంచవలసిన దూరంలోనే ఉంచుతుంది అతడిని.

తన మనోబలంమీద తనకు నమ్మకముంది.

తలుపుకు తాళంపెట్టి తాళం చెవి కిటికీలో ఉంచింది.

గేటు దగ్గరికి వేసి, కారెక్కుతూంటే ఉదయ భాస్కర్ అడిగాడు: "మీ శ్రీవారు లేరా?"

"ఊళ్ళోనే ఉన్నారు. సాయంత్రం పూట ఆయనకు బయటికి వెళ్ళకపోతే తోచదు. ఆయన వచ్చే సరికి నేను రాగలనో లేనో అని తాళం చెవి ఉంచాను."

సంకోచిస్తూనే అడిగాడు. "మీ రిలా నాటకాలని తిరగడం అదీ తెలియదా? ఇష్టమేనా?"

"తెలుసుకాని, ఇష్టం లేదు." పేలవంగా అంది. "కాని ఆత్మాభి

తెంచుకొని స్వేచ్ఛా మార్గంలో వెళ్ళిపోగల ఆత్మస్థైర్యం, ముండ నిబ్బరం కూడా ఉన్నాయి నాకు.''

''ఓ! అంత అనురాగ దాంపత్యం కాదన్న మాట!'' అన్నా డతడు సానుభూతిగా.

ఇదివరకు ఎన్నోసార్లు అతడితో కలవ వలసి వచ్చినా ఎప్పుడూ వ్యక్తిగతమైన విషయాలు చర్చకురాలేదు. ఎన్నోసార్లు అడగాలనిపిం చేది. అతడింకా పెళ్ళెందుకు చేసుకోలేదో? డబ్బు, సంఘంలో బోలెడు పలుకుబడి ఉండీ అందంగా, చలాకీగా ఉండే అతడంటే అమ్మాయిలకు కావలసినంత ఆకర్షణ. అతడో అమ్మాయి మెడలో పసుపుతాడు కట్టా డంటే; ఆ ఆకర్షణకు బండపడిపోతుంది. ఆడపిల్లల్ని ఊరిస్తూ ఇంకా ముదిరిపోతున్న బెండకాయలా బ్రహ్మచర్యం ఎందుకు పట్టుకు కూర్చొ న్నాడో అడగాలి. ఎక్కడైనా ప్రేమ బెడిసి కొట్టిందేమో.

''మీరింకా పెళ్ళెందుకు చేసుకోలేదు?''

ఫెళ్ళున నవ్వాడు: ''చేసుకోలేదని ఎవరు చెప్పారు?''

తెల్లబోయింది భామ. ''అంతా అలాగే అనుకొంటూంటే! మీ అక్కయ్య కూడా ఓసారి అంది.''

ఎక్కడో చూస్తూ నిర్విచారంగా చెప్పాడు: ''అయింది. అయిపోయింది కూడా.''

''అంటే?''

''అభిప్రాయాలు కలువలేదు మా ఇద్దరికీ. విడిపోయాం. చట్ట సమ్మతంగా. అది అయిపోయికూడా అయిదేళ్ళు అయింది.

కుతూహలం అధికమైంది భామకు. 'ఇతడింత అభ్యుదయవాది, సంస్కారికదా. ఇతని కాపురం చెడిపోయిందంటే- ఆడదానిదే దుర్మార్గమైఉండవచ్చు. ఇంతటి ఉత్తముడి సాన్నిహిత్యం దులుకొన్న ఆవిడ ఉత్త తెలివి తక్కువదై ఉంటుంది.'

వెనక్కి తిరిగిచూసి చిన్నగా నవ్వాడు ఉదయభాస్కర్. ''ఏమిటి ఆలోచిస్తున్నారు?''

''ఆమె ఎక్కడుంటా రిప్పుడు?''

''కలుసుకోవాలని ఉందా?'' మళ్ళీ నవ్వాడు. ''అమెరికాలో

తన రెండవ భర్తతో, తనూ రిసెర్చిచేస్తూ.''

తెల్లబోయింది భామ. అసలతడు వివాహితుడంటేనే నమ్మ శక్యంగాకుండా ఉంది. పైగా ఈవింత కథా?''

''మీ ఆశ్చర్యమేమిటో నాకు తెలుసు. ఆవిడ బాగా చదువు కుంది. మంచి తెలివితేటలేకాక ఎన్నో అభ్యుదయ భావాలు కల యువతి. నిజం నిర్మొగమాటంగా చెప్పాలంటే మానసికంగా ఆమె అంతగా ఎదుగలేదు నేను. పురుషుడు ఎంత సహృదయుడైనా ఆడది తనను మించి ఎదిగి కూచోడం సహించలేడన్నది పచ్చి నిజం. అందుకే, అడుగడుగునా ఆవిడ ఆధిక్యం మా మధ్య మనస్పర్థలు రేకెత్తించాయి.

''అయితే, అందరికీ ఆశ్చర్యం కలిగించే విషయం ఏమంటే, మేం ఎప్పుడూ పైకి పెద్దగా కలహించుకోలేదు, అసహ్యంగా. అంత రంగాలలో విద్వేషాన్ని రగిలించుకో లేదు.

''ఏదో ఒక చిన్న పేచీ వచ్చింది. 'మనిద్దరికీ సరిపడ నట్టుంది. విడిపోదామా?' అన్నాను నవ్వుతూ, అంతే. ఆవిడ నా ముందుంచిన కాగితం చూసి తెల్లబోయాను. ఆవిడ ముఖంలోని నిశ్చయం చూసి ఇహ తప్పదని దృఢం చేసుకొన్నాను. నిశ్చింతగా సిద్ధపడ్డాను. నెల తిరగకుండానే ఆవిడ కుమారి అర్హత సంపాదించుకొని, మరో నెల తిరగకుండా మరోవరుణ్ణి వెదుక్కొని, మరో నెల తిరగకుండా శ్రీమతి అయి ఫారిన్ వెళ్ళిపోయింది.

''ఇలా జరిగిందేమిటాని నేనే ఆశ్చర్యపోతుంటాను.''

''బహుశః ఆవిడ అదివరకే అతడిని ప్రేమించి అంత హఠాత్తుగా విడిపోయిందేమో.''

అతి తేలిగ్గా అనేసిన మాటకు అతడు నొచ్చుకొని తీవ్రంగా తలాడించాడు. ''కాదు కాదు. ఆమెతో గడిపిన ఆర్నెల్ల వైవాహిక జీవితంలో ఆమెలా ప్రేమించగల వారు అసలు ఎవరైనా ఉంటారా అనిపిస్తూంటుంది నాకు. విడిపోయాక జంటను వెదుక్కొని వెళ్ళి పోయింది.''

అతడి కళ్ళలోని తడిచూసి మరింత విస్మయానికి లోనైంది

దంటారు?''

"కేవలం అభిమానం కాపాడుకోవడం కోసం. నువ్వు లేక పోయినా నేను బాగానే సుఖపడుతున్నానని చూపుకోవడం కోసం.''

'ఆవిడేకాదు. మీరుకూడా వింతమనుషులే!' అనుకుంది భామ.

తిరిగి వచ్చేప్పుడు చంద్రకళను కలిసి ఇంటికి వచ్చేప్పటికి రాత్రి ఎనిమిది అయింది.

తలుపులు తెరిచి, లోపల హండ్రడ్ కాండిల్ బల్బ్ వెలుగుతూంటే గుమ్మం నిలువుగా నిలబడి ఉన్నాడు భర్త.

స్టీరింగ్‌ముందు కూచున్న ఉదయభాస్కర్ అతడి కంటబడే ఉండొచ్చు. లోపలికి పిలిచి పరిచయం చేయకుండా పంపితే; 'ఎవడే వాడు?' అంటాడేమో. పరిచయం చేసినా అదేం తప్పో?

ఏమైనా ఈ సంఘటనలో మితి మీరి చరించినట్టుగా లేదు. స్నేహపూర్వకంగా అతడి ఆహ్వానాన్ని అంగీకరించి కారులో వెళ్ళి వచ్చింది. కాని, ఆయనకు?

ఈ రోజు ఎన్ని నీచమైన మాటలైనా అతడితో వినవలసి రావచ్చు.

కారు స్టార్టు చేయబోతుంటే అంది భామ. ఇంచుక కంపిత స్వరంతో: "ఆయన వచ్చారు. లోపలకి రండి. పరిచయం చేస్తాను.''

భామ వెనుకే కారుదిగి వచ్చాడు ఉదయభాస్కర్.

దారి వదలకుండా నిలబడ్డాడు జగన్మోహన్.

అతడి ముందు ఏ మవమానం చేస్తాడో నని గుండె కొట్టుకొంటూనే ఉంది. "ఈయన....''

భామ మాట పూర్తికాలేదు. వెనక్కి తూలింది. క్రోధావేశాలతో చెంపమీద భర్త కొట్టిన దెబ్బకు.

తెల్లబోతూ భామ ముఖంలోకి చూశాడు ఉదయభాస్కర్. కన్నులనిండా గాఢమైన సానుభూతి నింపి.

చేతుల్లో ముఖ ముంచుకొని వెక్కి వెక్కి ఏడవసాగింది ఆమె.

ముందు నిర్దోషిత్వం నిలుస్తుందా? ప్రయోజనం ఉండబోదు. నిస్సహాయంగా, మౌనం వహించి వెనుదిరిగాడు ఉదయభాస్కర్.

# 18

ఎప్పుడో తెల్లవారు జామున పట్టిన కలత నిద్రనుంచి కొట్టి లేపినట్టుగా చటుక్కున మెలుకువ కలిగింది భామకు. వేలు కదిలించ డానికి కూడా శక్తి చాలడం లేదు. కడుపులో బిడ్డగంతులతో హైరానా పడిపోతూంది ప్రాణం!

లేవాలనిపించడం లేదు. అసలీ ప్రపంచాన్నికూడా చూడాలనిపించడం లేదు. కళ్ళుమూసుకుని అలాగే పడిఉండి చచ్చిపోవాలనిపిస్తూంది. కాని, అంత సుఖంగా రాదు చావు!

మళ్ళీ పడుకోబోయింది.

బయటి గదిలో తండ్రి గొంతు వినిపించింది. అనుకొంటూనే ఉంది పురిటికి తీసుకుపోడానికి తండ్రి వస్తాడని.

"అమ్మాయి ఆరోగ్యం బాగుందా?" అల్లుడిని అడుగుతున్నాడు.

'ఆఁ.'

ఇహ లేవక తప్పలేదు. సత్తువంతా కూడదీసుకొని లేఁ గుమ్మం దగ్గరికి వెళ్ళింది, "అంతా బాగున్నారా, నాన్నా?"

"ఆఁ, నీ ఒంట్లో కులాసాగానే ఉందా, అమ్మా?"

"బాగానె ఉంది."

"లెక్క కట్టి మొన్నటికి తొమ్మిదో నెలపడిందని చెప్పింది మీ అమ్మ. ఈ రోజు దశమి. బుధవారం బాగుందని ప్రయాణం కట్టించింది. ఈ రోజే నువ్వు ప్రయాణం కావాలి."

"ఇప్పుడైనా అల్లుడిగారి అభ్యంతరం ఉండదనుకొంటాను."

"ఏం లేదు. తీసికెళ్ళొచ్చు."

ముందు మొహంకడిగి, పనిమనిషిని హోటల్‌కు పంపి దోసె తెప్పించుకొని టీ తాగి స్నానానికి వెళ్ళింది.

"బస్సు ఒకటికే ఉంది. వంట త్వరగా కానీ, సత్యా!" చెప్పాడు తండ్రి.

పదకొండు గంటలకల్లా వంట దించేసి తండ్రిని భోజనానికి లేపింది.

"అల్లుడు రానీ. ఇద్దరం లేస్తాం."

"ఆయన ఎప్పుడు వస్తారో? నువ్వు లే ముందు. వస్తే ఆయనా నేను కలసి కూర్చొంటాం."

ఆయన భోజనం కానిచ్చి చేయి కడుక్కొంటూంటే, జగన్మోహన్ వచ్చాడు.

పీట వాల్చి, వడ్డించి పిలిచింది భామ. ఎక్కడో తినేసి వచ్చానంటా డనుకొంది. కాని, మౌనంగా వచ్చి కూచున్నాడు, పొడ్లోకి వెళ్ళి కాళ్ళు కడుక్కొని.

"ఈ పాపిష్ఠి దాని చేతి తిండి తినే దురదృష్టం ఇవాళతో ఆఖరు." నెయ్యివేసి, ఎదురుగానే కూర్చొంది భామ నిశ్చలంగా, గంభీరంగా.

ఏహ్యంగా పెదవి విరుస్తూ అన్నాడు: "జాగ్రత్త పడ్డావు, నా నోటితో ఆ మాట రాకముందే. ఎంతైనా తెలివైన దానివి. సత్యభామా బి. ఏ. వి."

"అలనాడు కృష్ణమూర్తి సత్యభామ కాళ్ళు పట్టుకొని అలుకతీర్చి ప్రసన్నం చేసుకొన్నాడేమో గాని, ఎన్నడైనా పశ్చాత్తాపంతో ఈ జగన్మోహనుడు నా కాళ్ళు పట్టుకొన్నా కాపురం చేయబోదు మీతో ఈ సత్యభామ."

"భ్రమపడకు. ఆ అవసరం నాకు లేదు. "ఇచ్ఛితంగా అన్నాడు." ఆ కాళ్ళు పట్టుకొనే దినం నీకే వస్తుంది. కాని, అప్పుడు నీ మొర వినే నాథు డెవడూ ఉండడు. ఏ అహంభావంతో సంసారాన్ని తృణప్రాయంగా చెడగొట్టు కొంటున్నావో అదే నీ జీవితాన్ని నాశనం చేస్తుంది. మొగుడిని విడిచిన ఆడదాని. సంసారాని విడిచి వీథినిబడ

ఆడదాన్ని నీ బి. ఏ. డిగ్రీ కాని, మరేదైన ఉద్యోగం కాని, ఇంకా నీ కళాసేవగాని, గౌరవాన్ని పొందనీయవు, సుఖ మివ్వలేవు; కూడు పెట్టొచ్చుగాని."

"మీతోడి ఈ సంసారం కూడా కూడూ గుడ్డ యివ్వడం తప్ప మీరు చెప్పిన ఆ గౌరవ సౌఖ్యాలను యివ్వడం లేదు. వంటింటి గోడలతో పాటు పొగచూరిపోయిన ఆడదానికి తప్ప, నాలా కొంచెం వీధి మీదికి చూపు పోనిచ్చేదానికి, విజ్ఞాన వినోదాలమీదికి మనసు పోనిచ్చేదానికి విలువలేదు. అది బరితెగిన ఆడది. సంసార పద్ధతి తెలియనిది."

"అవును మరి. మగరాయడిలా లైబ్రరీలకు వెళ్ళి పుస్తకాలు తెచ్చుకోవడం, ఫ్రెండ్స్ పిలిచారని షాపింగులకని షికార్లు కొట్టడం మహిళా మండలి అని, నాటకాలని చెప్పి నాకంట్లో దుమ్ముకొట్టి పరాయి మగాళ్ళతో తిరగడం, నిజంగా ఇవి గృహిణికి అవసరమా? చిల్లర మనిషి చేయవలసిన పనులుకాక?"

"ఆ దుమ్మేదో నేను కొట్టలేదు, మీ చేత్తో మీరే కొట్టుకొన్నారు, వాస్తవాన్ని గుర్తించకుండా. ఎంత ఉత్తమ గృహిణికైనా ఆ పాటి విజ్ఞాన వికాసాలు, పిచ్చాపాటి, నలుగురిలో సరదాగా తిరిగి రావాలని ఉండదా? తప్పా?"

"బజార్లలో చక్కర్లు కొట్టకుండానే ఇంట్లోనే పొందొచ్చునే నీవు చెప్పినవి."

"ఇల్లు ఇల్లు ఇల్లు!" విరక్తిగా, నిరసనగా నవ్వింది భామ. "ఇల్లు కాదది నాకు. నరకం. ఈ ఇంటిని స్వర్గసీమను చేసుకోవాలని నేను కన్న కలలన్నీ నీట కలిశాయి, మీ పురుషాహంభావంవల్ల, మీ రసహీనమైన హృదయంవల్ల. ఒక్క ఆడదానివల్లే స్వర్గం కాదు ఇల్లు. పురుషుడి తోడ్పాటు కూడా కావాలి. కేవలం చీకటిలో స్త్రీని ప్రేమించే మీకు ఆ ఆలోచన ఎలా వస్తుంది? ఎంత సేపూ భార్య నడవడిక నిర్దేశించడం తప్ప భర్త బాధ్యత లేమిటో తెలుసుకోనక్కరలేదా?"

"అంత తెలియని బాధ్యత లేమిటి?" అసహనంగా అరిచాడు: "జీతమే తెచ్చి నీ చేతిలో పెట్టానే ఇంకా బాధ్యతలేమిటి?"

"జీతం చేతికిస్తే అయిపోతుందా? మాటలతో చెప్పలేనివి,

ఆర్థికంగా సంబంధం లేనివి సున్నితమైన వ్యవహారాలు చాలా ఉంటాయి దంపతుల మధ్య. పరస్పరం అవగాహన చేసుకోవలసిన విషయా లెన్నో ఉంటాయి. హద్దులూ, నైతిక విలువలూ ఆడదానికే కాదు. మగవాడికి కూడా ఉండక తప్పదు. మితి మీరి చరించి కూడా, 'వాడికేం మగవాడు' అనిపించుకోవచ్చు గాని, మనిషిగా మాత్రం మన్నింప బడడు."

"నా నడవడి బాగా లేదని మీరు నన్నొదలడం కాదు. మీచరిత్ర నచ్చక నేనే మిమ్మల్ని వదిలేస్తున్నాను."

"అబ్బా! ఎంత గొప్ప అభిమానం?"

"వెటకరించక్కర్లేదు. మీ తోడిదే లోకంగా భావించుకొన్న నన్ను ఒంటరిదాన్ని చేయకపోతే, బయట ఆనందం వెదుక్కోవలసిన అవసరం నాకేమీ వచ్చేది? అయినా, నే నెన్నుకొన్న వినోద వికాస పథం నైతికంగా దిగజార్చేది కాదు. మరీ అంత దిగజారి పోగల దుర్బల మనస్తత్వమూ కాదు నాది.

"అయినా, మీ సంకుచిత మనస్తత్వం ముందు నా నిర్దోషిత్వం ఋజువు చేసుకోవాలన్న తాపత్రయం లేదు నాకు. భగవంతుడు ఎలా వ్రాసి పెట్టి ఉంటే అలా జరుగుతుంది. నే నన్నిటికీ సిద్ధమయ్యే ఉన్నాను."

"ఉద్యోగం చేసుకొని బ్రతకగలనన్న ధీమా నీకింత తల బిరుసుతనం తెచ్చి పెట్టింది. కాని, నువ్వెంత సంపాదించుకొన్నా సంసారం వదలుకొన్న ఆడదాన్ని కుక్కలు కూడా అడగవు."

"ఫర్వాలేదు. నా ధైర్యమే నాకు రక్ష" నిర్లక్ష్యంగా నవ్వింది. "జీవితం ఒక నౌక. నిర్మలసరసిలోనే కాక కల్లోలితమైన సాగర తరంగాల మీద కూడా సురక్షితంగా పయనించ గలదు నౌక. నౌక నడుప గలవాడు చతురిమ కలవాడై వుంటే, ఆడదాని జీవన నౌక సుగమంగా, సురక్షితంగా సాగేది నిర్మలసరసి లాంటి సంసారంలో మాత్రమే. అయితే ఆ సంసార సరసి కుశంకలతో కలుషితమైనప్పుడు, అను మానపు మొసళ్ళు చేరినప్పుడు హద్దులనీ, గౌరవ ప్రతిష్ఠలనీ సంసారం పట్టుకు వేలాడే ఆడది—అది పాతివ్రత్యం అనుకొంటుందేమోగాని,

అది నిజంగా పురుషుణ్ణీ, సంఘాన్నీ ఎదిరించలేని దౌర్బల్యం మాత్రమే. ఈ సంసారం దూరం చేసుకోవడంవల్ల నేను ఆకాశంలోకి ఎగిసి పోతానని కాదు. అలాంటి ఆశ లేమీ లేవు. ఆత్మాభిమానం దెబ్బ తినకుండా నా మానాన నేను బ్రతకడానికే. సంసారాన్ని వదులుకోవడం వల్ల సరసిని విడిచి సాగరాన్ని చేరుకొంటున్నా నన్నమాట నిజం. అయితే, ఆ అనుభవాలకు ధైర్యంగా స్వాగతం చెప్పబోతున్నాను. నా సంగతి అలా ఉంచండి. మీ సంగతి. హోటల్లో భోజనం దొరుకు తుంది. జమునలాంటి వాళ్ళవల్ల మరో ఆకలి కూడా తీరుతుంది. కాని, అగ్ని సాక్షిగా తెచ్చుకొన్న సహచరి లోటు త్వరలోనే తెలిసిపోతుంది. ఆమె అడుగుల సవ్వడి, ఆమె చేతి తిండి, ఆమె రెక్కలలోని వెచ్చ దనం, ఆమె కళ్ళలోని చల్లదనం—అవి బయట వెదికితే దొరికేవి కాదు. డబ్బుకు అంతకంటే దొరకవు...."నేను కాదు. ఖచ్చితంగా మీరు పశ్చాత్తాప పడే రోజు వస్తుంది!"

డైనమైట్ కు నిప్పు పెట్టినట్టు ఫెళ్ళున ఉరిమాడు. "ఉపన్యాసం కట్టిపెట్టు. వదరకుండా నోరు మూసుకు నడువు నా యింట్లోంచి." భోజనం పూర్తి కాకుండానే కంచంలో చెయ్యి కడిగి లేచాడు.

చలించకుండా అంది భామ: "తింటూ తింటూన్న అన్నంలో ఎలా నీళ్ళుపోసి లేచారో మీ జీవన సౌఖ్యం కూడా అలాగే కాలదన్ను కొన్నారన్న సంగతి విస్మరించకండి!"

"ముందు నోర్ముయ్!"

కంచం తీసేసి యివతలికి వచ్చింది భామ.

"భోజనం అయిందా, సత్యవతీ? రిక్షా తెచ్చాను" అంటూ వచ్చాడు తండ్రి.

"అయిపోయింది, నాన్నా."

"మరి పద. ఏదీ నీ సామాను?"

ఒక సూటుకేసు మాత్రం తెచ్చింది యివతలికి. నాలుగైదు చీరలు మాత్రమే ఉన్నాయందులో. పెళ్ళినాడు అత్తగారు పెట్టిన పట్టు చీరలు గాని నగలుగాని ఏమీ తీసుకోలేదు. ఇక్కడే ఆల్మైరాలో ఉంచేసింది.

"బస్ స్టాండు దాకా రావా, అబ్బాయ్?"

"........." అతను ఉలుకూ పలుకూ లేకుండా కూచుంటే మరోలా అర్థంచేసుకొన్నాడు తండ్రి. "ఏం కుర్రాళ్ళో. పెళ్ళాం నెలలు నిండి పురిటికి పుట్టింటికి వెడుతూంటే విడిచి ఉండలేక బాధ పడుతూంటారు. అప్పుడే అలిగాడు ఈయన!"

"ఆయ నెక్కడికి వస్తారు, నాన్నా? వచ్చి చేసేదేమిటి?"

గడప దాటుతూ కుర్చీలో పేపరు చూస్తున్న భర్తకేసి చూడా లని కూడా అనిపించలేదు భామకు.

అన్నీ వదులుకొని, అన్నం కూడా తినకుండా మొండి ధైర్యంతో వెళ్ళిపోతున్న ఆమెను వెనుక నుంచి దీర్ఘంగా పరికించాడు జగన్మోహన్. ఆవిడ ఇంట్లో ఉన్నంతసేపూ తెలియని ఒంటరి తన మేదో తోచింది. గడపదాటి వెళ్ళిపోగానే 'కానీయ్! వెధవ ధైర్యం కాకపోతే పిల్లో పిల్లాడో పుడితే అది పుట్టింట్లో ఎలా నిలుస్తుందో చూడనా? బిడ్డను చంక నేసుకొని పరిగెత్తుకు రాదూ?' అలా ఊహించు కొంటూంటే అనివార్యమైన ఏదో వింత భావన. వింత అనుభూతి ఎక్కడిదో ఇది?

# 19

తండ్రి వెనుక తలవంచుకొని మెల్లగా అడుగులు వేస్తూ వస్తూన్న కూతుర్ని పుట్టెడు ఆత్రంతో పరికించింది భామ తల్లి. నెలలు నిండి పురిటికి వస్తూంది!

రాత్రీ, ఇవాళ పగలూ కూడా అన్నంలేక నీరసించి పోయిన భామ, తల్లి కళ్ళు చెరువులు చేసింది.

"ముందు ఏదైనా పెట్టు పద. కాళ్ళు కడుక్కు వస్తాను" అంటూ బాత్ రూంకేసి వెడుతూన్న కూతుర్ని వింతగా చూచింది. తల్లి అన్నం వడించి దగరే కూచుంది.

ఆవిడ ఆశ్చర్యాన్ని పోగొట్టడానికి ఏదో ఒకటి కల్పించి చెప్పక తప్పలేదు. "అక్కడ నా చేతి వంట నాకు సహించలేదమ్మా!"

తల్లి ఆర్ద్రంగా అంది: "నాకు తెలుసమ్మా. అందుకే అయిదో నెల పంపించమంటే పంపించాడు కాదు మీ ఆయన. వేవిళ్ళతో నీ అవస్థలో నువ్వుంటే నీ ప్రాణానికి వచ్చి పడ్డారా మీ అత్తగారూ వాళ్ళు? ఆవిడే మైనా వంట దగ్గరికి వచ్చేదా? నాకు తెలుసులే. తెడ్డుండగా చెయ్యెందుకు కాల్చుకోటం అనే రకం ఆవిడ. అంతా వచ్చి నీ మీద పడి చాకిరీ చేయించుకోడానికి సిగ్గయినా లేకపోయింది వాళ్ళకు. ఉత్త మనిషివి కూడా కాదు."

ఇన్నాళ్ళ ఆకలి ఈ రోజే తీర్చుకొంటున్నట్టుగా తింటూన్న భామను చూస్తే, తల్లి హృదయం మరీ నీరయిపోయింది. అత్తింట అష్టఐశ్వర్యాలూ ఉన్నా పుట్టింటి పుల్లకూరే రుచి ఆడపిల్లకు.

"పిల్లో పిల్లాడో—అయిదు నెలలు పైబడితేగాని పంపించ నీ సారి. అల్లుడేమైనా ఎగిరిపడనీ!"

తన నిర్ణయం ముందు తల్లి ప్రేమాభిమానాలు గుర్తు వచ్చి, ఇంచుక వణికింది భామ.

ఎంత మమకారం ఉన్న తల్లి అయినా వస్తూపోయే కూతురి మీద ఉండే అభిమానం కాపురం వదులుకొని పుట్టింట్లో తిష్ఠవేసే కూతురి మీద ఉండదు.

క్రమంగా భామ నిర్ణయాన్ని కూల్చివేసే అనుభవాలు చాలానే జరిగాయి అక్కడ.

బడి నుండి వస్తూ "సత్యవతీ, ఎక్కడమ్మా ఇలారా. నీ కిష్టమని సపోటాలు తెచ్చాను"—అంటాడు ఆప్యాయతంతా ఒలకబోసి, తండ్రి.

రహస్యంగా చాటుకు పిలిచి, "ఇదుగో" అంటూ నోట్లో ఏదో మిఠాయి కుక్కి నోరు పట్టకుండా ఉక్కిరి బిక్కిరిచేసి, "ఒసే సత్యా! పాపాయిని ఎత్తబోతున్న ఈ శుభ తరుణంలో నా ప్రజంట్" అంటూ మురిపించే చిన్నన్న!

ఆ నెల ఉద్యోగంలో చేరిన తమ్ముడు మొదటి జీతం తెచ్చి

"ఇది నీ పుట్టబోయే పాపాయికి, ఏదైనా చేయించుకోడానికి నా బహుమతి" అంటూంటే; "ఇంకా ఎన్నాళ్ళు మోస్తావే! చిట్టి తల్లీ? నీ మనసులో యింకేం కోరికలున్నాయో చెప్పు. ఏదైనా మనసులో కోరిక ఉంటే కూడా కాన్పు ఆలస్యమౌతుందట," అని పరిహాసాలాడే వదినలూ; ఇందరి మధ్య గాలిలో దీపంలా చలించిపోతూంది భామ నిర్ణయం.

తొమ్మిది వెళ్ళి, పదో నెల కూడా వెళ్ళిపోతూంటే "ఏరు దాటితే తొందరగా కంటారట. ఇప్పుడు ఏరు ఎక్కడ దాటించగలం గాని వనభోజనానికి తీసి కెడదామే!" అని ఓ రోజు వనభోజనానికి కూడా తీసికెళ్ళారు భామను.

భామ అప్పుడప్పుడూ విచారంగా ఉండడం చూసి "మగడి మీద మనసు పోయిందేమో! అయినా ఆ మహానుభావుడూ గట్టివాడే. వచ్చి రెణ్ణెల్లు కావస్తూంది. వచ్చి చూడాలనిపించలేదంటే వింతే. మీ అన్నే అయితేనా...." అనే చిన్న వదిన కళ్ళల్లో కదిలే తృప్తి, గర్వం చూసి నవ్వుకునేది—'అందరికీ ఆ అదృష్టం ఉంటొద్దూ?' అని.

అందరి ఎదిరి చూపులూ అంతమయ్యాయి ఒకనాటి తెల్లవారు జామున.

అతి సుఖంగా ఆడపిల్లను కన్నది భామ.

బిడ్డను పక్కనుంచుకొని పడుకొంది భామ. గంట క్రితం వరకు కడుపులో కదిలాడిన బిడ్డ యిప్పుడు చేతులు కాళ్ళు ఆడిస్తూ పక్కలో గిలిగింతలు పెడుతూంటే ఓ వింత అనుభూతి. విచిత్రమైన హాయి.

"అంతా నీ పోలికేనే, రంగు మాత్రం కాదు. తెల్లగా మాచెకులా పుట్టింది. బతికి బట్టకట్టాలి గాని రాణివాసం వెలగబెడుతుంది!" పిల్లను కాళ్ళమీద వేసుకొని చమురు పట్టించి, చేతులు కాళ్ళు సాగ దీస్తూ అంది తల్లి.

తండ్రీ, అన్నగార్లూ వచ్చి చూశారు.

పెద్ద వదిన ఫ్లాస్కులో పాలు తీసుకొని వచ్చింది, "అమ్మో!

అపురూపంగా చూసిందావిడ.

ఎందరు ఎంత ఆపేక్ష చూపినా, వెలితిగానే ఉంది భామకు. ఆపేక్ష చూపవలసిన వాడు వేరే ఉన్నాడు. ఇలా పక్కన బిడ్డనుంచుకొని పడుకొన్నప్పుడు రక్తం కలుపుకొని రక్తం పంచి యిచ్చినవాడు అపురూపంగా చూపులు కురిపిస్తూంటే ఆ హాయి వేరు.

"ఆ ముద్దుకా?" పళ్ళు కొరుక్కుంది భామ. "ఇంత తొందరగా బిడ్డ తండ్రి కావడమా? ఫామిలీ ప్లానింగ్ అమలు పరుద్దామనుకొన్నానే!" అన్నాడు కాదూ?....ఈ పిల్లను ఎలా ప్రేమించగలడు?

అల్లుడికి టెలిగ్రాం పంపి వియ్యంకుడికి ఉత్తరం వ్రాశాడు భామ తండ్రి, "అమ్మాయి ఆడపిల్లను ప్రసవించింది. తల్లీ బిడ్డ క్షేమం" అంటూ.

* * *

"అతడెవరో వచ్చాడు. ఉదయభాస్కర్ అట."

వదిన వచ్చి చెబితే, ఆనాటి సంఘటన గుర్తు వచ్చి గుండె జల్లుమంది భామకు. 'ఇంతదూరం వెదుక్కొంటూ ఎందుకు వచ్చినట్టు? సానుభూతి చూపడానికా? అనునయించడానికా!' ఏమిటో అతడికి మొగం చూపాలంటేనే సిగ్గుగా ఉంది.

"పచ్చగా పసుపు రాసుకొని పురిటినీళ్ళు పోసుకొన్నావు. మగ వాళ్ళ గాలి సోక కూడదు. ఆయన్ని ఈ కిటికీ దగ్గరికి పంపిస్తాను. ఇవతలనుంచే మాట్లాడు," అని చెప్పి వెళ్ళి అతడిని పంపించింది వదిన.

"ఆరోగ్యంగా ఉన్నారా?" గాగుల్స్ చేతిలో పట్టుకొని తెల్లని సూట్ లో వచ్చాడు.

"ఆఁ. ఇక్కడికి మీకు....?"

"పని మీద వచ్చాను. అలాగే మిమ్మల్ని చూసిపోదామని. కొడుకో, బిడ్డో తెలుసుకొందామని ...ఆ పాటి క్షేమం తెలుసుకొనే అవసరం నాకు లేదా? మొదట బాగుండ దనుకొన్నాను వస్తే. కాని, ధైర్యం చేశాను."

"[illegible] నాకు నచ్చలేదు. అక్కడ ఆయనలాంటి వాళ్ళ

యిక్కడా ఉంటారు. జరిగింది చాలదా? నా ప్రాప్తం యింతే నను కొంటాను గాని; అనవసరంగా మీ రెండుకు నింద పడడం నా మూలంగా?"

"సరే కాని, మీ బేబీని చూపండి."

పొత్తిళ్ళలో బిడ్డను ఎత్తి చూపింది ఇవతలినుండే.

"మీ కంటే అందంగా వుంటుంది మీ పాప."

అతను నిస్సంకోచంగా అంటూంటే, చటుక్కున రెప్పలు వాల్చుకొంది భామ.

కొద్దిగా పాలిపోయిన ముఖం పసుపు పూతతో మరింత ఆకర్ష ణీయంగా మెరిసిపోతుంటే యింకా యింకా చూడాలనిపిస్తూంది!

"అక్కడికి ఎప్పుడు వస్తారు?"

"చేసుకొన్న నిర్ణయం స్థిరమైతే, వచ్చేమాట లేదు."

"అదేమిటి?" కలవర పడ్డాడు విస్మయంగా.

"అదంతే. తరువాత ఎప్పుడైనా కలసికొంటే మీకు చెబుతా గాని, ఇప్పుడు మీరు త్వరగా వెళ్ళిపొండి. వీళ్ళ చెవిలో ఏదైనా పడితే లేనిపోని రభస."

"వస్తానండీ! మీకు వ్రాయాలనిపిస్తే ఎప్పుడైనా ఓ ఉత్తరం ముక్క వ్రాసి పడేయండి," అడ్రస్ కార్డు యిచ్చి స్టూల్ మీది నుండి లేచాడు ఉదయభాస్కర్. అతడి కళ్ళలో ఏదో అవ్యక్తమైన బాధ!

"వెళ్ళి పోతున్నారా? కాఫీ తెచ్చాను" మర్యాదగా కాఫీ కప్పు అందించింది భామ వదిన, ఆడబిడ్డ వైపు సన్నిహితులకు ఆ పాటి మర్యాద చేయడం తన ధర్మం అన్నట్టుగా.

అతడు వెళ్ళిపోయాక అడగనే అడిగింది. "ఎవరాయన?"

"స్నేహితుడు."

"నీకా? మీ ఆయనకా?"

"మగవాళ్ళకేగాని, ఆడవాళ్ళకు స్నేహితు లుండ కూడదా ఏమిటి?"

"నువ్వేమైనా ఆఫీసులో ఉద్యోగం వెలిగిస్తున్నావు గనుకనా, మగ స్నేహితులుండడానికి?"

"ఉద్యోగం చేయకపోయినా అలాంటిదే చేస్తున్నాను. ఈ మధ్య కొన్ని నాటకాలలో పాల్గొన్నాను. మొదటిసారిగా మా మహిళా మండలి తరఫునుండి వేసిన నాటకంలో బాగా నటించానని, ఇప్పుడు వచ్చి నతడు ప్రోత్సహించి మరికొన్ని నాటకాల్లో పాల్గొనేట్టు చేశాడు. రేడియో నాటకాలలో కూడా పాల్గొనే అవకాశం కలిగించా డీయన. ఈయన మంచి రచయిత, వదినా! మా మహిళామండలి ప్రెసిడెంటు గారి తమ్ముడతడు. అందుకని బాగా పరిచయమయ్యాడు."

సందేహంగా చూడసాగింది వదిన. "మీ ఆయన స్నేహితు డేమో, కాకపోతే మీ స్నేహితురాలి భర్తేమో అనుకొన్నాను."

'నీ స్నేహితు డేమిటి? పుట్టింట్లో పురుడు పోసుకోడానికి వచ్చిన నిన్ను చూడాలని రావడ మేమిటి?' అన్నట్టున్నాయి ఆమె చూపులు.

అంతరంగం అదురుతూన్నా మొండి ధైర్యం తెచ్చుకోక తప్ప లేదు భామకు!

# 20

బారసాల చేసుకోడానికి భామ భర్త వస్తాడని, పల్లెనుండి భామ అత్తగారు వస్తారని ఎదురు చూశారు భామ యింట్లో. ఎంతో అట్టహాసంగా బారసాల ఏర్పాట్లు చేశారు. అత్తగారి వైపు వాళ్ళు ఒక్కరు కూడా రాలేదు.

మధ్యాహ్నం దాకా ఎదురు చూసి నిస్పృహగా గదిలోకి వచ్చింది సత్యభామ తల్లి.

"ఇదేం మర్యాదే? ఒక్కరు కూడా రాలేదు? వచ్చేముందు ఏమైనా పోట్లాట జరిగిందా?"

"………" పిల్లను ముద్దాడుతున్న నెపంతో జవాబివ్వలేదు భామ.

"చెప్పడంలేదు నువ్వు. ఏం జరిగింది? కాకపోతే నువ్వు వచ్చి నప్పటి నుండి ఒక్క ఉత్తరం ముక్క కూడా లేకపోవడ మేమిటి, మీ ఆయన వచ్చి చూసి వెళ్ళకపోయినా?"

వాళ్ళు రాలేదని యింతాచేసి, పిల్లను తొట్టెలో వేయకుండా ఎలా ఉంటారు?

కాని, నిరుత్సాహంగ నే జరిగాయి అన్నీ.

అవతల హాల్లో పేరంటాళ్ళంతా వచ్చి కూచుంటే భాను తల్లి గదిలోకి వచ్చింది. "నీ సూటుకేసు తాళం చెవులిటుతే నగలు తీస్తాను. ఇలాంటప్పుడు పెట్టుకోకపోతే పెట్టెలో పెట్టి మురవడానికా?"

సాకులు వెదకడం అనవసరం. ఇవాళ కాకపోయినా రేపైనా తెలిసే విషయమే ఇది.

"వాళ్ళు పెట్టిన నగలేవీ తీసుకురాలేదు."

"ఏం? ఎందుకు? వాళ్ళేమైనా అన్నారా?"

"నేను చెప్పకపోయినా రేపు వాళ్ళవల్ల తెలుస్తుంది."

అవతల పాపను తొట్టెలోవేసేవేళ మించిపోతుంటే, ఇప్పుడు సాగదీస్తూ కూచోలేదు. "పద, పద. తరువాత తేలుస్తాను సంగతి."

పాపకు "సూర్యప్రభ" అని నామకరణం చేశారు.

రాత్రి అందరిభోజనాలూ అయి, నిద్రలకు ఎక్కడివాళ్ళు అక్కడికి వెళ్ళిపోయాక భాను గదిలోకి వచ్చింది తల్లి. "ఇప్పుడు చెప్పు. ఏం జరిగింది?"

"తెగతెంపులు చేసుకొనే వచ్చాను."

"ఆఁ!" ఆవిడ నోరు తెరిచింది." అంత మించిపోయేది ఏమొచ్చింది?"

"మీతో చెప్పి లాభంలేదమ్మా. నేను అన్యాయాలుగా భావిస్తు న్నవి, నాకు అసంతృప్తిగా తోస్తున్నది ప్రతి సాధారణ గృహిణీ పట్టించుకోకుండా అనుభవించేవే. అవేనాకు విపరీతంగా, సహించ రానివిగా తోస్తున్నాయి."

"నువ్వు కొండమీద నుండి ఊడిపడ్డావా? ఆ సాధారణ గృహిణి కడుపునుండి పుట్టిన దానివే కదా?"

"అలాంటివాటికి నేను సమాధానం చెప్పలేను." బరువుగా
ంమ. వాంఛతప్ప ప్రేమలేదు. ఏదో చాకిరీకి కొన్న దాసీ పిల్లలా తప్ప అర్ధాంగి అన్న సమరసభావం, కష్టంలో సానుభూతీ, దాంపత్యానికి కావలసిన రసానుభూతి—అవేవీలేవు. ఇలాంటి సూక్ష్మమైన విషయాలు ఎలా చెప్పగలదు?

"ఇవి నీకు కష్టంగా తోస్తున్నాయా? ఆడ దానివై పుట్టి ఆ మాత్రం ఓర్చుకోకపోతే ఏమన్నమాట?" అంటూ అమ్మలాంటివాళ్ళు తంతారుకూడా.

తెల్లవారడంతో అందరికీ తెలిసిపోయిందీ సంగతి.

వెల్ల వేసినట్టు మారిపోయాయి వాళ్ళముఖాలు.

తండ్రివచ్చాడు. ముందు అనునయింపుగా అడిగాడు. జవాబు రాకపోయేసరికి కొంచెం కోపంగానే గద్దించాడు కూతుర్ని. "అసలు జరిగిన సంగతేదో చెప్పు. వాళ్ళది తప్పుంటే వాళ్ళను నాలుగూ ముఖం మీద తన్నివస్తాము. నీది తప్పుంటే క్షమార్పణ చెప్పుకొని తల్లీ పిల్లను అప్పగించి వస్తాము."

"కొంచెం సోషల్‌గా ఉంటున్నానని లేనిపోని నిందలువేసి బాధిస్తున్నారు, మనిషి మీద ఆపాటి నమ్మకం లేకపోయాక అతడితో ఆ కాపుర మెందుకు?"

"అతడి కిష్టం లేకపోతే సోషల్‌గా తిరగకపోతే ఏమైంది? నీకు కావలసింది సంసారంగాని తిరుగుళ్ళతో అవసర మేమిటి?"

"నమ్మకం, ప్రేమాభిమానాలు లేకపోయాక, ఆ కాపురం నా కక్కరలేదు." ముఖం తిప్పుకొంది.

"సంసారం వదులుకోవడమంటే అంత సులువైన సంగతికాదు. సంసారం వదులుకొని నువ్వేదైనా ఉద్యోగం వెదుక్కొని బ్రతుకుతానన్నా అది నీకూ గౌరవప్రదం కాదు; మాకూ కీర్తి దాయకం కాదు. చూడు సత్యా! చదువుకొన్నావు, ఇంతవరకు అన్నీ తెలిసిన యోగ్యురాలివే అనిపించుకొన్నావు. ఇవాళ నేను నీకు బుద్ధి చెప్పవలసి వస్తుందనుకోలేదు. అన్నీ అనుకూలమైన కాపురాలు ఎక్కడున్నాయి, చెప్పు! సహనం స్త్రీకి భూషణం.

"అతడిలో కాస్త ఆలోచనాశక్తి తక్కువేమో. ఇదే స్థితిలో ఎప్పటికీ ఉండడు. బిడ్డ తండ్రి కూడా అయాడు. నిదానం సహజంగా వస్తుంది. నువ్వు తొందరపడకు.

"నెల లోపల ఎలా పంపించగలం గాని, మూడో నెల పడ్డాక మీ అమ్మ వచ్చి దిగబెట్టి వస్తుంది. పిచ్చిపిచ్చి ఆలోచనలు వదిలేసి, సంసారం చక్కదిద్దుకొనే ఉపాయం వెదుక్కో!" అదే ఖాయం అన్నట్టుగా లేచి నిలబడ్డాడు ఆయన.

రెచ్చిపోతూ వచ్చింది తల్లి. "బిడ్డ తల్లి కూడా అయింది. ఇంటా వంటా లేని ఈ బుద్ధి ఎక్కడిదో దీనికి?"

అందరి ఆర్భాటాలకూ ఒక్క తిరస్కార వీక్షణం తప్ప మరేమీ అనడంలేదు ఖామ. అందరి తిట్లకూ జవాబులేకుండా రాయిలా ఉండిపోతూంది!

అసలు జరిగిన సంగతేదో తెలుసుకు రావడానికి పెద్దకోడలు సరోజను ప్రయాణం చేయించారు ఈ వారంరోజుల్లోనే వెళ్ళడానికి.

కాని ఈ లోపలే ఖామ అత్తమామలు దిగారు.

ఒక్క ఖామకు తప్ప తక్కిన పెద్దల గుండెలన్నీ దడదడ లాడాయి.

"కాళ్ళు కడుక్కోండి ముందు...."

వియ్యపురాలి మర్యాదలు చేయబోతే ఈసడించి పారేస్తూ అన్నారు: "మీ ఇంట్లో కాళ్ళు కడిగేరోజులు పోయాయి. మీ మర్యాదల కోసం రాలేదు, అయిన మర్యాదలుచాలు ఇక్కడికి. మా వాడు పిల్లను తీసుకురమ్మన్నాడు."

"మూడో నెల రాగానే మేమే తల్లీ బిడ్డను తీసుకువచ్చి దిగ బెట్టాలనుకొన్నాం."

ఖామ తండ్రికి విసురుగా అడ్డంపోయాడు వియ్యంకుడు; "ఆవిడెక్కడికి? మా వాడు దాన్ని ఏలేది కల్ల. బరితెగిన ఆడది. మా బోటి మర్యాదస్తుల ఇంట ఉండదగనిది. బుద్ధి చెప్పుకొంటారో, ఆవిడ చేష్టలు చూచి ముచ్చటపడతారో—మీ ఇంట్లోనే ఉంచుకోండి. [illegible]"

ఇవతలి వాళ్ళను పూర్తిగా హీనంగా, పూచిక పుల్లలా తీసి పారేస్తూంటే సహించలేకపోయాడు భామ తండ్రి, "జరిగిందేమిటో చెప్పండి. మా పిల్లది తప్పుంటే నాలుగు చీవాట్లేసి బుద్ధి చెబుతాం. ఏదీ చెప్పకుండా మావాడు మీ పిల్లను వదిలేస్తాడంటే ఇదేం మర్యాదస్తుల లక్షణమా?"

"ఆవిడ నడిపిన భాగోతం ఒక్కటనా? ఒక ఘట్టమనా? నాటకాలనీ, మహిళా మండలి అనీ, సాంఘికసేవలనీ, ఇన్నీ సరే. ఒక మర్యాదస్తుడి భార్య, ఈమెకు మగవాళ్ళతో స్నేహాలెందుకొచ్చాయిట? వాడితో వీడితో వేళాపాళా లేకుండా తిరగడమా? పస ఉన్న మగవాడెవడైనా సహించే దేనా? మా వాడు గనుక సరిపోయింది. మరొకడైతే గొంతుపిసికి గోయితీసి నడి ఇంట్లో పాతి పెట్టేవాడు."

కూతురిమీద విరుచుకుపడింది భామతల్లి. "ఇంటా వంటా లేని పనులు ఏమేంచేశావో, ఇక్కడికి లెంపలు వేసుకొని ఆ పెద్దవాళ్ళ కాళ్ళు పట్టుకోపోవే, బుద్ధిలేనిదానా!"

విసురుగా ముఖం తిప్పుకొంది భామ.

"కాళ్ళమీద పడవే. వాళ్ళు పిల్ల నిమ్మంటున్నారు!"

చాలా నిగ్రహంతో అంది భామ: "తీసుకుపోనీ, నా బ్రతుకే నాకు భారమౌతే అది కూడా ఎందుకు నామెడకు!"

"ఓహో! "అంతదాకా వచ్చింది వ్యవహారం?" మొన్న ఉదయ భాస్కర్ రాకడ గుర్తువచ్చి, సర్వం అర్థమైనట్టుగా చూసింది. "ఎవడి కోసం నీ కడుపు తీపికూడా చంపుకొంటున్నావో—వాడు నిన్ను గోతిలో దింపి ఉడాయిస్తాడే, అప్పుడు నీ బతుకు కుక్కలు కూడా పట్టించుకోవు."

"అమ్మా!" అసహనంగా రంకెపెట్టింది భామ. "నేను ఎవడి వ్యామోహంలోనూ పడలేదు. కేవలం నా ఆత్మాభిమానాన్ని నిలబెట్టుకోవడం కోసమే నేను కాపురాన్ని వదులుకొంటున్నాను. ప్రాణాధికమైన నా బిడ్డను వదులుకొంటున్నాను. ఇక్కడితో ఆగిపోదు కాలం. ముందు చూడండి. మీ కూతురు ఒక సంసారం వదులుకొన్నదనే తప్ప మరో అపవాదు మీకేదైనా తీసుకువస్తానేమో."

"మగణ్ణి వదిలేయడం కంటే మించిన అపవాదు ఏముందే, తల్లీ?" నెత్తి బాదుకుందావిడ. కూతురిని లొంగదీయడం చేతగాక, వియ్యపురాలి చేతులు పట్టుకొని ప్రాధేయపూర్వకంగా; "పెద్దవాళ్ళు మీరు. సహనంవహించాలి. దాన్ని మీరు క్షమించకపోతే ఎవరు క్షమిస్తారు? ఒక కాపురం కూల్చడానికి ఒకక్షణం పట్టదు. నిలబెట్టడానికి ఎంత ప్రయత్నం కావాలి? మీ కొడుకు కాపరం పాడైతే మీకు బాధలేదా? కోడలు వదిలేసిం దంటే మీకూ మచ్చేకదా?"

"మాకేం మచ్చకాదు. మా వాడికేం మగమహారాజు. దీని ముఖాన విడాకులు పడేసి లక్షణంగా మరో పిల్లను పెళ్ళాడి సుఖపడతాడు. చెడేది మీ పిల్లే. మచ్చలూ, మానని గాయాలూ మీకే."

భామ తలిదండ్రులు వాళ్ళను కొండ దింపడానికి మరీమరీ ప్రాధేయపడ్డారు.

ఏదో జాలిదలిచి నట్టుగా చివరికి సెలవిచ్చాడు భామ మామగారు, "వచ్చి మావాడికాళ్ళమీద పడమని చెప్పండి. మేమూ చెప్పవలసిన తీరుగా చెబుతాం. ఆ పైన మీ పిల్ల అదృష్టం-మీ అదృష్టం."

"అమ్మాయ్! నువ్వింక ఒక్కమాట ఎదురుచెప్పినా మర్యాద దక్కదు. రేపు వాళ్ళతో ప్రయాణం కట్టు."

"నేను ఎవరికాళ్ళమీదా పడదలుచుకోలేదు. ఆ ముష్టి కాపురం నా కక్కరలేదు. పిల్లను కావలిస్తే తీసికెళ్ళండి." పాపను పొత్తి గుడ్డలు కూడా లేకుండా గడప ఇవతల పడేసి, ధభేలున తలుపేసుకొని, తలుపునానుకొని వెక్కివెక్కి ఏడవసాగింది భామ.

పచ్చివెలక్కాయ గొంతులో పడింది భామ అత్తగారికి. పిల్లను తీసికెడతామంటే పిల్లకోసం కుక్కలా వచ్చిపడి ఉంటుందనుకొన్నారు గాని, పిల్లను తీసి ముఖంమీద కొట్టి పొమ్మంటుందని కలలోకూడా అనుకోలేదు పాపం. చాటుకుపోయి వాళ్ళలో వాళ్ళు ఏవో గుసగుసలాడుకున్నారు.

చివరికి వియ్యంకుల ఎదుటికివచ్చి తమ అవస్థేమీ కనిపించనీకుండా పిల్లనిచ్చుకొన్నవాళ్ళను కరుణించే దేవతల్లా "తల్లీ పిల్లను ఎడబాపే పాపం మాకెందుకుగాని మీ బిడ్డకు బుద్ధిచెప్పి తీసుకువచ్చి

వాడికాళ్ళమీద వేసిపొండి. ఈ నెల లోపలే జరగాలి. ఆపైన ఎవరికనీ లాభంలేదు."

"మరొకసారి చెబుతున్నాం. మావాడేం చెడిపోడు. చట్టసమ్మతంగా విడిపోయి మళ్ళీపెళ్ళి చేసుకొని సుఖపడతాడు. మీ పిల్లగతే అధోగతి."

వెళ్ళిపోయారు వాళ్ళు.

ఎవరు నచ్చజెప్పి లాభం లేకపోయింది భామకు.

వివరంగా సంగతేమిటో కనుక్కుందామని, ఈ మనువు కుదిర్చిన భామ పెద్దవదిన సరోజ జగన్మోహన్ దగ్గరికివెళ్ళింది. ఒకటికి రెండుచేసి చెప్పాడతడు. పాలతొండను పామునుచేసి వర్ణించాడు. తప్పంతా నీ ఆడపడుచుదే పొమ్మన్నాడు.

"మా సత్య కొంచెంపెంకెదే, అన్నయ్యా! ఆ సంగతి నీకు పెళ్ళికిముందే తెలుసుకదా? సహించలేనివాడివి, సర్దుకుపోవడం చేతగాని వాడివి ఆమెను పెళ్ళెందుకు చేసుకొన్నావు?"

"పెంకెదైనా పెళ్ళయ్యాక తగ్గుతుందనుకొన్నాను. తగ్గడం మాట అటుంచి మందలించే కొద్దీ రేగిపోతూందావిడ! అవసరమో, అనవసరమో-సవ్యమో, అసవ్యమో నేను వద్దన్నపని తనెందుకు చేయడం? ఆ పాటి అభ్యంతరం, ఆంక్షలు పెట్టలేకపోతే నేను మగాణ్ణయి ఏ లాభం! తను అభిమానవతీ, నేను పేడిమూతివాడినా?

"అందుకే ఆవిడదారి ఆవిడదీ, నాదారినాదీ."

"ఒక నిండు సంసారం కూలిపోతుంటే చూస్తూ ఊరుకోలేం, అన్నయ్యా!"

"నిజంగా అందుకు చింతించాల్సింది అది. నీకూ, నాకూ ఎందుకు?"

"ఉహుఁ. తొందర పడుతున్నావు నువ్వు. మా సత్య ఊహాలు, భావాలు మారిపోతున్న ఈ సమాజానికి అనుకూలంగా సాగిపోతున్నాయేమో. అభ్యుదయం పేరిట ఇంకా కొంచెం ముందుకుకూడా వెళ్ళిందేమో. నువ్వు అందుకు అనుకూలంగా మారకపోవడమే మీ దంపతుల మధ్య ఈ కలహమేమో. నువ్వు కొంచెం అభ్యుదయంవైపు చూపు

పోనీయరాదూ? పేచీ తగ్గుతుంది."

"చిలకలాపలకకు, సరోజా, నాకు కోపంవస్తుంది. ఎవడితోనో అర్ధరాత్రిపూట కారులోవచ్చి దిగితే, అభ్యుదయంపేరుతో కళ్ళు మూసుకొని కాపురం చేయమంటావా, అలాంటిదానితో?"

"మగ స్నేహితుడైనంత మాత్రాన తప్పుగా ఎందుకు అర్థం చేసుకోవాలి? వాళ్ళది స్వచ్ఛమైన స్నేహమేకావచ్చు."

"కావచ్చు. కాని అలాంటి స్నేహాలకు తిరుగుళ్ళకు మన కుటుంబం, వంశం అలవాటుపడ్డాయా? ఇది కొత్తగా నేరుపుతుందా?

"నీ ఆడబిడ్డ మగణ్ణి వదిలేసిందంటే మీ కుటుంబానికి మచ్చ వస్తుందని నువ్వు ప్రాకులాడుతున్నావు. ఎవరిస్వార్థం వాళ్ళది. అది ఎలాంటిదైతేనేం? కళ్ళు మూసుకొని కాపురం చేయమంటున్నావు. కాని, అది అసంభవం.

"అదివచ్చి నాకాళ్ళమీదపడితే, అప్పుడెలా ఉండేదో పరిణామం. ఇప్పుడేం లాభం లేదు నీ రాయబారం." ఇప్పుడు తను తగ్గడం నామోషీ. ఇంకా తలకెక్కి కూచోగలదు. తలిదండ్రులను పంపించక ముందు అతడు బింకంగా ఉన్నాడు-బిడ్డ తల్లి అయ్యాక ఎలా తప్పించుకోగలదని. భామ సవాల్‌గా నిలిచి పోతుం దనుకోలేదు.

సరోజరాకతో సంగతులు తెలిశాయి.

అందరూ భామను తిట్టేవారే.

"దీనికేదో రోగంపుట్టింది నిజంగా. జీతంకూడా చేతికిస్తున్నాదట. ఏం చేసుకొన్నా అడిగేవాడు కాడుట. మాకు ఆపాటి భాగ్యంకూడాలేదు. ఏం తక్కువైందని దీనికా పాడు బుద్ధి పుట్టినట్టు! ఇంటి ముందుకు ఏ కావలసిన సామానువచ్చినా ముందు ఎవళ్ళదగ్గరో బదులుచేసి అయ్యనొచ్చాక అప్పుచేశానంటూ అడిగి అడిగి ఇప్పించుకోవాలి."

మగడిజీతం చేతిలోపడినంతమాత్రాన పొందే సౌఖ్యమేమిటో అమ్మకెలా తెలుస్తుంది? దొంగకు తాళం చెవులివ్వడంలోగల లౌక్యం నాన్నకు తెలియకపోవడంవల్ల, అమ్మ ఆటలు సాగుతున్నాయి.

పండగలకూ, ఆడపిల్లల సారెలకూ అవసరమైనప్పుడల్లా షాపు నుండి గుడ్డలు తెప్పిస్తుంది, కిరాణా కొట్టునుండి ఎప్పుడు అవసరమైన

వస్తువు అప్పుడు తెప్పిస్తుంది. చేతులో నగదుపైకం ఆడకపోయి అప్పుచేయడంలో వెనుకంజవేయదు ఆమె.

నాన్న పని అంతా బిల్లుచూడడం, డబ్బు ఉన్నప్పుడలా వేయడం! ఎందుకు చేశావీ అప్పు? అని ఎప్పుడూ విమర్శించిన పాపాన పోలేదు ఆయన.

మగడు జీతం చేతిలో పెట్టినంతమాత్రాన సౌఖ్యమేమిటో, లేనిపోని ఇరకాటం తప్ప.

శాయశక్తులా నచ్చజెప్ప జూశారు భామకు. వినకపోతే మందలించారు. చీవాట్లేశారు. చివరికి విసిగి–"కాపురం చెడగొట్టుకొన్నవాళ్ళకు నా ఇంట్లో స్థానంలేదు," అన్నాడు తండ్రి బెదిరిద్దామని. పసిగుడ్డుతో ఇప్పుడెక్కడికి వెళ్ళగలదన్న ధీమాతో.

కాని, రెండేరెండు నిమిషాల్లో తయారైపోయింది భామ, భుజంమీద పసిపాపతో, చేతిలో సూట్‌కేసుతో.

"సెలవు, నాన్నా." నీ గడపదాటివెళ్ళి, చెడ్డపని ఏదీ చెయ్యను. భవిష్యత్తు చెడగొట్టుకోను. నాకాళ్ళమీద నిలబడి పైకి వెళ్ళిపోగలనన్న నమ్మకంతో వెడుతున్నాను. ఒక్క సంసారం చెడగొట్టుకొన్నానన్న అపవాదుతప్ప మీకు కళంకమేదీ రానీయనని హామీ ఇస్తున్నాను."

భామ వెళ్ళిపోతుంటే, అందరూ అవాక్కలై పోయారు.

పురిటికి తీసుకువచ్చినప్పుడు, అయిదునెలలు బాలింత తనం జరిపిగాని తల్లీ పిల్లను పంపించనన్న తల్లి, ఏ మూలనో నోట్లోగుడ్డ కుక్కుకొని కుమిలి కుమిలి ఏడుస్తూ ఉండిపోయింది.



**భుజంమీద పాపతో** గుమ్మంలో నిలబడ్డ భామను చూసి విస్మయంతో ఆహ్వానించింది శ్యామసుందరి.

"లోపలికిరా."

సూట్ కేసు ఓ పక్కకుపెట్టి, శ్యామసుందరి చాచిన చేతుల్లో పాపను ఉంచి లాగుతున్న చేతులను ఒత్తుకొంటూ సోఫాలో కూచుంది భామ.

"ఏం పేరు?"

"సూర్యప్రభ."

"ఏమిటి విశేషాలు?" సూటుకేసు వైపు సైగచేసి అడిగింది. సత్యభామ పుట్టింటికి వెళ్ళడం తెలుసు. తరువాత జగన్మోహన్ ఇల్లు ఖాళీచేసి మరోవీథిలో ఇల్లు తీసుకోవడం తెలుసు. ఆపై సంగతులేవీ తెలియవు.

"అన్ని వివరాలూ తరువాత, ముందు నాకేదైనా ఉద్యోగం చూసిపెట్టాలి అన్నయ్యా."

చంద్రశేఖర్ ఆశ్చర్యంగా ఇటే చూస్తున్నాడు. "పోట్లాడుకొన్నారా ఇద్దరూ?"

"పోట్లాడుకోవడం కాదు. తెగ దెంపులే జరిగిపోయాయి." కొంచెం ఆవేదనగా అంది భామ.

"ఉఁ." బరువుగా మూలిగాడు.

"కొంచెం వంటింట్లోకి పదండి. శోష వచ్చేట్టుంది."

పాపను సోఫాలో పడుకోబెట్టి లేచింది. "చెప్పవేం? మీ పుట్టింటినుండేనా ఇప్పుడు రావడం?"

"అక్కడినుండే."

"వాళ్ళతోకూడా పోట్లాడావా?"

"మగణ్ణి వదిలేసినదానికి మా ఇంట్లో స్థానంలేదన్నాడు. అదేమిటో మగవాడికంత ఆధిక్యం? పుట్టగా, పెరగగా నేనొక్కదాన్నే. మధ్యంతరంలో అతగాడితో ముడిపెట్టి, ఆ ముడి ఉరిలా మెడకు బిగుసుకుపోతున్నా, ఆ ముడికే బలియై పోవాలనడం అదేమి ధర్మమో బోధపడ్డం లేదు నాకు!"

"మన బిడ్డలను పెంచి పెద్ద జేసిననాడు తెలుస్తుందేమో ఆ ధర్మం." నవ్వుతూ వంటింటికేసి దారి తీసింది శ్యామసుందరి.

* * *

చేతినిండా ఫైల్స్‌కట్టతో ఆఫీసునుండి ఇంటికి వస్తూంది భామ.

"సత్యభామా!"

తన వైపుకే వస్తూన్న రాఘవేంద్రను చూసి గతుక్కుమంది. మొదట కొంచెం విచ్చలవిడిగా ఉండేదేమో గాని, ఇప్పుడు మరీ కట్టు దిట్టాలైపోయాయి. మగణ్ణి విడిచిన ఆడదంటే ఇప్పుడు అందరి కళ్ళకూ పని, ఎవరైనా ఏమైనా అనుకోనీ అని తన తత్త్వానికి అనుగుణంగా తిరిగేదేగాని, వస్తూ తండ్రికి మాట ఇచ్చివచ్చింది మీకు మచ్చవచ్చే పనేదే చెయ్యనని. తనకు తానే సంకెళ్ళలో బందీ అయింది కనుక.

"నేను విన్నది నిజమేనా, భామా?" చాలా చింతిస్తున్నట్టుగా అడిగా డతడు.

"ఏమని విన్నావు?"

"ఇద్దరూ విడిపోయారని."

"ఇంకా చట్టసమ్మతంగా విడిపోలేదు. అదొక్కటే మిగిలి ఉంది."

"ఛ! బాగుండలేదు నువ్వు చేసినపని! నీకు వీరోచితంగా ఉందేమోగాని మన హైందవ వనితకు తగనిపని." అతడి విమర్శ ఎదలో చురుక్కు మన్నా పైకి నవ్వుతూనే చురుగ్గా చెప్పింది. హైందవమని, పాతివ్రత్యమని ఇదివరకే ఆడదాన్ని అబలను చేసి మగవాడి పాదాలక్రింద చీమల్లా బ్రతికేట్టు చేశారు. ఆ నీతులు, ధర్మాలు ఆర్థిక లోపంతో అవస్థపాలై బ్రతికే ఆడదానికి చెప్పండి. చేసిన పని బాగా లేకపోవడం నాకేనా? అతడికి కాదా?"

"ఆర్థిక సమానత్వంలో విలువలు మారిపోతాయా? నువ్వు ఉద్యోగంచేసి దర్జాగా బ్రతక గలిగినంత మాత్రాన ఆ సంసార సౌఖ్యం, ఆ రక్షణ వస్తాయా?"

"మీలో ఆ సద్విమర్శకు స్థానమే ఉంటే ఇదే ప్రశ్న నన్ను దూరం చేసుకొన్న ఆ మగవాడిని అడగండి, వెళ్ళి. నేనే కాదు. అతడు కూడా నేను దూరమైన వాటికి దూరమయ్యాడు."

"సహనం స్త్రీకి భూషణమని."

"ఆ భూషణం పురుషుడి కెందుకు అక్కరలేదు?"

"వికటంగా మాట్లాడే వారికి జవాబు లెక్కడుంటాయి?" కాని,

అతడి మగ హృదయం భామ చేసింది ఒప్పని ఒప్పుకోవడం లేదు!

"ప్రభ ఎలా ఉంది? నానమ్మపోయినందుకు బెంగపెట్టుకొన్నట్టుగా ఉందా?"

"అలవాటయిపోయింది ఆ పిల్లకు, బాగానే చదువుకుంటూంది."

"ఇప్పటికి కూడా నీకు పెళ్ళి చేసుకోవాలని అనిపించడం లేదన్న మాట?"

"ఏదో సాగిపోనీ జీవితం. మళ్ళీ లేని పోని జంజాటం దేనికి? మళ్ళీ ఏదైనా జరిగితే దెబ్బతిన్న హృదయం మళ్ళీ దెబ్బకు తట్టుకోలేదు."

"ఎప్పుడూ అలాగే జరుగుతుందని ఎందు కనుకోవాలి? భయ పడితే మనం ఏం చేయగలం? వెర్రి భయాలతో నిరర్థకంగా గడిచి పోయే జీవితం, ఒక ఆడదాన్ని అదృష్టవతిని చేయగలిగితే వెనకంజ వేయడం పాపం."

"అర్థం కావడం లేదు నీ భాష."

"స్త్రీని పువ్వుల్లో పెట్టి పూజించే హృదయం నీది. నీ జీవితంలో ఒక ఆడపిల్లకు స్థానం యివ్వగలిగితే కోటి పువ్వుల్తో దేవుడిని కొలిచి పుట్టినట్టే ఆమె."

"నా మీద నీకంత నమ్మకముంటే, నువ్వే నా జీవితంలోకి రాకూడదూ?"

"నా మాట నువ్వు అపార్థం చేసుకున్నట్టుంది. ఒక ఆత్మ బంధువుగా భావించి చెబుతున్నానంతే. కాపురం వదులుకొన్నానన్న అపవాదు తప్ప మరో మచ్చ వచ్చే పనేదీ చేయనని మాటిచ్చాను, మా నాన్నకు. అందుకని, నా భర్త దగ్గరున్నంత స్వేచ్ఛకూడా ఉండదు నాకు. ఎంతో అవసరమైతే తప్ప నువ్వు నన్ను కలుసుకునే అవకాశ మేదీ కల్పించుకోవద్దని మనవి చేస్తున్నాను....పాపకు నా ముద్దులు చెప్పు.... వస్తానిక." మరోమాటకు అవకాశమివ్వకుండా చకచకా సాగిపోయింది భామ, ఆ వేదనతో చలించే అతడి నేత్రాలను తను చూడనట్లే నటిస్తూ.

* * *

శ్యామసుందరి కంఠంవిని, "గడియలేదు. రండి." అని జవాబిచ్చింది, పాపకు పాలిస్తూన్న భామ.

"ఏం చేస్తున్నావ్?"

"రండి, కూచోండి." లేచి చాపవేసింది, కుర్చీపక్కన స్టూల్ మీద కాగితాలు రెపరెప లాడుతూంటే నవ్వుతూ ప్రశ్నించింది శ్యామసుందరి: "ఎలా ఉంది ఆఫీసుపని?"

"కొంచెం కష్టంగానే ఉంది. అయితే, కష్టించి బ్రతుకుతున్నానన్న తృప్తి ఉంది."

"వీరనారివి."

"వెక్కిరిస్తున్నారా?"

"అబ్బే! బెంగపెట్టుకోలేదుకదా, మగడిమీద? ఇంట్లో పాపను ఆడించుకొంటూ; హాయిగా బ్రతక్క ఇదేం ఎద్దుచాకిరీ, బాబూ- అని బాధపడుతున్నారా?"

విరక్తిగా అంది భామ: "బెంగపెట్టుకోవడానికి ఏకాస్త మమత కూడా మిగల్చలేదాయన. వాళ్ళ వాళ్ళకూ ఆయనకూ ఎద్దుచాకిరీ చేసిన రోజులున్నాయి. అలసటతో ఒళ్ళంతా నలగ గొట్టేసినట్టే అయి, రాత్రి పడుకొనేప్పటికి జ్వరం వచ్చిన దానిలా బాధపడే దాన్ని. అలాంటప్పుడు పని ఎక్కువైంది కదూ? చాలా అలసిపోతావు, అని ఓ చల్లని ఓదార్పు ఆయన్నుండి లభిస్తే, ఆయన ఎదమీద హాయిగా వాలిపోయి మరునాటి కష్టానికి ఆనందంగా తయారయేదాన్ని. అతడొక బండ, అలాంటి అవసరమెప్పుడూ ఆయనకు కనిపించలేదు. ఇప్పుడీ కష్టం చేస్తున్నా నా కాళ్ళమీద నేను నిలబడి నా పాపను పెంచుకుంటున్నానన్న తృప్తి ఉంది నాకు."

"పిల్ల కొంచెం పెద్దదైందంటే నా పిల్లను నాకిమ్మని వస్తాడేమో అతడు?"

"రావచ్చునేమో!" మమతగా బిడ్డను గుండెలకు హత్తుకొంది.

"ఇస్తావా?"

"ఇవ్వలేను. తప్పని పరిస్థితి వస్తే అప్పుడేం చేస్తానో తెలియదు."

"సరేగాని, కొంచెం షాపింగ్ చేద్దాం, బయల్దేరు. ఎల్లుండి పాప పుట్టినరోజు. గౌనొకటి తీసుకోవాలి."

ఇంటికి తాళం పెట్టి పాపను తీసుకొని బయల్దేరింది భామ, శ్యామసుందరితో. తనుకూడా ఓ గౌను, బిస్కెట్ పాకెట్, ఓ చక్కని బొమ్మా తీసుకుంది శ్యామసుందరి పాపకు.

వస్తూ, దోవలో, పార్కులో కాస్సేపు కూచుని వెడదామంది శ్యామసుందరి.

"ఊహుఁ. అలాంటి సరదాలకేమీ పోదలుచుకోలేదు. ఇల్లూ ఆఫీసూ, ఎంతో అవసరమైతే తప్ప ఇలా బయట తిరగడం తప్ప మరే సరదాలకూ పో దలుచుకో లేదు."

"ఇదేం వైరాగ్యం?"

"మా నాన్నకు మాటిచ్చాను; వాళ్ళకు చెడు పేరు వచ్చే పనేదీ చేయనని. నాకై నేను చాలా హద్దుల్లో బంధించుకో వలసి వచ్చింది జీవితం. కట్టుకొన్న వాడు సహృదయుడైతే, గృహిణికి ఉన్న స్వాతంత్ర్యం, మరెవరికీ లేదు. సోషల్‌గా ఎలా తిరిగినా, తప్పు లేదు."

"తుంట విడిచి మొద్దు ఎత్తినట్టుగా యిదేం పని? హాయిగా మొగుడి దగ్గరుండు వెళ్ళి."

"ఆత్మాభిమానాన్ని చంపుకొన్న రోజున అలాగే చేస్తాను."

"అర్థం కావడం లేదు నువ్వూ, నీ ఆశయం."

"ఎప్పుడో ఒకరోజు అవుతుందిలే!"

* * *

"మేడమ్!"

ఆ పిలుపును రెండుసార్లు నిర్లక్ష్యంచేసి మూడోసారి వెనుకకు తిరిగింది, భామ. చాలా గంభీరంగా అడిగింది: "ఏం కావాలి?"

రెండుసార్లు పెదవులు తడుపుకొన్నాడు, ఇరవయ్యేళ్ళలో ఉంటాడనిపించే ఆ యువకుడు. "మీరుండే యింటికి ఎదురుగా ఉండే

రూమ్‌లో ఉంటాను. మీ సంగతులు విచారించగా తెలిసింది, మీరు వంటరి వారని. ఏ సమయంలో నైనా నా సహాయం కావాలి స్తే..."

"నీ అభిమానానికి చాలా కృతజ్ఞురాలిని, తమ్ముడూ!"

ఆవిడ చిరునవ్వు అదిరిపాటుగా తోచినా తమాయించుకొన్నాడు. "ఆ వరుసెందుకు లెండి. నాకు అక్కగార్లకు కొరతేమీ లేదు."

"నీ ఉద్దేశ మేమిటి నన్నిలా కదిలించడంలో?"

"మీలాంటి వాళ్ళు చాలా సూక్ష్మగ్రాహులై ఉండాలి. నేను చెప్పకపోయినంత మాత్రాన..."

గాంభీర్యంలోనే కొద్దిగా విషాదం మేళవించి, "తెలిసింది, బాబూ! కాని తప్పుగా అర్థంచేసుకొన్నావు నన్ను. నా పాపకు మేన మామ లున్నారు. నేను నా భర్తను వదిలి వేశానన్న సాకుతో పాపకు వాళ్ళ ప్రేమలు కరువయ్యాయి. నా పాపకు నువ్వాలోటు తీరుస్తావని ఆసిస్తున్నాను. నేను భర్తను వదిలి వేశానన్న సాకుతో నువ్వు పశువులా ప్రవర్తించబోకు."

"మీరు చాలా బుద్ధిమంతుల్లా నటిస్తున్నారు. మీలో సౌశీల్యమే వుంటే కట్టుకొన్న వాడిని వదిలివేయవలసిన అవసర మేమి వచ్చేది?"

"నా ఆశయ ఆదర్శాలకు అతడు సరిపోలేదు. విడిపోవలసి వచ్చిందంతే. చేతిలో విద్యా, ఒంట్లో సత్తువా ఉన్నంత వరకు నిజాయితీగా, నైతిక మర్యాదలు కాపాడుకొంటూ బ్రతకాలనే నా ఆశయం. కాని, మీలాంటి యువకులను పురుగులుగా మార్చి దీపంలా ఆకర్షించి మాడ్చాలని కాదు."

మాట చివర ఆవిడ కంఠంలో వినిపించిన కటుదనానికి అతడు కొద్దిగా చలించాడు. 'ఎదురింట్లోనే కదా, ఎక్కడికి పోతుంది పిట్ట?' అనుకొన్నాడేమో తల ఎగరేస్తూ వెళ్ళిపోయాడు.

'వాడిలో అపాటి మెత్తదనమే ఉంటే, ఇలాంటి సాహసానికి ఎందుకొడిగడతాడులే?' అనుకొంది భామ. 'ముందు ముందు యిలాంటి అవమానాల్ని ఎన్ని ఎదుర్కోవాలో!' భామ భయపడింది.

ఆ తరువాత అనుకొన్నవీ, అనుకోనివీ ఎన్నో జరిగాయి.

అయినా దేనికీ చలించలేదు. భర్త దగ్గరికి పారి పోవాలన్న పిరికి తనానికి స్థానమివ్వలేదు. మగణ్ణి వదిలేసిన ఆడదని తనకు గౌరవం లేకపోనీ. ఆ గౌరవం కోసం,- ఆదరణ, సానుభూతి, స్వేచ్ఛ కరువైన ఆ కాపురంలో తను బందీగా ఉండలేదు జీవితాంతం. తన జీవన నౌక నడిసముద్రంలోకి నెటివేయబడినా సరే!

## 22

పాపను భుజంమీద వేసుకొని జోకొడుతూ గుమ్మం ముందు పచార్లు చేస్తున్న భామ, ఇంటిముందు ఆగిన కారులోంచి దిగుతూన్న వ్యక్తిని చూసి కొంచెం కలవరపడింది. తలుపులు మూసేసి ఈ ఇంట్లో సత్యభామ ఉండదని చెప్పడానికి కూడా అవకాశం లేక పోయింది. బహుశః శ్యామసుందరినుండో, ఎవరినుండో అడ్రసు సంపాదించి ఉంటాడు.

తల్లిమాట గుర్తు వచ్చింది. 'ఎవడి కోసం నీ కడుపు తీపిని కూడా చంపుకొంటున్నావో వాడు నిన్ను గోతిలో...'' ఆమాట అనుకోడానికే మనస్కరించలేదు. కన్న తల్లి కూడా ఆడదాన్ని సరిగ్గా అర్థం చేసుకోలేదా? కన్నతల్లే తొందరపడినప్పుడు ఇక యీ సమాజం?

అందుకే, అతడి రాక ఇక్కడితో ఆపివేయాలనుకుంది భామ.

ఇల్లు అదేనా కాదా అని సంకోచపడుతూ వస్తూన్న ఉదయ భాస్కర్ గుమ్మం ఎదురుగా భామ కనిపించడంతో, మబ్బులు విడిచిన చందమామలా వెలిగిపోయిం దతడి ముఖం. ఈ మధ్య భామను కలుసు కోకపోయినా, కొన్ని సంగతులు తెలిశాయి, తన అక్కవల్లా, మరి కొంతమంది వల్లా. కలుసుకోవాలని చాలా రోజులనుండి అనుకొన్నాడు గాని ఏదో సంకోచం అడ్డుపెడుతూంది.

ఎన్నాళ్ళుగానో అనుకొంటున్నాడు భర్త నుండి విడిగా ఉంటున్న

ఆమెతో కలిసి ఒకమాట చెప్పాలని. అపార్థం చేసుకోగలదేమోనని భయపడ్డాడు. ఇవాళ సాహసించి బయల్దేరాడు.

"రండి."

గత్యంతరం లేనట్టుగా ఆహ్వానించింది భామ.

"పాప నడుస్తూందా? ఏం పేరు పెట్టారు?" మాటలు వెదుక్కొంటున్నాడు.

"సూర్యప్రభ. ఇప్పుడిప్పుడు గోడలుపట్టుకొని నడుస్తూంది."

చాలాసేపు ఊరకుండి అన్నాడు: "ఆరోజు అంటే—మీరు పురిటికి వెళ్ళకముందు ఆ సంఘటన మీకు జ్ఞాపకముందా? నేను వెళ్ళిపోయాక మీవారు చాలా ఘర్షణపడి ఉండాలి."

"ఘర్షణేమీ జరుగలేదు."

"మరి?"

"పరాయి మగాడి ఎదుట చెంప దెబ్బ చాలదా, ఆడది అభిమానంతో క్రుంగిపోడానికి?"

"వెళ్ళానే గాని నేను చాలా భయపడ్డాను, ఆయన మిమ్మల్ని చాలా బాధపెడుతున్నట్టుగా ఊహించుకొని."

"మీ కంత సానుభూతి దేనికి—నా మీద?"

సూటిగా నిలదీసింది ఆ ప్రశ్న. సమాధానం తోచక స్టూల్ మీదున్న బైండ్ పుస్తకం చేతికి తీసుకొని చూచాడు. "లా పుస్తకాలు చదువు తున్నట్టుందే? లాయరు కావా లనుకొంటున్నారా? ఏవో పెద్ద ఆశయాలే ఉన్నట్టున్నాయి మీకు."

"ఏదో ప్రయత్నం చేస్తున్నాను."

మరికొంత సేపు మౌనంగా ఉండి, హఠాత్తుగా అడిగాడు. "ఈ జీవితం మీకు సంతోషప్రదంగా ఉందా?"

"ఉందనుకొంటే ఉంది. లేదనుకొంటే లేదు."

"నేను ఒకమాట అడగాలనుకొంటున్నాను. ఏమీ అనుకోరు కదా?"

సూటిగా అతడి కళ్ళలోకి చూసింది. అర్థమౌతూనే ఉంది అతడి భావం.

''ఇప్పుడీ ఒంటరి జీవితం విసుగ్గా తోచకపోవచ్చు. మరి కొద్ది రోజులు పోతే ఈ జీవితం నుండి బయటపడాలని తహతహ లాడ వచ్చు. మీ లాంటి ఉత్సాహవంతులంటే నా కిష్టం. మీకు అభ్యంతరం లేకపోతే నా జీవితంలోకి భార్యగా ఆహ్వానిస్తున్నాను.''

''అయితే?''

మాటలు తడబడ్డాయి, భామ ఉదాసీనత చూసి.

''అలా జరుగాలని ఎప్పుడూ అనుకోలేదు నేను. ఆడదాని ఔన్నత్యం సహించలేని మగవాడి సాహచర్యం కష్టమనిపించే విడి పోయి ఒంటిగా ఉన్నాను. మీరూ ఆయనలాంటి వారే. కాకపోతే, మీ భార్య మిమ్మల్ని వదిలి వెళ్ళేది కాదని మీరే యిదివరలో చెప్పారు.''

''ఏ లోపంతో నా భార్యను పోగొట్టుకొన్నానో, అదే లోపంతో మళ్ళీ మిమ్మల్ని కోల్పోతానని అనుకోకండి. ఆమె పోయిన ఈ మధ్య కాలంలో నా లోపం భర్తీ చేసుకోగలంత ఎదిగిపోయా నను కుంటున్నాను.''

''ఇలా అంటున్నానని అనుకోకండి నా కా ఉద్దేశం లేదు.'' ఆవేదనగా చలిస్తూన్న అతడి నేత్రాలను చూసి, ''క్షమించండి. మిమ్మల్ని బాధిస్తున్నానేమో! కాని, తప్పదు. మా నాన్నకు మాటిచ్చాను నేను, భర్తను వదిలేశానన్న అపవాదు తప్ప మరో నింద రాకుండా, నా జీవితం సక్రమంగా నడుపుకుంటానని. ఆ మాట కోసమైనా నా మనసు పెడదారులు పట్టకుండా చూసుకోవాలి.

''మీ యందు నాకు సదభిప్రాయం లేదని కాదు. మీరు మంచి వారు. భర్త సజీవుడైనా, నిర్జీవుడైనా నాకు పునర్వివాహం గురించి దురభిప్రాయం లేదు. అయితే మీ జీవితంతో నా జీవితం జోడించడం వల్ల మన జీవితాలు సుఖాంత మౌతాయేమోగాని, నా పాప ఒంటరిదై పోతుంది.

''దానికోసమైనా ఈ ఒంటరి జీవితంపై మమత సిరపరుచుకో

వాలి. పోతే, పర పురుషుడి ప్రలోభంలో పడి కాపురం వదులుకోవ డమే గాక, కడుపు తీపిని కూడా చంపుకుందన్న అపనిందను నిజం చేసే మూర్ఖతకు స్థాన మివ్వ దలుచుకోలేదు."

భామ స్పష్టమైన అభిప్రాయంలో లేశమైనా ఆశ కనిపించక, హతాశుడై పోయాడు ఉదయభాస్కర్. బాధనంతటినీ బలవంతాన అణచిపెడుతూ, పేలవంగా నవ్వుతూ అన్నాడు: "ఏకాంతంలో ఇది మన ఆఖరి సమావేశమేమో, మరికొంచెంసేపు కూచోడానికి అనుమతి ఇవ్వాలి మీరు. మళ్ళీ ఆ టాపిక్ రానివ్వను."

"కూచోండి." చిరునవ్వు నవ్వి, పాపను తొట్టిలో పడేసి, టీ తయారుచేసి తెచ్చింది.

"లలితా ఆర్ట్సువారి నాటకం ఒకటి రవీంద్ర భారతిలో ప్రదర్శించా లనుకుంటున్నారు. నాటకం నేనే వ్రాస్తున్నాను. నాయిక పాత్రకు మిమ్మల్ని బుక్‌చేస్తా మంటున్నారు వాళ్ళు."

"నే నిక నాటకాలలో వేయా లనుకోవడంలేదు."

"చాదస్తంలో పడ్డారేమిటి?"

"భలే వారే! చాదస్త మేమిటి? మగనాలిగా ఉండి నాటకాలు వేస్తేనే పరువు పోతూందని గోలపెట్టారు. ఇప్పుడిక మొగుణ్ణొదిలేసిన దాన్ని. ఎంత నీతిగా, గుట్టుగా కాలం గడుపు కుంటున్నా రట్టుచేసి వదలాలని ఉబలాట పడుతుంది ఈ సమాజం."

"ఇప్పు డిహ పరువు పోతుందని గోలపెట్టడానికి ఎవరూ లేరు కదా?"

"పాప ఉంది. దానికోసమైనా ఈ మాయ పరువు నిలుపుకోవాలి."

"మీ కూతురి భవిష్యత్తు కోసం మీ భవిష్యత్తు నాశనం చేసుకొంటున్నట్టుంది."

"లత సాగడానికైనా, మనిషి సాగడానికైనా ఏదో ఒక ఆలంబన ఉండాలి కదా? నాకు ఆలంబనంగా నా పాపను పెట్టుకొన్నాను."

# 23

చాలా రోజుల తరువాత ఒకనాడు అదే సమయంలో, మరో డాబా గదిలో భామ పాపతో దొంగాట ఆడుతూంది. చిట్టి చిట్టి పాదాలతో తల్లిని పట్టుకోడానికి పరుగులు పెడుతున్న పాపను చూడాలంటే రెండు కళ్ళు చాలవు.

పరుగులు పెట్టడంవల్ల కలిగిన ఆయాసాన్ని తీర్చుకోడానికి కొద్దిసేపు నిలబడ్డ భామ, అనుకోకుండా అవతలికి చూసింది.

సైకిల్ స్టాండ్ వేసి ఇటే వస్తున్నాడు జగన్మోహన్.

హృదయ సంచలనాన్ని అణచే ప్రయత్నంలో పెదవులు బిగిసి పోయాయి.

ఒక్క క్షణం ఆగి, గుమ్మం పక్కన గోడకు ఉన్న నేమ్ ప్లేటు చూశాడతడు. "సత్యభామ, బి. ఎ., ఎల్. ఎల్. బి." చాల నెమ్మదిగా అడుగులు వేస్తూ వచ్చాడు.

కొత్త ముఖాన్ని చూసి పాప సిగ్గుతోనో, భయంతోనో తల్లి చీర కుచ్చిళ్ళలో ముఖం దాచేసుకుంది. దారి తప్పి ఇంట్లోకి చొరబడిన కుక్కను చూసినట్టుగా చూస్తూంది భామ, భర్తకేసి.

"నా మీద నీకింకా కోపం పోనట్టుంది...." అన్నాడతడు, సిగ్గు విడిచిన అతిథిలా కుర్చీలో కూలబడి.

"ఏం పేరు పెట్టారు దీనికి?" అన్నాడు పాపకోసం చేతులు చాస్తూ.

పాపను అతడి చేతులకిచ్చే ప్రయత్న మేదీ చెయ్యలేదు భామ.

ఆవిడ అప్రసన్నత ఇహ సహించలేనట్టుగా, "క్షమించు, సత్యా! నిన్ను చాలా బాధపెట్టాను." అన్నాడు.

"అంత పశ్చాత్తాపం ఎందుకు కలిగింది మీకు?"

"పాపం తరువాత పశ్చాత్తాపం సహజమే కదూ?"

అతడికేసి పరిశీలనగా చూసింది భామ. మనిషి ఈ మధ్యనే జబ్బుపడి, మంచంపట్టి లేచినట్టుగా ఉంది. ఆ ముఖంలో ఇదివరకటి కళా కాంతులు లేవు. ఆ ఉత్సాహం, బింకం లేవు. తల తాకినట్టుగా ఉంది మహేను భావుడికి.

"మగ మహారాజులు పాపం కూడా చేస్తారా?"

"ముందే నీ మాటలు శూలాలు. పైగా, ఇప్పుడు లాయరు వయ్యావు. మాట్లాడి నీతో గెలవగలనని రాలేదు, అర్థించి వెంట తీసుకు పోదామని వచ్చాను."

"ఏం ముఖం పెట్టుకొని వచ్చారు?"

"పశ్చాత్తాపం తరువాత శిక్షలేదు. నువ్వింకా శిక్షించాలను కొంటున్నావు. నువ్వు వచ్చేసిన తరువాత నాలుగైదేళ్ళలో నేను పోగొట్టుకొన్నదేమిటో తెలిసింది. నువ్వుండగా నీ మీద మనసు విరిగేలా చేసిన వారెవరూ నా ఒంటరి జీవితంలో నన్ను ఆదుకోలేక పోయారు. నేను చాలా పొరపడ్డాను. బాల్యంలో మగవాడు ఎంతగా తలిదండ్రుల చుట్టూ, తోబుట్టువుల చుట్టూ మనసు అల్లుకొన్నా, యవ్వన దశలో మాత్రం వాళ్ళెవరూ అతడికి కారు. అగ్నిసాక్షిగా పెళ్ళాడిన స్త్రీ మాత్రమే అతడికి తోడు నీడగా నిలిచేది. మగవాడి జీవితం స్వర్గమైనా, నరకమైనా ఆమె వల్లే. ఆడది! అరికాలి క్రింద పడి ఉండాలి

అనుకొంటే;- ఇంచుమించు నే ననుభవించిన ఫలితం లాంటిదే అనుభ విస్తాడు ఏ మగవాడైనా.

"ఈ మధ్య నా ఆరోగ్యం బాగుండడం లేదు. పది పదిహేను రోజులు జ్వరంతో తీసుకొని, మంచంలో పడితే ధర్మాసుపత్రి పాల య్యాను. అప్పుడు తెలిసింది పూర్తిగా గృహిణి విలువ. కొంచెం కోలుకోగానే నీ దగ్గరికి పరిగెత్తుకు రావాలని తహతహ లాడాను. వచ్చాను."

"గృహిణి కావాలంటే ఆడవాళ్ళు కరవయ్యారా మీకు? మళ్ళీ పెళ్ళి చేసుకొంటానని ఎప్పుడో అన్నారు కదా?"

"ఎంత నిరాదరణగా చూసినా తొలి భార్య మీదున్న ప్రేమ, మళ్ళీ పెళ్ళాడితే దానిమీద ఉండదు సత్యా. ప్రేమంటే నీకు తెలిసేమిటి, అని నువ్వు ఎత్తి పొడవచ్చుగాని, ఈ మధ్య కాలంలో ప్రేమంటే తెలిసింది. నువ్వే కావాలి నాకు, సత్యా! మనింటికి వచ్చేయి."

"నేను రాను. ఎప్పుడో తెగిపోయింది బంధం. ఈ సినిమా తంతు నా కిష్టం లేదు."

"నువ్వింత నిష్కర్షగా మాట్లాడతావని నాకు తెలుసు. అయినా సరే, నేనే నీ దగ్గర ఉండి పోదలుచుకొని వచ్చాను. వెళ్ళగొడతావా?" నిస్సహాయంగా నవ్వాడు.

తిరస్కారంగా నవ్వింది శ్యామ. "ముల్లు అరిటాకు మీద పడినా, అరిటాకు ముల్లు మీద పడినా జరిగేది మాత్రం ఒకటే."

"నీ భయం నాకు తెలుసు. కాని, ఇదివరకటివలె కాదు. కోరలు తీసిన పాము, మెడకు చుట్టుకొన్నా ఏమీ చెయ్యలేదు. ఇల్లు నీది. ఇదివరకు నీ కలలకు అనుగుణంగా తీర్చి దిద్దుకో. నేను నీ ఆజ్ఞాబద్ధుడిని."

"నే నేనాడూ మీరు నా చేతిలో కీలుబొమ్మలా ఆడాలని కోరుకో లేదు. సహజీవితం గడపాలని మాత్రమే కోరాను. ఒకరి వ్యక్తిత్వాన్ని ఒకరు మన్నించుకొంటూ, ఒకరిని ఒకరు అర్థంచేసుకొంటూ, కష్ట సుఖాలలో సహకరించుకొంటూ గడపాలని మాత్రమే కోరాను. ఆపాటి సౌఖ్యానికే కరువుచేసి, తరిమేశారు నన్ను. కాపురానికి వచ్చిన ఆడ దంటే మీ దృష్టిలో గడానికి వచ్చిన ఎద్దు!"

"అవన్నీ ఇదివరకు అన్నవే ఇప్పుడంతా నీ ఇష్టమే అంటు న్నానుగా? నేనింటికి వస్తే పొలంలో గడెం తోలి వచ్చిన పాలేరులా చూసినా సరే. నీ తోడునీడ నాకు కావాలి." తనను తను ఎంత తృణీ కారం చేసుకొంటూ మాట్లాడినా, అందులో వెటకార మేమీలేదు.

అతడి కళ్ళల్లోని దైన్యాన్ని చూస్తూ, మళ్ళీ మళ్ళీ నిరాకరిస్తూ మాట్లాడలేక పోతూంది! అయినా కాదని, తను బావుకొనే దేముంది?

ఎంత ప్రాక్టీసు పెరుగుతూన్న అడ్వకేటు అయినా, ఎంతగా సంపాదించుకుంటున్నా, ఏదో విధంగా సంఘంలో గౌరవ ప్రతిష్ఠలు సంపాదించుకుంటున్నా, గృహిణీత్వంలోగల సంతృప్తి, ఆనందం, గర్వం ఎలా వస్తాయి?

ఉవ్వెత్తుగా ఎగసిపడే కడలి కెరటాల మధ్యనుండి తప్పించు కొని, ప్రశాంతంగా సాగిపోయే నదీప్రవాహంలోకి చేరుకోగల అవకాశం తిరిగి లభిస్తూంటే, తన జీవన నౌకా గమనాన్ని మార్చకపోవడం అర్థ రహితమే కాదు, మూర్ఖతకూడా అవుతుందేమో!

తన కలలు పండే రోజు వస్తూంటే, తనకు కావలసిన స్వేచ్ఛ లభిస్తూంటే, అంతకంటే ఏం కావాలి?

మనసు మారుతూ ఏదో ఉద్వేగం ఆవహిస్తూంటే, అక్కడ నిలువలేక, పాపను ముందుకిస్తూ నాన్న దగ్గరికి వెళ్ళు, ప్రభా! నాన్నకు టీ చేసి తెస్తాను,'' అంది. మధురమైన ఊహలతో మనసు ఊగిపోతూంటే లోపలికి పారిపోయింది భామ-''ఇన్నాళ్ళు దానికి తండ్రి ప్రేమ కరువు చేశారు. దానికి మీమీద కోపంగా ఉంది. ముందు దాన్ని ప్రసన్నం చేసుకోండి!'' అంటూ.



# ఎమెస్కో ప్రథమ శత పుస్తక జాబితా

1. దిండుక్రింది పోకచెక్క–
విశ్వనాథ సత్యనారాయణ (నవల) (2–వ ముద్రణ)
2. బ్రతికిన కాలేజీ–పాలగుమ్మి పద్మరాజు (నవల) (2–వ ముద్రణ)
3. సాక్షి–ముళ్ళపూడి వెంకటరమణ (సినీ స్క్రిప్టు)
4. గ్రహణం విడిచింది–ద్వివేదుల విశాలాక్షి (నవల) (2–వ ముద్రణ)
5. విచిత్రనవోదయం–నలం (హాస్య, వ్యంగ్య కథలు)
6. పిడికెడు ఆకాశం–గొల్లపూడి మారుతీరావు (నవల)
7. హౌస్‌సర్జన్–కొమ్మూరి వేణుగోపాలరావు (నవల) (2–వ ముద్రణ)
8. నిరీక్షణ–ఉన్నవ విజయలక్ష్మి (నవల)
9. కాశ్మీరపట్టమహిషి–పి. గణపతిశాస్త్రి (నవల)
10. ఆత్మబలి–సి. ఆనందారామం (నవల)
11. ముఖంకోసం–వీరాజీ (నవల)
12. బంధమూ, అనుబంధమూ–పి. వి. కృష్ణమూర్తి (నవల)
13. స్వీట్ హోం–ముప్పాళ రంగనాయకమ్మ (నవల) (3–వ ముద్రణ)
14. మారని కెరటాలు–మంజుశ్రీ (నవల)
15. కోనేరు, గులాబీలు–వాసమూర్తి (నవల)
16. ఇదే దారి–బలివాడ కాంతారావు (నవల)
17. బుద్ధుని జాతక కథలు–శ్రీ శివశంకరస్వామి
18. అహం–అన్యం–ముద్దంశెట్టి (నవల)
19. స్వయంవరం–మహీధర రామమోహనరావు (నవల)
20. అదృష్టచక్రం–'హరికిషన్' (నవల)
21. మకరముఖులు–ఇతర కథలు–మధురాంతకం రాజారాం

24. ప్రాణాంతక ప్రణయం-వి. యస్. అవధాని (నవల)

25. శ్రుతితప్పిన రాగం-పి. వి. రాజమన్నారు (నవల)

*26. చిట్లీ చిట్లని గాజులు-విశ్వనాథ సత్యనారాయణ (నవల)

*27. దైవమిచ్చిన భార్య-చలం (నవల)

28. రత్నకంబళం-దేవనూరి శమంత (నవల)

29. వారధి-ద్వివేదుల విశాలాక్షి (నవల) ద్వి. ముద్రణ

30. అపరాజిత-వాకాటి పాండురంగరావ్ (కథలు)

*31. పూల తెరలు-కోమలాదేవి (నవల)

32. అది ప్రశ్న, ఇది జవాబు-అవసరాల రామకృష్ణారావు (నవల)

33. ఇద్దరం ఒకటే-వీరాజీ (నవల)

34. కల్యాణ ఘడియ-అద్దేపల్లి వివేకానందాదేవి (నవల)

35. ప్రేయసి: ప్రియంవద-ఉషశ్రీ (జంట నవలలు)

36. దరిజేరిన ప్రాణులు-ఇల్లిందల సరస్వతీదేవి (నవల)

37. హారతి-కొమ్మూరి వేణుగోపాలరావు (నవల) (ద్వి. ముద్రణ

38. వెన్నెల కాటేసింది-గొల్లపూడి మారుతీరావు (నవల)

39. సరళీస్వరాలు-నందుల సుశీలాదేవి (నవల)

40. మంచుపల్లకి: మరి తొమ్మిది-శ్రీపతి (కథలు)

41. దుఃఖితులు-రంధి సోమరాజు (నవల)

42. చైత్రపూర్ణిమ-పి. గణపతిశాస్త్రి (కథలు)

43. బ్రతుకుజోడు-ఏ. లక్ష్మీరమణ (నవల)

44. సిపాయి కూతురు-కొవ్వలి లక్ష్మీనరసింహారావు (నవల)

45. కొత్త నీరు-డి. కామేశ్వరి (నవల)

*46. లేడీ డాక్టర్-నండూరి విఠల్ (నవల)

47. పూదోటలో గంటుముళ్లు-గంటి(శిఖా) వెంకటరమణ (నవల)

48. జీవితదృశ్యాలు-మంజుశ్రీ (కథలు)

49. లావణ్య-మాలతీ చందూర్ (నవల)

50. ఆరాధన—యద్దనపూడి సులోచనారాణి (నవల) (3వ ముద్రణ)
51. సౌదామిని—విశ్వనాథ సత్యనారాయణ (నవల)
52. కన్యాశుల్కం—గురజాడ అప్పారావు (నాటకం) (2వ ముద్రణ)
53. జీవితాదర్శం—చలం (నవల)
54. చీకటి కడుపున కాంతి—సి. ఆనందారామం (నవల)
55. ఇంతకీ నే నెవరు?—కపిల కాశీపతి (నవల)
*56. మనుషులు, మనసులు—పవని నిర్మలా ప్రభావతి (నవల)
57. వెలుగులో వెలది—గంధం యాజ్ఞవల్క్యశర్మ (నవల)
58. పెళ్ళి చెయ్యకుండా చూడు—కొడవటిగంటి (కథలు)
59. కవిద్వయము—నోరి నరసింహశాస్త్రి (నవల)
60. సంఘం చేసిన మనిషి—పోలాప్రగడ సత్యనారాయణమూర్తి (నవల)
61 అచలం: చంచలం—దేవసూరి సువర్ణ (నవల)
*62. చీకటిదారి: చిన్నవదినె—కె. రామలక్ష్మి (నవలికలు)
63. రాజశేఖర చరిత్రము—కందుకూరి వీరేశలింగము (నవల)
64. నల్లరేగడి—పాలగుమ్మి పద్మరాజు (నవల)
65. ఏటిఒడ్డున నీటిపూలు—కొలిపాక రమామణి (నవల)
66. మహానగరంలో స్త్రీ—లత (నవల)
67. చిలకమర్తి ప్రహసనములు—చిలకమర్తి లక్ష్మీనరసింహము
*68. మైదానం—చలం (నవల)
69. హాట్ హోం—శార్వరి (నవల)
70. అనాపిలక్: జీవనరాగం—సోకిన్ (నవలికలు)
71. 1968 కథానికలు—సంకలన: పతంజలి, మురళీధర్
*72. పుణ్యభూమి—బలివాడ కాంతారావు (నవల)
73. చేదునిజాలు—పరిమళా సోమేశ్వర్ (నవల)
74. చిత్రకారుడి భార్య—మురయా (నవల)
75. రామానుజుని ప్రతిజ్ఞ—పి. రాజగోపాలనాయుడు (నవల)
76. దూతమేఘము—విశ్వనాథ సత్యనారాయణ (నవల)

*77. హరివిల్లు-ద్వివేదుల విశాలాక్షి (నవల)
*78. కొత్త ఇల్లు-తాళ్ళూరు నాగేశ్వరరావు (నవల)
79. ముత్యాల పందిరి-వోరంకి దక్షిణామూర్తి (నవల)
80. గద్వాల చీర-పన్యాల రంగనాథరావు (నవల)
81. మేఘాల మేలిముసుగు-మాలతీచందూర్ (నవల)
*82. గణపతి-చిలకమర్తి లక్ష్మీనరసింహము (హాస్య నవల)
83. బ్రతుకు బొంగరం-రావులపాటి సీతారాంరావు (నవల)
*84. శారదరాత్రులు-వేదుల శకుంతల (నవల)
85. స్నేహబంధం-అంగర వెంకటసత్యనారాయణరావు (నవల)
86. హంపీకన్యలు-యవనవ్వనం-చలం (నవలికలు)
87. విద్యార్థి సాహితి—కథాంజలి
88. నిశ్శబ్ద సంగీతం—సి. ఆనందారామం (నవల)
89. తొణకిన స్వప్నం: తొలగిన స్వర్గం-రేవనూరి శమంత (నవల)
90. కంఠాభరణము-పానుగంటి లక్ష్మీనరసింహారావు
(సాంఘిక నాటకం)
91. నాటకాలరాయుడు-గొల్లపూడి మారుతీరావు (సినీస్క్రిప్టు)
92. త్రిశంకుడి స్వర్గం-మధురాంతకం రాజారాం (నవల)
*93. మల్లిక-పణతుల రామచంద్రయ్య (నవల)
94. ప్రేమించు ప్రేమకై-కె. రామలక్ష్మి (నవల)
95. మనిషి-నండూరి విఠల్ (నవల)
96. బుద్ధిమంతుడు-ముళ్ళపూడి వెంకటరమణ (సినీ స్క్రిప్టు)
97. మాతృమందిరము-వేంకట పార్వతీశ్వరకవులు (నవల)
98. రెండవ అశోకుడి మూణ్ణాళ్ళపాలన-
పాలగుమ్మి పద్మరాజు (నవల)
99. ఆత్మీయులు-యద్దనపూడి సులోచనారాణి (సినీనవల)
100. ఒకేపాటకు రెండు రాగాలు-
కొమ్మూరి వేణుగోపాలరావు (నవల)

*పునర్ముద్రణలో ఉన్నవి




సరిగ్గా సంవత్సరానికి, సొంతానికి, సంసారపక్షమైన ఒక చిన్న గ్రంథాలయం కూర్చుకోడానికి ఘనమైన ఉపాయం హెచ్. ఎల్. పి. —అదే ఇంటింటా స్వంత గ్రంథాలయం ప్రణాళిక:

**ఏమి చేయాలి? ఏమేమి వస్తాయి?**

**మీరు చేయవలసిందల్లా ఒక్కటే:**

నెల నెలా రూ. 7-50 చొప్పున వరసాగ్గా 12 నెలలు కట్టండి. అంతకుమించి మరేం చేయనక్కర్లేదు.

ఇక చూసుకోండి దాని ఫలితం.

(1) మీరు కట్టే ఆ మొత్తం రూ. 90 కు రూ. 136 ల ఫలితం ముడుతుంది. ఫక్తు రూ. 100 లకు దేశంలో పెద్దపెద్ద సంస్థలన్నీ ప్రచురించిన సుమారు 3,500 ఉత్తమ తెలుగు పుస్తకాలు, 400 కు పైబడి ఇంగ్లీషు పుస్తకాల (Jaico & Orient Paper Backs) జాబితాలనుంచి మీయంతట మీరుగా ఏరి కోరుకునే మంచి పుస్తకాలు వస్తాయి.

(2) రూ. 20 లకు పైగా విలువ చేసే పది పుస్తకాలు - మా ఉచిత పుస్తకాల పెద్ద జాబితానుండి మీ అంతట మీరుగా ఎన్నుకునేవి- అదనంగా, ఉచితంగా వస్తాయి.

(3) రూ. 6 లు ఖరీదుచేసే మా మాసపత్రిక 'పుస్తక ప్రపంచం' సంచికలు ఆ 12 నెలలూ మీకు మా ఖర్చుతో వస్తాయి.



రూ. 8-50 దాకా అయ్యే ఖర్చులు మేమే భరిస్తాము

(5) రూ. 1-50 ఖరీదు చేసే మా కొత్త క్యాటలాగు వేరే ఉచితంగా వస్తుంది. అంటే- ఈ నాలుగింటా మీరు కట్టే



మొత్తానికి పైస-అంటులో సగానికి సగం ఉచితంగా వస్తుంది. దీన్ని గనక లెక్కగడితే మీకు సగానికి సగం (50 శాతం-50%) లాభమన్నమాట.





ఇక ఇవి అందే విధానం:

మొదటి నెల చందా రూ. 5-00 కట్టగానే-



(1) మీరు ఏరి కోరుకునే 4 ఉచిత పుస్తకాలూ, (2) ఆ నెల 'పుస్తక ప్రపంచం' పత్రికా, (3) 3,500 తెలుగు - 400 పైగా ఇంగ్లీషు పుస్తకాల వివరాలున్న కేటలాగులూ, (4) మీ ఖాతా వివరాలు మీకై మీరు వ్రాసి



పెట్టుకోడానికి కితాబ్దు పుస్తకమూ- మొదలైనవి అందుతాయి.

6 నెలలు చందా కట్టేసరికి?



మా తెలుగు, ఇంగ్లీషు పుస్తకాల క్యాటలాగుల్లో నుంచి మీరు ఏరి కోరుకునే రూ. 45 ల పుస్తకాలూ, మరి 3 ఉచిత పుస్తకాలూ అందుతాయి.



12 నెలలు పూర్తి కాగానే?



మరో రూ. 55 ల పుస్తకాలూ, మరో 3 ఉచిత పుస్తకాలూ అందుతాయి. ఈ 12 నెలలూ - నెలనెలా మీకు 'పుస్తక ప్రపంచం' పత్రిక మీ ఇంటికి నేరుగా వచ్చి వాలుతుంది.



పై వాటికయ్యే పోస్టేజీ, రవాణా ఖర్చులన్నీ మేమే భరిస్తాము.



గడువు పూర్తయ్యాక మాటేమిటి?



12 నెలలూ పూర్తి చేస్తే మీకు కొన్ని యావజ్జీవిత సదుపాయాలు కలుగుతాయి.

ప్యాకింగ్‌లు ఉచితం.

(2) అవసరమైనప్పుడు రూ. 50 లు మించకుండా పుస్తకాలు నెలలోగా డబ్బు చెల్లించే అరువుపద్ధతిమీద మా వద్ద తీసుకోవచ్చు.

(3) 'పుస్తక ప్రపంచం' చందాలో కూడా 10% తగ్గింపబడ్తుంది.

(4) ఉత్తరోత్తరావచ్చే పెద్ద, చిన్న క్యాటలాగులన్నీ ఉచితం.

(5) "ఇంటింటా స్వంత గ్రంథాలయాలు" ఉంచగల వారి పేర్లు ఛాయాచిత్రాలతో సహా, పలువురికీ ఉపయోగించగల విధంగా తీర్చిదిద్దిన సువర్ణ గ్రంథంలో మీ పేరూ, ఫోటో కూడా చేర్చబడతాయి.

పోతే. ఎప్పుడైనా ఏదైనా అవాంతరం వస్తేనో? లేక అసలు మానేస్తేనో?

మీకేం నష్టముండదు. చందాదారులు ఒకవేళ ఎప్పుడైనా, ఏ కారణంచేతనైనా అర్థాంతరంలోనే చందా మానివేయదలిస్తే నిరాక్షేపణగా మానివేయవచ్చు. అప్పటికీ, వారు కట్టిన సొమ్ము వారికి పుస్తకాల రూపంలో ముట్టజెప్పబడుతుంది. కాకపోతే ఈ లెక్కలో, వారికి అంతవరకూ పంపిన ఉచిత పుస్తకాలూ, 'పుస్తక ప్రపంచం' సంచికల ధరా, రవాణా ఖర్చులు మినహాయిస్తాం.

---

## H. L. P. ఇంత వరకు సాధించినది-

* ఇప్పటి వరకు దాదాపు 29,000 చేరారు.
* వారు కోరుకున్న పుస్తకాలు 7,00,000 పైగా అందజేశాము.
* ఇందులో 1,60,000 పుస్తకాలు ఉచితంగా పంపాము.
* ఇవన్నీ 56,000 పైగా బంగీలలో ఖర్చులు మేమే భరించి రవాణా చేశాము.
* పుస్తక ప్రియుల మాస పత్రిక 'పుస్తక ప్రపంచం' 11,00,000 ఉచితంగా పంపాము.

పుస్తక జాబితానుంచి ఎన్నుకోండి.

చందా కట్టే విధానం:

(1) మా ఎమెస్కో ప్రథమ శత పుస్తక జాబితానుంచి మీకు నచ్చిన 4 పుస్తకాలు ఎంచుకుని, క్రింది కూపనులో ఆ నెంబర్లు వేయండి. (2) పూర్తిచేసిన కూపనూ, మొదటినెల చందా రూ. 7-50 మనియార్డరూ-

"ఇంటింటా స్వంత గ్రంథాలయం" ప్రణాళిక,
ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్,
రాష్ట్రపతిరోడ్డు, సికింద్రాబాద్-అనే చిరునామాకు పంపండి.

(3) తరువాత నెలనెలా రూ. 7-50 చందాను ఆయా నెల ఆఖరులోగా చందా మొత్తం రూ. 90 పూర్తి అయ్యేదాకా పై అడ్రసుకు పంపుతూ వుండాలి-అంతే.

ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, రాష్ట్రపతి రోడ్డు,
సికిందరాబాదు వారికి—

అయ్యా, మీ 'ఇంటింటా స్వంత గ్రంథాలయం' ప్రణాళికలో నన్ను ఒక చందాదారుగా చేర్చుకొనగోర్తున్నాను. మొదటి నెల చందా రూ. 7-50 మనియార్డరుద్వారా పంపినాను. తొలి విడత ఉచిత పుస్తకాలు నాలుగూ ఈ క్రింద వేయబడిన నంబర్లవి పంపగోర్తున్నాను. మీ నిబంధనలకు బద్ధుణ్ణి.

[ ] [ ] [ ] [ ]

పేరు........................ ... ఇట్లు,

చిరునామా........................ ....

ఊరు........................ తేదీ.